DIGANTALA KAVALA

By

S. Jhansi Rani, B.Sc., D.M

*First Edition*
January 1980

*Cover Design*
TRIGUN

*Publishers*

Navaratna Book Center
Eluru Road, Vijayawada-2

*Printers*

'Gramaswarajya'
Vijayawada-2

*PRICE*
*Rs. 10-00*

# దిగంతాల కావల

"అమ్మా ప్రభా! ఇలా ఓమాటు వస్తావ ?"

"వస్తున్నా మామ్మా" అంటూ ప్రక్కగదిలో నుంచి పిలిచిన మంగాయమ్మగారి దగ్గరికి వెళ్ళింది ప్రభ.

ఆమె ప్రభను కొరకొరా చూస్తూ.

"ఎవడే వాడు?" అన్నది,

"ఆయన మా క్లాస్‌మేట్ లే మామ్మా. ఆ...వంట మనిషి రాలేదా. ప్లీజ్ మామ్మా నువ్వన్నా కొంచెం, టిఫిను...టీ"

"అబ్బ, నే నెప్పుడో చెప్పాను. ఈ పాడుకాలేజి చదువు మానెయ్యవే అని, విన్నావా?"

"ఇప్పుడేమయింది మామ్మా'"

"బాగుంది, బడితెలాంటి మగాణ్ని వెంటేసుకు తిరుగుతూ, ఏమయిందంటావేమే. సిగ్గులేదూ! మా కాలంలో ఇలా తిరిగితే నిలువునా చర్మం వొలిచి" ఆమె ఆగింది.

"చర్మంవొలిచి, డప్పులు కట్టి వాయించేవారంటావు. అంతేనా. రోజులు మారాయిమామ్మా."

"రోజులు మారాయి. ఇక [illegible] ఆ రోజుల్లోకూడా రోజుకు ఇరవై నాలుగు గంటలే, ఇప్పుడూ అంతే. కాకపోతే...కొంచెం నాగరికత పెరిగింది. అంతే."

"ఎందుకే అలా ముసిముసి నవ్వులు నవ్వుతూ సమాధానం చెప్తావు. నాగరికతంటూ, నా [illegible] పోతుందా. ముందు వాడెవడో వాడ్ని ప్రత్యేకంగా తగిలెయ్యి."

"మామ్మా అంత చీకాకయితే ఎలా. ఆయన నీతో పనుండొచ్చాడు. నాకు క్లాస్‌మేట్ అంతే. మరి వచ్చిన అతిథికి కాస్త టీ అయినా పోస్తే పోతావా" అంటూ అక్కడనుంచి డ్రాయింగ్ హాల్లోకి వెళ్ళిపోయింది ప్రియ.

"తల్లిలేని పిల్లకదా అని కడుపులో పెట్టుకుని కాపాడుతూవుంటే, ఇది రోజు రోజుకూ మితిమీరిపోతుంది. కాని, నీ పని ఇలాకాదు ఈరోజు, తాడో పేడో తేల్చుకోవాలి. వాడి సంగతి, నీ సంగతి తేలుస్తా మంగాయమ్మ తడాకా చూపిస్తా."

అలా అంటూనే ఆమె గ్యాస్ స్టౌ వెలిగించి ఉప్మా, టీ తయారుచేయటానికి కూర్చుంది. డ్రాయింగ్ హాల్లోనుంచి ఇక ఇకలు, పకపకలు వినిపిస్తూవున్నాయి. మంగాయమ్మ నిప్పుల్లోపోసిన ఉప్పులా చిటపటలాడుతూ టిఫిను, టీ తయారుచేసింది. వేడి ఉప్మా రెండు సాసర్లలో

సర్ది, అందులో రెండు చెంచాలు వేసింది. అలాగే రెండు కప్పులలో టీ కూడా పోసింది,

"ప్రభా, ఇలారా" అన్నది.

"వస్తున్నా" అంటూనే ఆమె డ్రాయింగ్ హాల్లో కూర్చొని మాట్లాడుతుంది.

మంగాయమ్మగారికి వొళ్ళు మండింది. ఆమె ప్రభను నాలుగైదుసార్లు పిలిచింది. కానీ ఆమె వస్తున్నానంటూ సమాధానం చెప్తూనే వుంది.

"పిళ్ళ కోసం ఇలా కాకూడదు. అది ఎలా కుదర్చాలో నాకు బాగా తెలుసు" ఆమె అక్కడేవున్న టేబుల్ సాల్టు చెంచాతో తీసి, రెండు టీ కప్పులలో వేసి కలిపింది. ఇంతలో ప్రభ వచ్చి, ఉప్మాప్లేటు, టీ కప్పులు ట్రేలో సర్దుకుని డ్రాయింగ్ హాలులోకి వెళుతూ,

"మామ్మా, నువ్వూ రావాలి. ఆయన నిన్ను చూడాలి మాట్లాడాలి అంటున్నారు" అన్నది.

ఇంక గత్యంతరంలేక, మంగయమ్మగారు డ్రాయింగ్ హాలులోకి వెళ్ళింది. ఆ వచ్చిన వ్యక్తి, ఆమెకు నమస్కరించాడు. ఆమె కూడా ప్రతినమస్కారంచేసి కూర్చొంటూ,

"టిఫిన్ చల్లారిపోతుంది తినండి" అన్నది.

"మామ్మా, ఉప్మా, చాలా బాగుంది. నువ్వే మంటావు!" ఆ వ్యక్తిని అడిగింది ప్రభ.

"ఔను బాగుందనుకుంటాను."

ఆ వ్యక్తి సమాధానానికి, మంగాయమ్మగారికి కోపం వచ్చింది.

"బాబూ మన కేవూరు? నీ పేరు ఏమిటి? ఏం చదువుతున్నావు?" ప్రశ్నలవర్షం కురిపించింది మంగాయమ్మగారు.

సమాధానం చెప్పబోయిన, ఆ వ్యక్తికి పొరబోవడంతో దగ్గొచ్చింది. దగ్గు చాలా సేపటివరకు తగ్గలేదు.

"మామ్మా, ఆయనేదో తింటున్నాడాయె. దాంతోపాటు నువ్వు ప్రశ్నలన్నీ దొంతరగా చేర్చి ఆయననోట్లో కుక్కితే ఎలా చెప్పు! పాపం అవస్థపడుతున్నాడు" అన్నది.

"నువ్వాగవే పిల్లా, బాబూ నీ పేరన్నా చెప్పు!" అన్నది.

"నా పేరా... నా పేరు... అహ... హా... హా... హా... నా పేరు... హా... హా... హా... నా పేరు... స... సలీ... సలీమ్"

"ఏమిటీ, మీరు సాయిబులా బాబూ!"

"ఔనండి"

అప్పటికే, ప్రభ, సలీమ్ టిఫిన్ పూర్తిచేశారు.

"తాగు బాబు టీ. చాలా బాగుంటుంది. మావారు బ్రతికున్న రోజులలో కూడా నా చేతి టీ అంటే, చెవులు కోసుకునేవారు ఆయనికి చాలా మందిముస్లిము స్నేహితు

లుండేవారు. మరి వాసనెక్కడికి పోతుంది? తాతగారిబుద్ధులే మా ప్రభకి" అన్నది.

ఇద్దరూ టీ కప్పులునోటి దగ్గర పెట్టుకున్నారు.

"అబ్బా, మామ్మా...టి అంతా...ఉ..." ఆమె టి తాగాలో ఉమ్మివెయ్యాలో తెలియక అలాగేఉంది.

"తాగండి బాబూ, చాలా మంచి టీ. మావారు కూడా, నాచేతి టి తాగుతూ, చిన్నపిల్ల వాళ్ళు ఆవదం తాగేటప్పుడు ఊ...ఊ...అన్నట్లు అనేవారు. ఊ... మింగండి" ఆమె వాళ్ళను ఉత్సాహ పరిచినట్లుగా మాట్లాడింది.

ఇంక గత్యంతరం లేక, సలీమ్‌తో పాటు ప్రభకూడా టీని విషం మింగినట్లుగా తాగారు.

"వంటమనిషి రాలేదు బాబూ! వచ్చుంటే. మీ కోసం ఈ టి లాంటి స్పెషల్ చేయించేదాన్ని" అన్నది,

మంగాయమ్మగారు చెప్తూవుంటే, ప్రభ సలీమ్ వొకరినొకరు చూసుకున్నారు. ముసలమ్మ కావాలనే ఉప్పు

కలిపిన టి తమకిచ్చిందని నిర్ధారణ చేసుకున్నారు.

"మామ్మా"

"ఏవిటే పిల్లా?"

"ఈయన నీతో మాట్లాడటతారట"

"మాట్లాడమను"

"చూడండి, మామ్మగారూ, మీ అమ్మాయి నేను

ప్రేమించుకున్నాం. పెళ్ళి చేసుకుంటాం. దానికి మీ అంగీకారం కావాలని మీ పేరనున్న ఆస్థి అంతా మా ఇద్దరి పేర్న పెట్టాలి. మీరు మా పెళ్ళికాగానే, కాశీ వెళ్ళిపోవాలి. తరువాత..."

"ఆగావేం నాయనా, డ్రామాలో పోర్షను రాకపోతే వెనకటికి సీలాగానే అవస్తపడేవాళ్ళు. ఇప్పుడో ఈ మాయదారి సినిమాలొచ్చాయిగా అంతామారేం. మనిషినిమార్చి మనిషిని మాటమార్చి మాటని, మనిషిలేని పాటని చూపిస్తున్నారు, వినిపిస్తున్నారు."

"అది కాదండీ, మరి మీ యిష్టమయితే, ఆమెని వివాహమాడుతా"

"నేనొద్దంటే ఆగుతావా బాబూ, మీరిద్దరూ సలీ అనార్కలీలుగా సుఖంగా వుండండీ."

"ఛీ... అదేందివె మామహా పాపం వాళ్ళిద్దరూ విడిపోయారు, అనార్కలిని జీవసమాధి చేశారు" అన్నది ప్రభ.

"ఆ... ఆ రోజులు వేరు. ఈరోజులు వేరు. శ్రీరామచంద్రుడు సీతాదేవి అని పేరుపెట్టుకున్న వాళ్ళంతా అడవికిపోతున్నారా? రావణాసురుణ్ని చంపుతున్నారా?"

"అది నిజమేననుకోండి. పెళ్ళికిముందు, నేనడిగినవి.." అన్నాడు సలీమ్.

"అలాగే బాబూ. మీ వాళ్ళని కూడా పిలుచుకొస్తే అన్నీ మాట్లాడుకుందాం." అన్నది మంగాయమ్మగారు.

ప్రభ సలీమ్ మళ్ళీ ఒకరి ముఖాలు ఒకరు చూసుకుంటూ గుటకలు మింగారు. అది గమనించిన మంగాయమ్మగారు,

"ఏమిటి ఆలోచిస్తున్నారు! పెళ్ళికి పెద్దవాళ్ళొప్పుకోరా ఏమిటి ఖర్మ"

"అదేనండి నా అనుమానం అందుకే రిజిష్టర్ మ్యారేజి చేసుకుందాం" అన్నాడు సలీమ్.

"ఔను మామ్మా, నువ్వు సరే అన్నావో, అంతా క్షణాల్లో జరిగిపోతుంది" ప్రభ అతని మాటల్ని బలపరచింది.

"ఓ... దానికేముంది.

ఈ రోజుల్లో పిల్లలందరికీ అందునా బాగా చదువుకున్న పిల్లలందరికీ అన్నీ తెలుసు పెళ్ళిచేసుకోవడం. పిల్లల్ని కనడం. రోజులు బాగా మారాయిగా... మరి"

ఆమె వారితో మాట్లాడుతుండగానే, వంట మనిషి వెనగ్గా పనిమనిషి వచ్చారు. వాళ్ళని చూస్తూనే మంగాయమ్మగారు.

"ఇదిగో, హీటర్ ఆన్ చేసి ఈ అబ్బాయికి తలంటండి. ఇంతలో ప్రభ కూడా తలంటుకుంటుంది. ఓరే ఈ అబ్బాయికి సున్నిపిండి తెచ్చి నలుగు పెట్టరా... ఆ

వంటాయన్ని కూడా సాయం తీసుకో. మరి మీా స్నానంతో పెళ్ళికళరావాలి" అన్నది.

మంగాయమ్మగారి మాటంటే ఆ ఇంట్లో శాసనమే. అందుకే వంటవాడు, పనిమనిషి వెంకా అతనిదగ్గరికివచ్చారు,

"చూస్తారేం, తీసికెళ్ళండి" అన్నది మంగాయమ్మ.

వారు సలీమ్ చేతులు చెరొకటి పట్టుకోబోయి ఆగారు.

"మా... మా... మ్మా"

"ఏవిటే పిల్లాడ!"

"మరి... మరి... ఈమె... ఈమె"

"ఛీ...నోరుముయ్యవే, పెళ్ళంటే సిగ్గుపడే రోజులు పోయి ఆడదికూడా మగాడిలా మాట్లాడుతుంది. టైమయి పోతుంది నువ్వు త్వరగా తెవులు"

"చూస్తారేం చవటల్లా. పెళ్ళి కొడుకుకొంచెం మొఖ మాటపడే మనిషి. ఊ... కానివ్వండి" అన్నది ఆమె.

వా రిద్దరూ సలీమ్‌ను చెరో చెయ్యిపట్టుకొని లేపారు. మొరటుగా వున్న వెంకాయి అతని బుష్ షర్టు గుండీలు వూడదీయబోయాడు. సలీము అతన్ని ఆ పని చెయ్యకుండా ఆపుతున్నాడు. కానీ అతను వేసుకున్న బెల్ బాటము ప్యాంటులో కాళ్ళు ఇనిగి పోవడం స్పష్టంగాకనిపిస్తూవుంది. ఇంతలో వంటమనిషి బాగా పెరిగివున్న హిప్పీ క్రాపు తడి మాడు. అంతే పొడుగుపాటి జడ ఊడింది. అది చూసిన వెంకాయి, వంటమనిషి దూరంగా జరిగారు.

"న... నన్ను... క్షమించండి... ఏదో జోక్ చెయ్య బోయాం... కాని... కాని..."

"అమ్మాయి, నువ్వూ మా ప్రభ ఆడిన నాటకం నాకు తెలిసిపోయింది. అందుకే నేనూ జోక్ చేశాను. కూర్చోండి ఫరవాలేదు." అంటూ నవ్వింది మంగాయమ్మ గారు.

ప్రభతోపాటు ఆ అమ్మాయికూడా సిగ్గుపడి తల వంచుకు కూర్చున్నారు.

"అమ్మాయిలు! మీరునవ్వులాటకు చేసినవి వొకోక్క సారి నిజం కావచ్చు. మీరు చిన్నప్పుడు "నాయనా పులి వచ్చే" అనే గొల్లపిల్లవాడికథ చదివేవుంటారు" అన్నది.

"అదికాదు మామ్మా. ఏదో తమాషాకు చేశాం అంతే" అన్నది ప్రభ.

"మీ అమ్మకూడా ఇలాంటి తమాషాలే ఆడింది తల్లీ! ఏమయిందో తెలుసా? ఒక రోజున నీలాగే కాలేజీ నుంచి వస్తూవుండగా వో అమ్మాయిని వెంటబెట్టుకొచ్చింది. ఆమె కూడా వెంటవచ్చిన వ్యక్తిని క్లాస్ మేట్ అన్నది. వరసగా నాలుగురోజులు కాలేజీ సెలవులొచ్చాయి. తన స్నేహితురాలు కూడా తనతో వుంటుందంటూ చెప్పింది.

మీ తాతగారూ నేనూ నిజమే ననుకున్నాం. ఇంట్లో వున్న నౌకర్లు ఎలా పసిగట్టారో ఏమో మీ మమ్మి వెంట

వున్నది ఆడ కాదు మగ అని. ఆ విషయం నెమ్మదిగా మా దాకా వచ్చింది. మేం నమ్మలేదు. కానీ దేనికయినా మంచి దని వాళ్ళిద్దరినీ పిలిపించాం. పాపం ఆ అబ్బాయి తప్పించు కుని పారిపోవడానికి ప్రయత్నించాడు. కానీ మా నౌకర్లు అతన్ని వదలలేదు.

విషయం బైట పడటంతో నాలుగు తిట్టాం. కానీ విషయం అప్పటికే చెయ్యి దాటిపోయింది. వారిద్దరూ ప్రేమిం చుకున్నాం అన్నారు. పెళ్ళిచేసుకుంటామన్నారు. మొదట మేం ఇష్టపడలేదు, మీ మమ్మీ తాను గర్భవతినని చెప్ప డంతో మాకు మతులుపోయాయి. ఇంక చేసేదిలేక ఆ అబ్బాయి కులంగోత్రం, ఆస్తిపాస్తులు విచారించకుండా పెళ్ళి చేసేశాం. ఆయనే మీ డాడీ. మాడబ్బుతో చదువుసంధ్యలు ఉద్యోగం సంపాయించి నిన్ను మీ అమ్మని వదిలి వెళ్ళి పోయాడు. అంతేకాదు తన దగ్గర బంధువుల అమ్మాయిని వివాహమాడాడు. నిన్నూ, మీ మమ్మీని పూర్తిగా మరిచి పోయాడు, దుర్మార్గుడు" అంటూ మంగాయమ్మగారు వాళ్ళకు కథ చెప్పింది.

"మామ్మా! మేం అలకాదులే కావలిస్తే పరీక్ష....' అంటూ ఆమె నవ్వుతూ నాలుక బైటపెట్టి మునిపళ్ళతో నొక్కుకుంది.

"బాగుందే, ప్రభా. నువ్వు రానురాను మొట్ట అల్లరి పిల్లవయిపోతున్నావు. అయినా చెప్పావుగా. ఈ వయసులో

నాకు కళ్ళు మసకలు కూడా వచ్చాయి. ఏదీ అమ్మాయి ఇలా రా తల్లీ" అన్నది మంగాయమ్మగారు.

సలీమా కంగారు పడిపోయింది. ఆమె బిక్క మొహం వేసుకొని ప్రభ వేపు దీనంగా చూచింది. ప్రభ తప్పు చేసిన దానిలా కుడిచేతి చూపుడు వేలు కొరుక్కుని, చేతులు రెండూ వూపుతూ.

"మామ్మ, మాట సాయితకన్నా సలీమాకు అసలే సిగ్గు నువ్విలా అంటే...." ప్రభ మాటలు మింగి ది.

"అదేవిటే, అలా అంటావు తోటి ఆడది నాదగ్గర సిగ్గుపడటమేమిటి? అలా అన్నారంటే నిజంగా నాకూ అను మానంగా వుంది సుమా" అంటూ ఆమె లేచింది.

మంగాయమ్మగారు వొకొక్కడుగే ముందుకు వేస్తూ వస్తుంటే, సలీమా నీరు కారిపోతూ వుంది. ప్రభకు మాట రాలేదు. ఆమె సలీమా దగ్గరకు వచ్చింది. నెమ్మదిగా ఆమె తల నిమురుతూ.

"పిచ్చి పిల్లలు, ముసలాళ్ళంగదా అని మాతో అబద్ధాలాడటానికి, తమాషాలు చెయ్యడానికి తయారవు తారు. కానీ మాకు అంత తెలివితేటలు లేకపోయినా లోక జ్ఞానం మాత్రం మీ కన్నా ఎక్కువే వుంటుంది. ఆవిషయం మీకు తెలిస్తే మంచిదని ఇలా చేశాను." అన్నది.

తరువాత మంగాయమ్మగారు తనపని చూసుకోవ డానికి ఇంట్లోకి వెళ్ళి నౌకర్లకు పనులు చెబుతూ వుంది.

అదును చూసుకొని, ప్రభ, సలీమాఇద్దరూ మేడమీదవున్న ప్రభ గదికి జారుకున్నారు.

"ప్రభా మీ మామ్మ దేవాంతకురాలిగా వుందే" అన్నది సలీమా.

"ఆ—ఈ ముసలాళ్ళంతా ఇంతేనే. తామేదో చాలా గొప్పవాళ్ళమని కబుర్లు చెపుతారు. దాంతో ఆగుతారా! నీతులు మొదలెడతారు. మనం వాళ్ళకు కొంచెం విధేయుతగా వున్నట్లు నటిస్తే చాలు, వాళ్ళ గొప్పవాళ్ళమయిపోయినట్లు పొంగిపోతారు. ఆ పైన మనదారిమనదే" ఆమె చిటికె వేస్తూ సమాధానం చెప్పింది.

"ఏవోనబ్బా. అలాగని ముసలాళ్ళందరినీ కొట్టిపారేస్తే ప్రమాదం" అన్నది సలీమా.

"ఆ... పోవే, ఎర్రిముఖమా నీ కన్నీ అనుమానాలే. ఇది యువతరం. ముసలివాసన పాత భావాలకు స్వస్తి చెప్పాలి. చూస్తూండు ఇవ్వాళ మన సినిమా ప్రోగ్రాంకు మామ్మను ఎలా మస్కాకొడతానో!"

వారిద్దరూ మంగాయమ్మ గారితో ఎలా మాట్లాడాలో కొంచెం సేపు రిహార్సలు వేసుకొని మంగాయమ్మగారితో మాట్లాడటానికి వెళ్ళారు. ఆమె గాడ్రేజ్ బీరువా తెరిచి డబ్బులెక్క పెట్టి లోపల పెడుతూవుంది. వాళ్ళరావటం గమనించిన మంగాయమ్మగారు చేతులో వున్న నోట్ల కట్టలు లోపల పెడుతూ, బీరువా తలుపులు మూసింది.

"మామ్మా"

"ఏమిటి తల్లీ?"

"మరే... మరి..."

"అబ్బ చెప్పు తల్లీ మరీ చిన్న పిల్లలా గారాబాలు. నాకు అవతల చాలాం పనుంది. త్వరగా చెప్పు"

"మరే... మరి మా స్నేహితురాలి పెళ్ళి మామ్మా"

"సంతోషం. చాలా సంతోషం. సలీమా! కుర్ర వాడేం పని చేస్తాడు? నువ్వు చూసి చేసుకుంటున్నావా? లేక పోతే మీ వాళ్ళు నిర్ధారణ చేశారా"

"అరే... నా పెళ్ళి కాదండీ..." సలీమా నీళ్ళు కారిపోయింది.

"ఈవిడ కాదు మామ్మా. మరో స్నేహితురాలుంది. ఆమె పేరు... పేరు... లక్ష్మి" అన్నది ప్రభ.

"బాగుంది. చేసుకోనియ్యి తల్లి. మరి మీ వయసులో మాకు పెళ్ళిళ్ళయి పదేసి సంవత్సరాలు కాపరాలు కూడా వెలగబెట్టాం. పిల్లల్ని కూడా ఎత్తుకున్నాం. ఈ కాలంలో మీరూ వున్నారు మగరాయుళ్ళలా. కాకపోతే పిల్లలకు బదులు అంతకన్నా బరువువున్న పుస్తకాలు మోస్తున్నారు" పురాణం మొదలెట్టింది మంగాయమ్మ.

"నేను... నేనూ..."

"ఏటే మా తల్లీ... నీకెంత మంచిబుద్ధి పుట్టిందే. నువ్వూ చేసుకుంటానంటావు. అంతేగా. చేసేస్తా తల్లి, ఈ

రోజుల్లో ఆడపిల్ల వాళ్ళు కొందర పడితే కుక్కమూతోళ్లు కోతి బుద్ధులోళ్లు దొరుకుతారు."

"అదికాదు మామ్మా"

"నాకు తెలుసు, ఆడపిల్ల మనసువిప్పి పెళ్ళి విషయం చెప్పిందంటే ఆమె పడే, ఇది... అదే... తాపం... నాకు తెలుసమ్మా... కొంచెం వోపికపట్టు పెళ్ళిళ్ళపేరయ్యని పిలి పించి కబురు చెపుతా. ఆయన కాకిలాతిరిగి కార్యంసాధించు కొస్తాడు." అన్నది.

"అబ్బ....వినవేంమామ్మా... ఇవ్వాళ రైస్‌మిల్లరున్న హాల్లో మా స్నేహితురాలి పెళ్ళి నేను సలీమా వెళతాం. మళ్ళ నేను రాత్రి పది దాటకముందే వచ్చేస్తా"

"అదా దానికింత రాద్ధాంతమెందుకేయమ్మా" వెళ్ళిరా మంచిబట్టలు కట్టుకో. నగలేమన్నా కావాలంటే పెట్టుకో"

"మా మామ్మ చాలా మంచిది... మామ్మా"

"మళ్ళీ ఏవిటే అమ్మా"

"అక్కడ... అక్కడ... పెళ్ళికి ఏదయినా ప్రెజం టేషన్ ఇవ్వాలి. డబ్బులిస్తే....!"

"పిచ్చిపిల్లా ఇంత మాత్రానికేనా. ఇవ్వాళ నువ్వి చ్చావంటే రేపు వాళ్ళిస్తారు. ఎంతకావాలమ్మా!"

"యాభై చాలు మామ్మ"

"ఓస్ ఇంతేనా, తీసికెళ్ళు" మంగాయమ్మగారు బీరువాలోనుంచి యాభై రూపాయలు తీసి ప్రిభ చేతికిచ్చింది.

"వెరీగుడ్ మామ్మ. మా మామ్మ చాలా చాలా మంచిది" ప్రిభ మంగాయమ్మగారిని ముద్దుపెట్టుకుంది.

మంగాయమ్మ గారి ముఖం సిగ్గుతో ఎర్రిబడింది. ఆమె బుగ్గ కందిన ఎంగిలిని పెట చెరుగుతో తుడుచుకొంటూ

"ఛీ. ఏమిటే పిల్లా ఆ పనులు. నువ్వు చేసినపనికి....

"ఏమయింది మామ్మా?'

"ఏమయిందా, నాకు కొత్తగా పెళ్ళయిన రోజులు గుర్తొచ్చాయి....ఛీ గడుసుపిల్ల" అంటూ సిగ్గుపడింది మంగాయమ్మగారు.

అది చూసిన ప్రిభ, సలీమా విరగబడి నవ్వుతూ వుంటే ఆమెకూడా వారితోపాటే నవ్వ నారంభించింది మంగాయమ్మ.

"మామ్మా, మేం వెళ్తాం. ఈ డ్రెస్సు చాలు. పదింటికల్లా వచ్చేస్తాం భోజనానికి" అన్నది ప్రిభ.

"అదేమిటే పెళ్ళన్నావు. వాళ్ళు భోజనాలన్నా పెట్టరా!"

"ఆ....ఆ... పెడతారు...ఉహూ లేదు మామామ్మా! వాళ్ళు చాలా మోడరన్. ఇలా భోజనాలు అవి పెట్టరు. సింపుల్ గా టిఫిన్ టీ యిచ్చి పంపేస్తారు" అన్నది.

"ఫరవాలేదు అంత మోడ్రన్ గా వున్నారంటే చాలా

మంచివాళ్ళై వుండాలి. దాంతోబాటు బాగా డబ్బువున్న వాళ్ళయి వుండాలి. దానికితోడు భోజనాలు అవి పెట్ట రంటే మంచి, మడీ, ఆచారం పాటించేవాళ్ళయి వుండాలి. ఔనా ప్రభా!"

"మామ్మా, నీ బుర్రే బుర్ర. నిజంగా నువ్వు చదువు కుని ఏ సైంటిస్టో అయివుంటే వెధవది ఎన్ని కొత్తకొత్తవి కనుక్కునే దానివో. న్యూటన్, ఐన్‌స్టీన్ లాంటి వాళ్ళు కూడా నీ దగ్గర పాఠాలు నేర్చుకోడానికి వచ్చేవాళ్ళే." అన్నది ప్రభ నవ్వుతూ.

మనుమరాలి మాటలకు మంగాయమ్మగారి ముఖం చేటంతయింది. ఆమె అక్కడే వున్న సోఫాలో దర్జాగా కూర్చుంటూ,

"మా తాతగారు కూడా బ్రతికున్న రోజుల్లో ఇలానే అనేవారే పిల్లా, నేను కొత్తకొత్త వంటలు వండి పెడుతుంటే ఆయనా ఆయనతోపాటు మన చుట్టాలంతా తినలేక చచ్చేవారనుకో"

"నిజమేలే మామ్మా. నిజంగా నువ్వు ఇప్పటికీ తయారుచేసే, బెండకాయపచ్చడి, టొమేటో వేపుడు, కరేపాకు వేపుడు అబ్బా తినితీరాలి అంతే" అలా అంటూ ఆమె తన రిస్ట్‌వాచ్ చూసుకుంది.

సలీమ్‌రాజా తన గడియారం చూసి ఆరైయిందని ఆమెకు సైగచేసి చెప్పింది.

"మామ్మా వెళ్ళొస్తాం పెళ్ళి టైమవుతుంది." అన్నది ప్రభ.

"అరే పెళ్ళి ఆరున్నరకికదా, టిక్కెట్టిచ్చేది ఆరింటికి ఇంకా అరగంటటైముంటుందిలే" అన్నది మంగాయమ్మ గారు.

"నిజమేమామ్మా! కాని ప్రెజంటు కొనాలిగా ?"

"అలాగా నాకూ బజార్లో పనుంది. పద ప్రెజంటు నేనూ చూస్తా" అన్నది మంగాయమ్మగారు.

ప్రభ గొంతులో ఏదో అడ్డుపడినట్లయింది. ఆమె నాలుగైదుసార్లు గుటకలు మింగింది.

"మామ్మా... మరే... ...ప్రెజెంటు... కొంటే.... కొంటే..."

"ప్రభా! ఈ నాటకాలు నా దగ్గర ఆపెయ్యి. ఆషాఢమాసం. అష్టమిపూట. రాహుకాలం. యమగండం వున్న ఈ టైములో ఎవరే పెళ్ళిచేసేది. ఈ అబద్ధాలన్నీ మాని సినిమాకని చెపితే నేనూ వస్తానుగా" అన్నది మంగాయమ్మ గారు.

ప్రభతోపాటు సలీమాకూడా తెల్లముఖం వేసింది.

"మామ్మా"

"ముసలిదాన్ని ఎలాగయినా బోల్తాకొట్టించాలను కున్నావు. పాపం పుడ్లేదు" మంగాయమ్మగారు నవ్వుతుంది.

"మరే, ఆ సినిమా...నువ్వు...చూస్తావా?" ప్రభ అన్నది.

"ఏ సినిమా!"

"అదే...కలియుగ సావిత్రి"

"అమ్మో...అమ్మో... ఎంతమంచి సినిమాయే తల్లీ! ఆ సావిత్రి ఎంత పతివ్రత ఎంతపుణ్యాత్మురాలు! యముడితో పోట్లాడి మొగుడి ప్రాణాలు తెచ్చుకున్న మహా పతివ్రత. ఎందుకూ? మేవూవున్నాం. నేను సావిత్రి నయి వుంటే, ఈ నాడు మీ తాతయ్య బతికుండే వారేగా నా పసుపుకుంకుమ గాజులు..."

"అమ్మమ్మా సినిమాటైమయిపోతుంది."

"అమ్మో పిల్లా అలా చూస్తావేం. పనిమనిషినిపిలిచి రెండురిక్షాలు తెప్పించు. కాలేజీ అమ్మాయిలుగదా. ఏ సినిమాకి వెళుతున్నారో అనుకున్నా. ఈ మధ్య అన్నీ చెత్త సినిమాలే. "సందులో సుందరి" "ఆమె పగటికలలు" "అమ్మాయి...నీ ఖరీదెంత" లాంటి సినిమాలు అనుకున్నా"

మంగాయమ్మగారు మాట్లాడుతూనే తలదువ్వేసి, చీరె మార్చుకుంది. ఇష్టంలేకపోయినా ప్రభ, సలీమా ఆమె వెంట రిక్షాఎక్కి సినిమాకు బయలుదేరబోతున్నంతలో మరో రిక్షావచ్చి అక్కడ ఆగింది.

ఆ వచ్చిన రిక్షాలోనుంచి. సినిమాహీరో లాంటి పాతికేళ్ళ కుర్రాడు దిగుతూ.

"హలో పెద్దమ్మా నేనొచ్చేశా" అతని కళ్ళకున్న జోడు తీసేశాడు.

"వీడెవర్రా. సావిత్రి సినిమాలో యమధర్మరాజులా" అన్నది మంగాయమ్మ పక్కనున్న ప్రభతో.

"మీ చెల్లి రేణుక కొడుకు దిలీప్ మామయ్యా" అన్నదిప్రభ.

"అలాగా మానాయనే ఏన్నాళ్ళ కొచ్చావురా బాబూ, దిగవే అమ్మా సినిమా రేపు చూద్దాం"

వారంతా ఇంట్లోకి వెళ్ళారు. సలీమాతానూ ఇంటికి వెళ్ళిపోతానని బయలుదేరింది. అక్కడ ఆగివున్న రిక్షా డ్రైవర్లకు ఆశాభంగమయింది. అందుకే వాళ్ళు మంగాయమ్మగార్ని తిట్టుకుంటూ వెళ్ళిపోయారు.

"రానాయనా! కూర్చో ఎప్పుడూ రావటం,? నిన్ను నేను పోల్చుకోలేకపోయానుసుమా" అన్నది, మంగాయమ్మ గారు.

ఈ లోగా వంటమనిషి, మూడు వేడిటీలు తెచ్చి వారందరికిఇచ్చాడు. వేడి టీ చప్పరిస్తున్న వారంతా బాతాఖానిలోకి దిగారు.

"ఇంటి దగ్గరనాన్నా, అమ్మా అంతా ఖులాసాయేనా?" అడిగింది మంగాయమ్మగారు.

"అంతా బాగానే వున్నారు పెద్దమ్మా. మీ పొలం, మామిడితోట అయివేజు ఈ అయిదు వేలు ఇచ్చిరమ్మన్నాడు నాన్న"

ప్రక్క జేబులోనుంచి నోట్ల కట్టను తీసి మంగాయమ్మ గారికిచ్చాడు దిలీప్.

"ఆ, దీని కేమంత తొందరొచ్చిందిరా బాబూ. మరి నీ చదువు ఉద్యోగం విషయాలు చెప్పావు కాదు"

"ఇక్కడ యమ్.యస్.సి, అయిపోయినాక తరువాత అమెరికా వెళ్ళినా, అక్కడ మళ్ళీ రెండేళ్ళు చదివి పరీక్షలు ప్యాసయ్యాను. తరువాత వో పెద్ద కంపెనీలో చేరాను. జీతం కూడా మన రూపాయల విలువ ఆరువేలు వచ్చేవి. కాని ఏంలాభం, ఖర్చు కూడా దానికి సరిపడేవుంటుంది."

"అందుకని మానేసొచ్చావా ఏం?" అన్నది మంగాయమ్మగారు ఆత్రంగా.

"పాపం, మావయ్యకు ఇంటిమీద గాలి మళ్లి వుంటుంది, అందుకనే వచ్చేసి వుంటాడు" అన్నది నవ్వుతూ శిశిర

"అదేంకాదు పెద్దమ్మా అమ్మా నాన్న కూడా నేనిక్కడే వుండి ఏదయినా ఉద్యోగం చూసుకుంటే మంచి దని పట్టు పట్టారు. అందువల్ల ......"

"పోనీలే బాబు, అది వొకందుకు మంచిదే రోజు రోజుకీ మేం పెద్దవాళ్ళ మయిపోతున్నాం. అదిగాక, వాళ్ళకు నీ వొక్కడివేనయ్యె. ఇక్కడే ఏదయినా ఉద్యోగం చూసుకో పోయావా!"

"నేనూ అదే అనుకున్నా. కానీ ఇక్కడికి వొచ్చిన

తరువాత పెళ్ళి చేసుకోమని వాళ్ళే గోల" అన్నాడు దిలీప్.

"నిజమే అది మంచిదే. నువ్వూ ఓ ఇంటి వాడివై పిల్లా జల్లాతో కాపురం చేస్తుంటే చూసి ఆనందించాలని ఏ తల్లి దండ్రి కుండదు! శుభశ్య శీఘ్రం" అన్నదామె.

"పిచ్చి కుదిరితే పెళ్ళి. పెళ్ళి కుదిరితే గాని పిచ్చి నయంకాదు. బాగుంది తంతు" ప్రభ నవ్వింది.

దిలీప్ అలా అంటూనే కవరు తీసి, మంగాయమ్మగా రికిస్తూ ఈ ఉత్తరం నీకివ్వమంది అమ్మ" అన్నాడు.

కవరు చించి అందులో కాయితం తీసింది, మంగా యమ్మగారు తరువాత కళ్ళజోడు సవరించుకుంటూ ఉత్త రం చదువుతూ ముసి ముసి నవ్వులు నవ్వ నారంభించింది. మధ్య మధ్య తల కూడా వూపుతూ, ప్రభను చూసి నవ్వింది.

"మామ్మా, ఉత్తరం చదువుతూ అంత సంబరపడి పోతున్నావు. ఏదన్నా విశేషమా బా?"

"కరెక్టు. మా ప్రభని చేసుకోరా బాబూ. అమ్మాయి! నువ్వు చాలా అదృష్టవంతురాలివి. అదృష్టం మన దిలీప్ రూపంలో నిన్ను వెతుక్కుంటూ వచ్చింది." అన్నది.

"నన్నా" ఆశ్చర్యంగా చూసింది ప్రభ.

"నిన్నే! ఎదీ నువ్వో నిముషం, దిలీప్ ప్రక్కనే కూర్చో"

"ఓస్ ఇంతేనా. నేనింకేదో అనుకున్నా. మావయ్య ప్రక్కన కూర్చోడానికి కూడా అదృష్టమే. ఆ ... ఇంద కూర్చున్నా" ఆమె వెళ్ళి దిలీప్ ప్రక్కనే కూర్చుంది.

"పెద్దమ్మా, ప్రభ ఫరవాలేదు. చాలా గడుసు మీరింది" అన్నాడు నవ్వుతు దిలీప్.

"గడుసా, పట్టిరాలుగాయుంటే : మ్మ. దానికి తోడు, ఆ కాలేజి చదువొకటి. దీనికి ముకుతాడు పడితేగాని దారికి రాదు" మంగాయమ్మగారు నవ్వుతూ వారిద్దరిని పరీక్షగా చూస్తూంది.

"నేనేం గిత్తదూడనుకాదు ముకుదాడు వెయ్యడానికి, అది సరే కూర్చోమన్నావు కూర్చున్నా."

"కూర్చో, నేను విన్నేం కొరుక్కు తిననులే" అన్నాడు దిలీప్.

"ఏమిటి! అమెరికా వెళ్ళి మనుష్యుల్ని కొరుక్కు తినడం కూడా నేర్చుకున్నావా మావయ్యా? ఎక్కడెక్కడో ఆఫ్రికాలో మనుష్యుల్ని తినేవారున్నారు అని చదివాను. అంతే గాని అమెరికాలో కూడా ........."

"ఫరవాలేదు పెద్దమ్మా కోడి కూతపట్టింది. ఇంక పెళ్ళి చెయ్యకపోతే ప్రమాదం"

"ఛీ ... పో ... మంచి వాడివని రేణుక మామ్మ అంటూండేది. కాని నువ్వూ మాటలు నేర్చావు" అన్నది ప్రభ.

"సరేగాని పిల్లలూ కోంచెం నా మాటవినండి. మిమ్మల్నిద్దర్ని చూస్తుంటే నాకు నిజంగా, రతీ మన్మధులు గుర్తొస్తున్నారు. ఇప్పుడు మీ తాత య్య, నా కూతురు బ్రతికుంటే ఈ వార్తవిని ఎంత సంతోషించే వారో" ఆమె కళ్ళు తుడుచుకుంది.

"ఏవార్త మామ్మా!" అన్నది అమాయకంగా ప్రభ.

"అమ్మాప్రభా, నిన్ను అయ్య చేతుల్లో పెట్టాలో అనిఇన్నాళ్ళ భయపడ్డా. మా చెల్లిగాని మాంమరిదిగానిఇన్నా ళ్ళా ఈవిషయమే నాకు చెప్పలేదు. దిలీప్‌కుమరొక్క డున్నా సంబంధ చూస్తూన్నారనుకున్నా."

"మామ్మా. విషయం అర్ధమయ్యేటట్లు చెప్పు. అంతా నేదాంతం మాట్లాడుతా వేం" అన్నది కోపంగా.

"ఏవుందమ్మా, ఈ లోకంలో కళ్యాణమొచ్చినా, కక్కొచ్చినా ఆగదనిసామెతుంది చూశావూ! అదఅక్షరాల నిజం. మీ ఇద్దరికి పెళ్ళి. అది మా పెద్దలనిర్ణయం" అన్నది మంగాయమ్మగారు.

"మా ఇద్దరికి పెళ్ళా... మాకు... ఎప్పుడూ అనుకో లేదే" అన్నారు ప్రభ దిలీప్‌లు.

"ఔను. మీ ఇద్దరికీ పెళ్ళి నిశ్చయం చెయ్యమని మా చెల్లెలు, మరిది వ్రాశారు. వారితో నేనూ ఏకీభవిస్తు న్నాను. త్వరలో నే పెళ్ళి చేసి మా బాధ్యత తీర్చుకుంటాం" ఆమె పెద్దగా నిట్టూర్చింది.

"పెద్దమ్మా, నాతో కూడా మావాళ్ళు ఈ విషయం చెప్పనేలేదు. మరి పెళ్ళంటే ఇద్దరికీ ఇష్టం కావాలిగా..." అన్నాడు దిలీప్.

"నిజమే మామ్మా. ఆలోచించుకోడాని కయినా, వ్యవధి కావాలిగా"

"పిచ్చిముఖమా, మాకాలంలో పెద్దవాళ్ళు పందిర గుంజను చూపించి, చేసుకోమంటే నోరుమూసుకుని చేసుకో వలసిందే. అలాంటి కాపరాలే నాలుగుకాలాలపాటు నిలి చాయి. ఈ పడిమంత్రం రోజుల్లో ప్రేమలని, పెళ్ళిచూపు లనీతయారయ్యాయి. అదేదో దేశంలో. అవ్వ... కాపరాలు చేసిం తరువాత. కడుపులొచ్చింతరువాతే పెళ్ళిట... పాపం పాడుగాను" అన్నది మంగాయమ్మ.

"మామ్మా, మీ కాలం వేరు. ఈ కాలం వేరు. ఆ రోజుల్లో ఇంత చదువులేదు. ఇంత నాగరికతాలేదు."

"ఔను పెద్దమ్మా! బంధుత్వాలు వేరు. ప్రేమలు వేరు." అన్నాడు దిలీప్.

"సరే అలాగయితే నోపని చెయ్యండి. ఈ రోజు నుంచి మీకు మూడురోజులు టైమిచ్చా. సినిమాలకే వెడ తారో షికార్లే తిరుగుతారో నాకు తెలియదు. ఏదయినా కలిసిన సంబంధం మజ్జిగలో ఉప్పులా కలిసిపోతుంది, కాని దాన్ని పానకంలో పుడకగా మాత్రం తయారు చెయ్య కండి. అమ్మాయి ప్రభా ! మామయ్యకు కావలసిన సదు

పాయాలన్నీ చూడు. నేనలా బజారుకెళ్ళొస్తా" ఆమె వారిద్దరికి మాట్లాడుకోవడానికి అవకాశం కల్పిస్తూ అక్కడ నుంచి వెళ్ళిపోయింది.

"ప్రభా, అలా వెళ్ళొచ్దామా ?"

"ఎక్కడికి మావయ్యా ?"

"అలా పార్కుకో, సినిమాకో, పోదాం"

"నాకేం అభ్యంతరం లేదు కాని,"

"కాని... అంటున్నావు ప్రభా! ఎవిటినీ అనుమానం"

"మామ్మ పెట్టిన షరతుకి మనం ఎదో ఒకటి తేల్చి చెప్పాలి. అలా కాకపోతే ఆమెతో పెద్దతంటా" అన్నది ప్రభ.

"చెప్పడానికే ముందు వాళ్ళకుముక్క"

"ఏమని చెపుదాం మావయ్యా ?"

"అబ్బ అన్నీ సందేహాలే. మనిద్దరం పెళ్ళి చేసుకో బోతున్నామని చెప్పడమ్ అంతే"

"మావయ్యా ఇంకా నా ఇష్టాలతో పని లేదన్న మాట."

"అలాగయితే నేనంటే ఇష్టంలేదన్న మాట"

"గులాబ్ జామ్ అంటే ఎవరికిష్టం వుండదు మావయ్యా?"

"షుగర్ వ్యాధి వున్న వాళ్ళకది నచ్చదులే"

"నీకేం మానయ్యా, మిలిటరీ వాడిలా వొడ్డు పొడుగు సినిమా హీరోలా అందం వుంది. వాటికి తోడు చదువు సంస్కారం వున్నాయి. నాగరికతా లక్షణంగా ఇతర దేశంలో చదువు'' అన్నది ప్రభ.

"సరే నీ దండకం ఆపి విషయం చెప్పు"

"మాధవ్ నూ, ఆడవాళ్ళకు స్వతంత్రం కావాలి అన్న ఈ రోజుల్లో నీ ముందు నేను ఏదీ దాచదలచలేదు. అందుకే పెళ్ళికిముందు మనం కొన్ని షరతులు మాట్లాడుకొని ఆ విధంగా కట్టుబడివుందాం. సరేనా"

"షరతులు మాట్లాడుకోవడమేం ఖర్మ, వ్రాసుకుందాం." నీలాగా నాకూ కొన్ని షరతులుంటాయి కదా. మరో మాట ఈ విషయాలు మన మధ్యనే వుండాలి"

"అవసరమయితే, వాటిని బైటపెట్టే అధికారం వుండాలి"

"నాకేం అభ్యంతరంలేదు ప్రభా! ఆలశ్యమెందుకు? కాయితం పెన్ను తియ్యి''

వారిద్దరూ, చాలాసేపు ఆలోచించి, వో నమూనా షరతుల కాయితాన్ని తయారు చేశారు.

1. భార్యా భర్తలు వొకరి కొకరు ఇష్టంకాని పని ఎవ్వరూ చెయ్యకూడదు.

2 భార్య చేసేవంట పనిలో భర్త తీరిక సమయాల్లో సహాయం చెయ్యాలి.

3. పిల్లల పోషకం విషయంలో ఇదరూ సమానబాధ్యత వహించాలి.

4. భార్య సినిమాలకు, స్నేహితుల ఇళ్ళకు వెళ్ళాలంటే పిల్లల్ని భర్త చూడాలి.

"ప్రభా! అన్ని షరతులు నీకు అనుకూలంగా వ్రాస్తున్నావు నే చెప్పింది అయిదో షరతుగా వ్రాయి"
అన్నాడు దిలీప్.

"చెప్పు చూపయా ! ఇందులో మొఖమోటపడవల సిందేమీ లేదు. నన్నడిగితే ప్రపంచంలో అందరూ ఇలా చేస్తే చాలా సంసారాలు సుఖపడతాయి" అన్నది ప్రభ.

5. భర్త స్నేహితులతో సినిమాలకు, పార్టీలకు వెళ్ళ డానికి భార్య అంగీకరించాలి.

6. భర్త స్నేహితులు, చుట్టాలు వచ్చినప్పుడు భార్య వారిని గౌరవించాలి. భోజనాలు, వసతి సౌకర్యాలు చూడాలి.

7 భర్త, ఉద్యోగానికి వెళ్ళేటైముకు అతనికి కావల సిన భోజనం వగైరా సమపాయాలు భార్య చూడాలి.

"మావయ్యా! కొంచెంఆగు మళ్ళీ పాయింటు మరిచి పోతా"

8. "భర్త తెచ్చిన జీతం మొత్తం భార్యకిచ్చి, అందు

లోనుంచి, తనకు కావలసిన పాకెట్ ఖర్చులకు భార్యనడిగి తీసుకోవాలి."

"అ....తొమ్మిదో షరతు వ్రాయి ప్రభా! మళ్ళీ నేనూ మరిచిపోతాను."

9. రాత్రిలందు పిల్లలు లేచి గోలచేస్తుంటే భార్యే ఆ పిల్లలను సముదాయించాలి. అంతేకాని పగలంతా ఆఫీసు పనిలో అలసిపోయిన భర్తను అనవసరంగా నిద్రాభంగం చెయ్యకూడదు.

"అలాగయితే నాదో కండిషన్. అదేమిటంటే–

10. "భార్య పిల్లలతో బాధపడుతుంది. కాబట్టి భర్త పెందలాడే లేచి, పాలమనిషి దగ్గర పాలు తీసుకొని పనిమనిషి ఇంట్లో పని చేస్తూవుంటే దానికి కాపలా కూర్చోవాలి."

"సరే మరో షరతుకూడా వ్రాయి ప్రభా"

11. భార్యాభర్తల మధ్య తగాదాలున్నప్పటికీ వారిద్దరూ మాట్లాడుకోకుండా వుండకూడదు. అలా మాట్లాడుకోకుండా వుండేగడువు మూడురోజులు మాత్రమే."

"మావయ్యా నీషరతు బాగానేవుంది, కాని ముందు ఎవరు మాట్లాడించాలంటావు?"

"భర్తగా మగావాడికి అంతమాత్రం ఘనత వుండాలి, అందుకే భార్యే ముందుగా మాట్లాడించాలి" అన్నాడు దిలీప్.

'అబ్బ అదేంకుదరదు. భర్తే భార్యను పలకరించాలి"

"అహా కాదు. భార్యే పలకరించాలి.

"నేనొప్పుకోను" అన్నది ప్రభ.

దిలీప్ కొంతసేపు అలాగే ఆలోచిస్తూ వుండిపోయాడు చివరకేమనుకున్నాడో ఏమో.

"ప్రభా, మంచి అయిడియా"

"ఏమిటి ఆ మానవయ్యా అది త్వరగా చెప్పు. మళ్ళీ మరిచిపోయావంటే తంటా"

"మూడురోజులూ, రాత్రిపూటతో ముగిస్తే నువ్వు పలకరించాలి. అదే పగలయితే నేను పలకరిస్తాను."

"అబ్బా ఆశ పగలయితే నువ్వు ఆఫీసులో వుంటావు. పొద్దుగూకి వస్తావు. ఇక నేనే పలకరించాలి. ఆ పప్పులేం వుడకవు" అన్నది ప్రభ.

"మరి ఎలాగబ్బా?"

"అదే నేను ఆలోచిస్తున్నా."

వారిద్దరూ ఆలోచిస్తూ కూర్చున్నారు. కొంతసేపయిన తరవాత ప్రభ గంతేసి నిలబడింది.

"మానవయ్యా అయిడియా మరేంలేదు ముందుగా మనం అనుకొని, కాయిన్ ఎగరేద్దాం. కోరుకున్న వాళ్ళకు బొమ్మో, బొరుసో వస్తుందిగా. గెలిచినవాళ్ళు రెండో వాళ్ళను పలకరించాలి. ఎలావుంది నా అయిడియా" ఆమె దిలీప్‌ను గర్వంగా చూసింది.

"ఛత్ అయిడియా ఏం బాగాలేదు. బొమ్మ, బొరుసా అని రెండో వాళ్ళని అడగాలికదా ఇంక వాళ్ళు పలకరించినట్లుగా!" అన్నాడు దిలీప్.

"పోనుమరి, ఎలాగబ్బా?"

మళ్ళీ వాళ్ళిద్దరూ ఆలోచించసాగారు.

"మామయ్యా"

"ఏమిటి?"

"మాట్లాడుకోవడం మానేసిన తరువాత సరిగ్గా మూడురోజులకు, మనం బెడ్ రూములో కలవాలి. తరువాత, కాయిన్ ఎగరవెయ్యాల్సింది మీరు. అందులో బొమ్మ ఎప్పుడూ నాది బొరుసు నీది. దాని ప్రకారం వోడినవారు గెలిచిన వారిని పలకరించాలి" అన్నది ప్రభ.

"అబ్బ నీ బుర్ర నిజంగా భూపాళం. ఇదే ఇతర దేశాల్లో అయితే నీకో డాక్టరేటు పారేసి నోబుల్ బహుమానానికి రికమెండు చేసేవారే అలాగయితే ఆ షరతు కూడ వ్రాయి" అన్నాడు దిలీప్.

12. భార్య భర్తలు మాట్లాడుకోకుండా వుండే గడువు మూడురోజులయిన తరువాత, బెడ్ రూములో కెళ్ళి కాయిన్ ఎగరెయ్యాలి. అందులో భార్యది బొమ్మ భర్తది బొరుసు కావడంతో గెలిచిన వారు వోడిన వారిని పలకరించాలి.

"మామయ్యా ఇంకేమన్నా వున్నాయా?"

"నాకింకేమీ తోచడం లేదు. కావలిస్తే చేర్పులు మార్పులు చేసుకుందాం. సరేనా"

"మామయ్యా"

"అబ్బ మళ్ళీ ఏమిటి అనుమానం!"

"షరతులు పదమూడయ్యాయి. ఆ సంఖ్య అంత మంచిది కాదేమో!"

"ప్రభా, [illegible]పోయాయి. మరి నాకో ముద్దియ్యి" అతడు ఆమె దగ్గరగా వెళ్ళాడు.

"ఛీ... ఏమిటి మామయ్యా వేళాకోళం"

"అరే ఇందులో తప్పేముంది. కాబోయే భార్యాభర్తలం. ఎడ్వాన్సుగా..."

"ఆ... అదేం కుదరదు. ఇలా కాలుజారుకుంటూ పోతే, ఎడ్వాన్సుగా గర్భవతులు కావటం. ఎడ్వాన్సుగా పిల్లల్ని కని, ఎడ్వాన్సుగా తల్లి తండ్రులయి పోవటం. అదేం కుదరదు [illegible] పదమూడు షరతులు పాటించాలి" అన్నది ప్రభ.

"ప్రభా, ఈ పదమూడు సూత్రాలు మనకే కాదు ప్రపంచంలో అందరికీ ఆదర్శప్రాయంగా వుండేలా మనం నడుచుకోవాలి" అన్నాడు దిలీప్.

ఇంతలో డైనింగ్ హాల్లో నుంచి మంగాయమ్మగారి పిలుపురాగానే వారిద్దరూ అక్కడికి వెళ్ళారు.

# 2

"అమ్మా ప్రభా,

"పిలిచావా మామ్మా"

"మీ మావయ్యను కూడా పిలువు అందరం కలిసి భోంచేద్దాం" అన్నది మంగాయమ్మ.

ఆమె, డాక్టర్ ప్రకాశం ముగ్గురూ భోజనానికి కూర్చున్నారు. లోకాభిరామాయణం సాగుతూ వుంది, మంగాయమ్మగారు అన్నం ముద్ద నోట్లో పెట్టుకోడానికి పోయి ఆగింది. వారిద్దరినీ పరీక్షగా చూసింది, ప్రభగాని, దిలీప్‌గాని ఆమెను గమనించలేదు. వారేదో సినిమాను గురించి మాట్లాడుకుంటున్నారు.

"నే చెప్పిందేం చేశారు!" మంగాయమ్మగారి గొంతులో నుంచి అధికారం వుట్టిపడింది.

ఆమె ప్రశ్నకు వారిద్దరూ ఏమీ సమాధానం చెప్ప లేదు. ప్రభ కొంచెం ధైర్యం చేసి,

"నువ్వు చెప్పిందేవిటి మామ్మా!"

"బావుంది నువ్వే నన్ను ఎదురుప్రశ్న వేస్తున్నా వన్నమాట. సరే మరోసారి జ్ఞాపకం చేస్తున్నా. మీ వివాహ సమాచారం మూడు రోజులలోగా తేల్చి చెప్పా లన్నా. మర్చిపోయారా"

"అబ్బే లేదు పెద్దమ్మా. మేవు.. మేవు.. పెళ్ళికి అంగీకరించాం. ఇంక మీదే ఆలశ్యం" అన్నాడు దిలీప్.

"అబ్బా ఎంత మంచిమాట విన్నానురా బాబు. ఇంతవరకూ పదిటన్నుల బరువు నా నెత్తిన పెట్టినట్లుగా ఇన్నాళ్ళు బాధపడ్డాను. సాయంత్రమే పురోహితుణ్ణి పిలిపించి ముహూర్తం పెట్టించుదాం" అన్నది మంగాయమ్మ గారు.

"మామ్మా"

"ఏమిటమ్మా"

"మరే, అప్పుడే ఏం తొందరొచ్చింది. మీ చెల్లెలికి కబురు పంపాలి. తరువాత వారు రావాలి. ఆ తరువాత మంచీ చెడూ మాట్లాడాలి.

"పెద్దమ్మా అవేం అక్కర్లేదు. అమ్మ, నాన్న నే చెప్పినట్లే వింటారు. పెళ్ళికొస్తారుగా" అన్నాడు దిలీప్.

"అదేం కుదరదు. నాకు పరీక్షలయిపోవాలి. ఇంకా ఆ పై చదువేదయినా వుంటే అదీ చూడాలి."

'అదా అదేం కుదరదు. పెళ్ళి వెంటనే జరగాలి" అంతే పట్టు పట్టాడు దిలీప్.

'అది అంతకన్నా కుదరదు."అంటూ మొండికెత్తింది ప్రభ.

వారిద్దరూ ఇంక వాదనలోకి దిగారు. మంగాయమ్మగారు వాళ్ళను ఎలాగయినా రాజీపరచాలని చూశారు. కాని లాభం లేకపోయింది.

[5]

"ప్రభా ఏమిటి నీ మొండివాదం. పదమూడు షరతులు జ్ఞాపకం పెట్టుకో" అన్నాడు దిలీప్

"అందులో పెళ్ళి తేదీ నిర్ణయించలేదు. అందుకే అది నా ఇష్టం" ప్రభ సమాధానం చెప్పింది.

"పదమూడు షరతులా, ఏమిటా అవి కొంచెం వివరంగా చెప్పండి" అన్నది మంగాయమ్మగారు,

కాని వారిద్దరూ ఆమె మాట వినిపించుకోకుండా వాదించుకోసాగారు.

'సరే అలా అయితే, మనషరతుల ప్రకారం బొమ్మ బొరుసు వేసుకుందాం. సరేనా!"

దిలీప్ ఆ మాట అనగానే ప్రభ అలాగే ఆలోచిస్తూ కూర్చొంది.

'బొమ్మ బొరుసేమిటా బాబూ. మీకేం పిచ్చెక్క లేదుగా" వారిద్దరికీ సర్ది చెప్పబోయింది మంగాయమ్మగారు. కాని వారిద్దరూ ఆమె మాటలు వినిపించుకోవడంలేదు.

'మాటంటే దానికి కట్టుబడివుండాలి, మొదట్లోనే పేచీలు పెట్టడం మంచిదికాదు. మొత్తానికి ఆడదానివని పించావు ప్రభా"

దిలీప్ మాటలకు ఆమెలో పౌరుషం పెరిగింది.

"నేను ఆడదాన్నే. అందుకే ఆడదనిపించుకోడానికి సిగ్గుపడను. మావయ్యా! మరి నువ్వో"

ఆమె నవ్వింది. దిలీప్‌కు ఆమెకెలా సమాధానం చెప్పాలో అర్థంకాలేదు. ఆమె యింకా నవ్వుతూనే వుంది.

"అబ్బా ఏమిటర్రా మీ అరవగోల. నాకూ ఆ విషయం తెలియచెపితే పరిష్కారమార్గం చెపుతాగా" అన్నది మంగాయమ్మగారు.

"మామ్మా, మరే... మరే..."

వారిద్దరిమధ్య నడిచిన విషయాన్ని బైటికి చెప్పేస్తుందనుకున్నాడు దిలీప్.

"ప్రభా, ఇప్పుడన్నా తెలిసిందా నీలో వున్న బలహీనత."

"కాదూ, కాదూ, కాదు. నీకంత పట్టుదలయితే నాదీ అంతేపట్టుదల. కాని బామ్మాబాక్సు."

అలా ఆమె అనగానే, దిలీప్ తన జేబులోనుంచి రూపాయి కాయిన్ తీశాడు. దాన్ని అటు ఇటు తిప్పిచూశాడు. ప్రభకూడా కాయిన్ను పరీక్షగా చూసింది. దిలీప్ దాన్నిగోటితో మీటాడు. అది శబ్దంచేస్తూ గాల్లో గిరగిరా తిరిగి క్రిందపడింది. ప్రభ, దిలీప్‌లుఇద్దరూ ఆ కాయిన్ దగ్గరకు పరుగెత్తారు.

"బొరుసు. గెలుపునాదే" చెయ్యిగాలిలో కత్తిగంతులు వేస్తున్నాడు దిలీప్.

ప్రభమాత్రం నేలచూపులు చూస్తూ నిలబడింది.

"పెద్దమ్మా. విజయంమనదే పురోహితుడ్ని వెంటనే

పిలిపించు. పెళ్ళిలగ్నాలు వెంటనే పెట్టించు. ఆ... అంతే"
అతడుపొట్టిగావున్న మీసాలను లాగి వాటికి పురి బెట్టటా
నికి ప్రయత్నించాడు.

"అమ్మాయి. ఎవిటే ఈ గోలంతా !" మంగాయ
మ్మగారి ప్రశ్నకు ప్రభ సమాధానం చెప్పలేదు.

"పెద్దమ్మా"

"ఏమిటిరా బాబు ?"

"గెలుపునాదయినా, మగవాడిగా ప్రభకు ఛాన్సు
ఇస్తున్నా. పెళ్ళి ఎక్కడ జరగాలో ఎలా జరగాలో, ఆమె
ఇష్టప్రకారం చెయ్యండి." అన్నాడు దిలీప్.

"మామ్మా! వోడిపోయినా, సిగ్గుచేటయిన పనులు
ఏ ఆడది చెయ్యదు. చెయ్యడానికి వొప్పుకోదు. అందుకే
అన్నీ ఆయన ఇష్టప్రకారమే చెయ్యండి" ఆమె అక్కడ
నుంచి కోపంగా వెళ్ళిపోతుంటే,

"పదమూడు షరతులు జిందాబాద్, మొదటి గెలుపు
మగవాడిదే" అరిచాడు దిలీప్.

ప్రభ ఎక్కుతున్న మేడమెట్లమీద ఆగింది. ఆమె
చూపుల్లో కోపంస్పష్టంగా కనిపిస్తూవుంది.

"మామ్మా ఇల్లలకంగానే పండగకాదు. ముందుగా
వోటమి తరువాత గెలుపుకు సోపానాలు" అంటూ ఆమె
మెట్లెక్కి పైకి వెళ్ళిపోయింది.

ఘనంగా అలకరించబడిన కళ్యాణమండపంలో ప్రభ

దిలీప్‌లు ముచ్చటగా కూర్చున్నారు. వేదమంత్రాలు మైక్‌లో గట్టిగా వినిపిస్తున్నాయి, అనేకరకాలయిన వాయిద్యాలు మ్రోగుతున్నాయి. పెళ్ళివారంతా చాలా హడావుడిగావున్నారు. ఆహూతులయిన వారంతా ఆ నవదంపతులను చూసి మెచ్చుకుంటున్నారు మాంగల్యధారణకు పురోహితులు సన్నాహాలుచేస్తున్నారు. దిలీప్ మంగళసూత్రం తీసుకొని లేచినిలబడ్డాడు. అతడొకసారి ప్రభవేపు గర్వంగా చూశాడు. ఆమె సిగ్గుతో తలవంచుకుంది. ముత్తయిదువొకామె, మాంగల్యధారణకు అనువుగా పెళ్ళికూతురి జెడ ఎత్తిపట్టుకుంది. "జానాకీ పెళ్ళికూతురాయెనే..." అంటూ బ్యాండు సన్నాయి. ముచ్చటగా మ్రోగుతున్నాయి. దిలీప్ ప్రభ మెళ్ళో తాళికట్టడానికి వంగాడు.

"ఆగండి" భయంకరమయిన అరుపు వినిపించింది.

అతనెవరైనది వెంటనే అర్థం చేసుకోలేకపోయారు. దాదాపు యాభై సంవత్సరాలున్న వొకతను దర్జాగా నడుస్తూ కళ్యాణమంటపం దగ్గరకు వచ్చాడు. దిలీప్ అతన్ని అయోమయంగా చూస్తున్నాడు. కోరమీసాలు, అందమయిన కాంతి, మంచి సూటుతో ఎంతోగంభీరంగా వున్నాడు.

"ఆమె నా కూతురు. నాకు తెలియకుండా ఈ వివాహం జరగడానికి వీల్లేదు. ఆపండి మేళాలు" అతను అరుస్తున్నాడు.

"నువ్వా శివాజీరావు." అనగలిగింది మంగాయమ్మ

గారు. ఆమె చేతులు వొణుకుతున్నాయి. చేతిలో వున్న అక్షి తలు క్రిందపడిపోయాయి.

"శౌను నేనే ఏం? ఆశ్చర్యంగా వుందా! ఇన్నాళ్ళు మీతో నాకు అవసరం లేకపోయింది.కాని ఈనాడు అవసర మొచ్చింది" అలా అంటూనే అతడు దిలీప్ చేతిలో వున్న మంగళసూత్రాన్ని లాక్కున్నాడు. అవమానాన్ని భరించ లేని దిలీప్ వో అడుగు ముందుకు వేశాడు.

"ఆగు నీ కాడితనం నా ముందు కాదు. నేనెవరినో తెలుసా ? నేను ఈ మంగాయమ్మగారి అల్లుడిని. ప్రభకు తండ్రిని నా పేరు శివాజీరావు. చేసేది డిప్యూటి కలెక్టరు"

తనకుతాను అక్కడున్న వారందరికి పరిచయం చేసు కున్నాడు.

"ఈ పెళ్ళి జరగడానికి వీలులేదు. నా కూతురిమీద అధికారం నాది. నాకు తెలియకుండా ఈ వివాహం జరిపిం చాలని చూడటం నేరం. ఎవరన్నా బలవంతంగా ఈ వివా హాన్ని జరిపించాలని చూసినా, ప్రయత్నం చేసినా, చర్య తీసుకోడానికి అధికారులు కూడా సిద్ధంగావున్నారు. జాగ్రత్త" ఆయన అక్కడున్నవారందరిని చూసి హెచ్చ రించాడు.

"శివాజీరావు! వాళ్ళిద్దరూ ప్రేమించి పెళ్ళిచేసుకుంటు న్నారు. పైగా ఆ అబ్బాయి మా చెల్లెలి కొడుకు. ఇలా. పెళ్ళి పీటలమీద పెళ్ళి చెడగొట్టడం ధర్మం కాదు.

ఏదన్నా వ్యవహారం వుంటే వేరుగా చూసుకోవాలిగాని."
మంగాయమ్మగారు అల్లుణ్ని బ్రతిమలాడసాగింది.

"అదా విషయం ఈ ప్లానంతా నీవన్న మాట. చింత చచ్చినా పులుపు చావనట్లు ముసలిదానివయినా, నీ మాయనాటకాలు మానలేదన్నమాట"

శివాజీరావు అలా చెపుతుంటే పెళ్ళిపందిరిలోని వారంతా బొమ్మల్లా అలాగే చూస్తూ కూర్చున్నారు. పీటలమీద పెళ్ళి, నిమిషం ఆగితే, ప్రభ, దిలీప్ ఇద్దరూ భార్యా భర్తలయివుండేవారు. శివాజీరావు మాటలకు మంగాయమ్మగార్కి విపరీతంగా కోపం వచ్చింది.

"అల్లుడూ ఇది కేవలం అన్యాయం. ఎనాడో నువ్వు మాతో తెగతెంపులు చేసుకున్నావు. కనీసం నీ కూతుర్ని చూడటానికయినా రాలేదు. నిజంగా నువ్వు ఆమెకు తండ్రి వంటే ప్రభ నమ్మలేదు నమ్మదు కూడా. అప్పుడులేని ప్రేమ ఈరోజున కూతురిమీద అమాంతం పుట్టుకొచ్చిందా!" అన్నది.

"నోరుముయ్యి, ముసలిదానా! ప్రభ నాబిడ్డ. నేనె ప్పుడయినా వచ్చి ఆమెను తీసుకెళతాను. ఊరికినే కాదు. ఆమె ఆస్థితో. రేపే నా మేనల్లుడికిచ్చి ఆమె వివాహం జరిపిస్తా" శివాజీరావు విలన్‌లా మీసాలు దువ్వుతున్నాడు.

"నా బొందిలో ప్రాణం వుండగా అలా జరగ నివ్వను"

శివాజీరావు చేతిలో వున్న మంగళసూత్రాన్ని దిలీప్ లాక్కున్నాడు. మళ్ళీ ప్రభ మెడలో కట్టబోయాడు.

కల్యాణమండపం మరో నిమిషంలో రణరంగంగా మారే సూచనలు కనిపించాయి. అప్పటికే పేరంటాళ్ళు చాలామంది తమ మెడలో వున్న నగలనూ, చంకలో వున్న పసిపాపలను చూసుకుంటూ అక్కడినుంచి దూరముగా వెళ్ళిపోతున్నారు.

ముసలివాళ్ళు, మర్యాదస్తులు అక్కడినుంచి నెమ్మదిగా వెళ్ళిపోతున్నారు.

"మనకెందుకొచ్చిన తంటా పదండి, చూసిన దగ్గర నుంచి, సాక్ష్యాలు, కోర్టులు, పదండి, ఊ...త్వరగా" తొందర చేస్తున్నారు సర్దుకొంటూ. మైకువాడు తన సామానులు జాగ్రత్త చేసుకుంటూవుంటే మేళగాళ్ళు తమ సామానులను జాగ్రత్త పరుచుకుంటున్నారు. పురోహితులు జారిపోతున్న కోచీలు బిగించుకుంటూ, అందిన వన్నీ అంగవస్త్రంలో మూట కట్టుకొని వుడాయించాలని చూస్తున్నారు, షామియానాలూ, కుర్చీలు అద్దెకిచ్చిన వాడు కంగారుగా తన కూలీల కోసం వెతుక్కుంటున్నాడు. శివాజీరావుతోపాటు అతని మనుషులు హాయిగా నవ్వుకుంటూ విజయగర్వంతోపాటుమీసాలు మెలివేస్తున్నారు అంతవరకూ తలవంచుకొని నిలబడ్డ ప్రభ తలఎత్తి శివాజీరావు వేపు పరీక్షగా చూసింది. అప్పసినరిగా వుండవలసిన బంధువులు, మిత్రులు ఇంకా ఏం జరగబోతుందా అని

కళ్ళప్పగించి చూస్తున్నారు. ప్రభ మరో అడుగుముందుకు వేసింది. ఆమె ధైర్యంగా శివాజీరావు చెయ్యి పట్టుకుంది.

"డాడీ"

"ఏం తల్లీ!"

"మీరేనా, నా డాడీ!"

ఆమె ప్రశ్నకు శివాజీరావు కొంచెం జంకాడు. కాని అది కప్పిపుచ్చుకోడానికి నవ్వుతూ,

"ఔనమ్మా నేనే మీ డాడీని. అదుగో ఆ మాయా రాక్షసి వుంది చూడు మీ మామ్మ మాగాయమ్మ నిన్ను కలవకుండా చేసింది తల్లీ"

"అలాగా డాడీ. నాకింత మంచిడాడీ వున్నాడని ఇవ్వాళే తెలిసింది నిన్ను చూస్తుంటే నాకెంత సంతోషంగా వుందనుకున్నావు డాడీ!"

"నాకూ అలానే వుందమ్మా. నేనొక్క నిమిషం ఆలశ్యం చేసివుంటే, నీ జీవితమే పాడయిపోయేదమ్మా. నేను సమయానికి వచ్చాను కాబట్టి సరిపోయింది."

"ఔను డాడీ మీరు సమయానికే వచ్చారు. మరి మా పిన్ని, చెల్లెళ్ళు తమ్ముళ్ళు ఏరి!"

"ఇప్పుడెందుకమ్మా, నీ పెళ్లినాడు వారంతా వస్తారు. పెళ్ళి ఘనంగా చేస్తా..రా తల్లీ ఇగ్నాళ్ళూ ఈ

6)

రాక్షసులు నిన్నెన్ని తిప్పలు పెట్టారో" అంటూ ప్రేమతల నిమిరాడు శివాజీరావు.

"డాడీ అదర్శిష్టవంతుడు. అరె వెళ్ళిపోతున్నారే. యిదిగో మిమ్మల్నే మా డాడీ చాలా మంచివాడు నా పెళ్ళి చేస్తానన్నాడు. మా డాడీ జయచంద్రుడూ కాడు నేను సంయుక్తనూ గాను. రండి రండి"

ఆమె పిలుస్తుంటే కొందరు ఆశ్చర్యపోయారు మరి కొందరు తమాషా చూడటానికి నిలబడ్డారు. సన్నిహితులు, మిత్రులు, బంధువులు తప్పనిసరై అక్కడే నిలబడి పోయారు.

"అరె అలా చూస్తారేం. మామ్మా అలా చూస్తావేం. అతిథులందరికీ కూల్‌డ్రింక్స్ ఇవ్వండి. అందరికీ మరోమారు కాఫీ టిఫిన్సు యివ్వండి. ఊ త్వరగా" ఆమె కేకలేస్తుంది.

"ప్రభా వారంతా ఎందుకమ్మా! నీ పెళ్ళి నాటికి మళ్ళీ వీరంతా రావాల్సిందేగదా" అన్నాడు శివాజీరావు

'ఇదిగో విన్నారా, మళ్ళీ శుభలేఖలందలేదనుకునేరు, మా డాడీ మిమ్మల్నందర్నీ నా పెళ్ళికి తప్పకుండా పిలుస్తానంటూ మాట ఇస్తున్నారు రండి... రండి..."

ఆమె ప్రవర్తన చూసిన శివాజీరావుకు ఏదో అనుమానం వేసింది.

"ఏయ్, ప్రభా, ఏమిటా కేకలు కాకులా. అలాగ యితే నా మేనల్లుడికి నిన్నిచ్చి పెళ్ళి చెయ్యనే చెయ్యను" అన్నాడు శివాజీరావు

"యిదిగో పెళ్ళిపెద్దలూ! విన్నారా. మా డాడీ నాకు పెళ్ళిచెయ్యడంట. మరి మీరే చెప్పండి. నాకు పెళ్ళెలా అవుతుందో. డాడీ ఇన్నాళ్ళకు వచ్చి యిదేనా చెప్పేది. డాడీ ..."

ఆమె మాటలు వింటున్న వారిలో కొందరు, నవ్వుతున్నారు. మరికొందరు ఆమెకు మతి చలించివుంటుందను కుంటున్నారు.

"డాడీ... నా పెళ్ళెప్పుడు. త్వరగా చేస్తావా... ఆ... మేనల్లుడంటే... డాడీ నిజంగా మగవాడేనా.. లేక..."

"ఛ... నోరుముయ్. నువ్వేదో తెలివైనదానివని నిన్ను కాపాడి, దాంతోపాటు ఆస్థికూడా పాడైపోకుండా వుంచుదామనుకొన్నా. కాని నువ్వో కాకు... కాదు... కాదు... పిచ్చిదానివి..." అతడు పెద్ద తప్పుచేసినవాడిలా ఆలోచిస్తూ వుండిపోయాడు.

"పెళ్ళిపెద్దలూ విన్నారా, మా డాడీగారి గొప్పతనం. నా మీద ప్రేమ కొద్దీ ఇరవై సంవత్సరాల తరవాత వచ్చాడు. అదీ పెళ్ళిఆపడానికి. అంతేకాదు, ముక్కు మొహం తెలియని ఆయన మేనల్లుడిని నాకు భర్తగా నిర్ణ

యించాడు. మా డాడీ చాలా మంచివాడు. ఔనంటారా కాదంటారా?" ఆమె అందరి వంకా ఆశగా చూసింది. ఎవరూ మాట్లాడక పోయేసరికి,

"ఔను మా డాడీ గొప్పతనం మీరింకా గ్రహించి వుండరు. ఆయన మా మమ్మీని ప్రేమించి పెళ్ళి చేసుకు న్నారు. కాని నేను పుట్టగానే ఆమెనొదిలేసి వెళ్ళిపోయాడు. మా డబ్బుతో చదువు సంధ్యలు సాగించి ఉద్యోగం సంపా దించారు. పాపం ఆఫీసరుకదూ! అందుకే మళ్ళీ పెళ్లిచేసుకు న్నారు. మా డాడీ ఎంత మంచివాడంటే, ఉత్తరాలు అవీ రాస్తే మేం కంగారుపడతామని యిన్నాళ్ళూ వూరుకు న్నారు. మాడాడీ ఎంతమంచివారో! కాదనే ధైర్యం ఎవరి కన్నా వుంటే ముందుకువచ్చి అడగండి. ఆ... మా డాడీ పెద్ద ఆఫీసరు. ఆయనతో మీరు జాగ్రత్తగా వుండాలి."

ఆమె ఆ మాట అనేసరికి అక్కడున్న జనంలో గుస గుసలు బయలుదేరాయి. అందులో కొందరు,

"యిలాంటి వాడు మంచివాడెలా అవుతాడు! అంతా స్వార్థం దగా" అంటూ కేకలేశారు.

శివాజీరావు ఆమాటలు భరించలేకపోయాడు. తాను అలాగే వూరుకుంటే జనం రెచ్చిపోయే అవకాశం వుంది. అందుకే అతడు తెగించాడు.

"ఛ...నోరుముయ్యి. ఇన్నాళ్ళూ నువ్వేదో కట్టు బాటులో పెరుగుతున్నావని, బాగా చదువుకుంటున్నావు

అనుకుని సౌఖ్యం కలిగించుకోలేదు. ఇంత బరి తెగించి పిచ్చి దానిలా వుంటావనుకుంటే ఏనాడో నిన్ను సరైన మార్గాన పెట్టివుందును. పద" అతను ఆమె చెయ్యిపట్టుకుని గట్టిగా లాగాడు.

ప్రభ తన చేతిని విసురుగా లాక్కుంది.

"నేననవలసినమాటలు నువ్వే అంటున్నావు. నువ్వా మనిషివేగా. పేరుకు పెద్ద ఆఫీసరు. నా తల్లిని మోసం చేశావు ఆమె చావుకు కారణమైనావు. కన్నబిడ్డనని కనికరం కూడా లేకుండా యిన్నాళ్ళు వదిలేశావు. ఈనాడు నామీద ప్రేమ ఎందుకొలకబోస్తున్నావు? నిజం చెప్పు. యిదంతా మా ఆస్తికోసం కాదా? నువ్వు మనిషివికాదు. మనుషులను చంపుకుతినే రాక్షసుడివి. ఛీ సిగ్గులేదూ? ఇవ్వాళ వచ్చి తగుదునమ్మా అంటూ పీటలమీద పెళ్ళి చెడగొడతావా? నీలో మాత్రం మానవత్వం వున్నా కన్నకూతురు ప్రేమించి పెళ్ళిచేసుకునేవాడ్ని కాదని, ఎవడికో యిచ్చి పెళ్ళిచేస్తానంటావా? ఛీ......ఛ. నిన్ను అలా పిలిచినా మహాపాపం. నిన్నే! నేనేం చిన్నదాన్ని కాదు. ఇక వెళ్ళదాన్ని. అడ్డొచ్చావో నీ మర్యాద దక్కదు జాగ్రత్త. నీకన్నా పశువులు మేలు. తన సంతానాన్ని నీకన్నా అప్యాయతగా చూసుకుంటాయి" ఆమె ఆవేశంతో అన్నది.

"ప్రభా! ఏటి వాగుతున్నావు. చూస్తా నాకెక్కడ ఎవడడ్డొస్తాడో" శివాజీరావు ఆమెదగ్గరకు వెళ్ళబోయాడు.

"ఆగు అడుగు ముందుకు వేశావో, పోలీసులను పిలుస్తా. దిలీప్ మాపయ్యా రా, మంగళసూత్రం కట్టు. యిప్పటివరకూ ఈ ప్రభను ఆడదానిగానూ, అసమర్థురాలిగాను చూశావు, జాగ్రత్త అధికంగా ప్రవర్తించావో మర్యాద దక్కదు."

ఆమె అలా అనగానే, దిలీప్ మంగళసూత్రం తీసుకొని ముందుకొచ్చాడు. ఆమె మెడలో తాళి కడుతూ వుంటే మంగళవాయిద్యాలు మోగాయి. అక్కడున్నవారంతా ఎంతో ఆనందంగా ఆ నవదంపతుల మీద అక్షతలు చల్లారు. ముత్తయిదువలు మంగళహారతి పట్టి పాటలు పాడారు.

అంతా క్షణకాలంలో జరిగిపోయింది. అప్పటికే శివాజీరావు శిలాప్రతిమలా నిలబడి వున్నాడు. అతని కళ్ళ వెంట కన్నీరు ధారగా కారుతూ వుంది.

"అమ్మా నన్ను క్షమించు. నా తప్పు ఇప్పుడే అర్థమైంది; నన్ను కూడా మీ దంపతులమీద అక్షతలు వేసి ఆశీర్వదించనియ్ తల్లీ" అతడు ముందుకి వెళ్ళబోయాడు.

"ఆగు... ఆ అర్హత నీవేనాడో పోగొట్టుకున్నావు. ఇక్కడనుంచి ఎంత త్వరగా వెళితే అంత మంచిది" అన్నది ప్రభ.

"ఏవండీ"

"ఊఁ"

"అబ్బా ఏవిటా దర్జా"

"నేను భర్తని. నువ్వు భార్యవి"

"మావయ్యా"

"ఏవిటి ప్రభా!"

"అబ్బ పెళ్ళయినదగ్గర్నుంచి చూస్తున్నా ఒకటే నిద్ర. ఇలాగయితే ఏం ఉద్యోగం చేస్తారండి బాబూ!"

"ప్రభా ఇదేనా నువ్వు కనుక్కున్నది. ఉద్యోగం వస్తే ఎలాగూ తీరిక వుండదు. అందుకు ఇప్పుడే సుఖపడుతున్నా"

"బాగుంది. అలాగయితే మీకు ఉద్యోగం దొరికినట్టే. నా కెందుకొచ్చిన బెడదగాని, నేను రేపటినుంచి కాలేజీకి వెళుతున్నా."

భర్త మాటలు వినగానే దిలీప్ కప్పుకున్న దుప్పటి అమాంతం తీసి దూరంగాపారేసి లేచి కూర్చున్నాడు.

"ఏవిటీ నువ్వు... కాలేజీకి వెళతావా!"

"ఔను ఏం!"

"హనీమూన్, రాకడ, పోకడ, లాంఛనాలు ఏమీ లేకుండా ఏం తక్కువ, కూటికా, గుడ్డకా" సిగరెట్టుదమ్ము లాగుతూ అన్నాడు దిలీప్,

"ఆ... ఇవ్వాళ హనీమూన్, రేపు హంగ్రీమూన్, ఎల్లుండి యాంగ్రీమూన్, మన కాళ్ళ మీద మనం నిలబడాలి గాని, మామ్మ ఏదో ఇస్తుంది అని ఆశపడికూర్చుంటే అయినట్టే. తీరా ఆమె ఇవ్వకపోతే మన పాట్లు చూడండి"

"ప్రభా, నేను సోమరిపోతు ననుకున్నావా, నేనూ సంపాదించగలను. మీబోడి ఆస్థి నాకేం అక్కర్లేదు,"

"బాగుంది. కొత్తపెళ్ళికొడుకు దర్జా చూపిస్తున్నారు," అన్నది ప్రభ.

"కాకపోతే ఏమిటి బోడి ఆస్థి మీకే కాదు. నాకూ వుంది. నేను తినగలను. నలుగురికి పెట్టగలను కూడా." అన్నాడతడు.

"అబ్బ ఎవరో సంపాయించిన ఆస్థి తినడం నాకిష్టం లేదు బాబూ, పారా సైట్ లాగ. అలాగయితే మనిషి రక్తం పీల్చి బ్రతికే దోమలు, నల్లులు మనం ఒకటే,"

"ప్రభా! కావాలంటే ఈ క్షణాన్నుంచే సంపాదించగలను. కాని మన సంపాదన అప్పుడే ఎవరు తినడానికంట.

"అబ్బ పొద్దున్నే మీతో వాదన నాకెందుకు? నేనుడిగ్రీ పూర్తిచేస్తా, ఏదయినా ఉద్యోగం చేస్తా నా కాళ్ళమీద నేను నిలబడతా."

"అమ్మాయ్! నువ్వు చదవటం నాకే మాత్రం ఇష్టం లేదు. ఎందుకంటావా "వివాహం విద్యానాశనం" అంటారు. చదివినా నువ్వు పాసుకావు."

"అబ్బ శుభం పలకరా మంకెన్నా అంటే పెళ్ళి కూతురు ముండ అంటారేఁటండి. నేను చదువుతాను. ప్యాసయి తీసుతాను." ఆమె నిర్ణయాన్ని గట్టిగా చెప్పింది.

"ఈ మాటలకేంగాని. అది సాగనిపని" అంటూ నవ్వ సాగాడు దిలీప్.

"ఆ ఎందుకు సాగదు. మనసుంటే మార్గం అదే దొరుకుతుంది."

"ప్రిభా! నీకు వయసొచ్చిందిగాని బుద్ధిమాత్రం పెరగ లేదు. ఆడ దానికి అనవై అవాంతరాలు,"

"అవేం ఫరవాలేదు"

"ఫరవాలేదా. నీ అమాయుకతకు నాకు నవ్వొస్తోంది. రేపు పిల్లా జల్లా, అంతకుముందుగా గర్భం తరువాత పిల్లల పెంపకం-ఇల్లుకాపంగా. వీటన్నిటితో నీ చదువు సాగినట్లే."

"పిల్లా జల్లా కనడం ఆడదానివంతయితే పెంచడం మగవాడివంతు."

"అలా కాదు అదంతా ఆడదానిపనే."

"కాదు, కాదు, కాదు నన్నలా బెదిరించి ఆపలేరు. మన పదమూడు షరతులు..." ఆమె నవ్వింది. ఆమెతో పాటు దిలీప్‌కూడా నవ్వుతున్నాడు. అతని నవ్వు చూసి ప్రిభకు కోపం వచ్చింది.

"ఎందుకలా నవ్వుతారు?"

"ఎందుకా, నీ తెలివితక్కువకు" అన్నాడు.

ఆమె భర్తను ఆశ్చర్యంగా చూసింది,

"నాది తెలివితక్కువా, ఎప్పటికీ కాదు. మీరే పొరపడుతున్నారు."

"పిచ్చిదానా, వెయ్యి అబద్ధాలాడి ఓ పెళ్ళి చెయ్యమన్నారు. అదే తనదాకా వస్తే లక్ష అబద్ధాలయినా ఆడొచ్చు. నిన్ను చేసుకోవాలనుకున్నా చేసేసుకున్నా అంతే" విజయగర్వంతో లేచి అటుఇటు పచార్లు చెయ్యసాగాడు.

"మావయ్యా, నేను కాదు తెలివితక్కువదాన్ని. నువ్వు. అందుకే పదమూడు షరతులు పాసుకున్నాం" అన్నది ప్రభ.

"పదమూడు సూత్రాలు ప్రభా! మెడలో ఆసూత్రం కట్టినతరువాత ఎన్ని సూత్రాలయినా దానిముందు వాష్ కాక, అంతే"

"అదేం కుదరదు. మీరు మోసంతో నన్ను లోబరచుకుంటే అధికారంతో నేనుమిమ్మల్నిఎదిరిస్తా. తెలిసిందా! ఈ ప్రభంటే అంత తెలివితక్కువది కాదండీ" ఆమె కోపంగా గదిలోంచి వెళ్ళిపోయింది.

కానీ ఆమె పైట చెరగు అతనిచేతుల్లో వుండటంతో ఆమె ముందుకు వెళ్ళలేకపోయింది.

"వదలండి, ఏవిటా మొరటుతనం"

"వదలను"

"అబ్బ వదలండీ"

వారిద్దరూ వాదులాడుకుంటూ వుండగా మంగా యమ్మగారు రేడియో ఆన్ చేసినట్లున్నారు. "మధురానగ రిలో చల్లలమ్మ బోవా, దారివిడువు కృష్ణా" అంటూ పాట వినవచ్చింది.

ప్రభ, దిలీప్ వొకరినొకరి చూసి నవ్వుకున్నారు. అంతే కాదు. ఆ మరుక్షణంలో వారిద్దరూ దగ్గరయ్యారు. ఆ గదిలో వున్న గోడగడియారం 'టిక్కు టిక్కు' శబ్దం తప్ప మరేమీ వినపించటం లేదు.

"అమ్మాయి ప్రభా, గంట ఎనిమిది దాటింది. కాఫీ టిఫిను చల్లారిపోతుంటాయి. త్వరగా రండి" మంగాయమ్మ గారి పిలుపులో ఆ దంపతులిద్దరూ తప్పనిసరిగా క్రిందికిదిగి వెళ్ళవలసి వచ్చింది.

* * *

# 3

"ఏమండీ కాలేజీకి వెళ్ళొస్తా"

"ప్రభా నీ మాటనెగ్గాలను కుంటున్నావు. కానీ అలాగే కాని మరో పదిరోజుల తరువాత నువ్వు కాలేజీకి వెళ్ళ లేవు..."

"అంటే. అక్కడ నాకు మీరు జ్ఞాపకం వస్తారు, అక్కడనుంచి నేను మీ కోసం పరుగెత్తుకొస్తానంటారు. అంతేనా. ఏమండోయ్! దిలీప్‌కుమార్ గారూ ఈ ప్రతిభలో కూడా కొంచెం వ్యక్తిత్వం వుంది" ఆమె టేబుల్ మీద వున్న పుస్తకాలు విసురుగా తీసుకుంది. వ్యానిటి బ్యాగ్ భుజానికి తగిలించుకొని విసురుగా బైటికి వెళ్ళిపోయింది.

"ఆడవాళ్ళకు ఎదుటివాడిని లోబరచుకోడానికి ఏడుప్పే ఆయుధం కోపం మరో ఆయుధం ఎందుకంటే కోపం లోనే నీ వెంతబాగున్నావో"

"చాల్లేండి. అలాగే చూస్తూ, కవిత్వం కూడా చెప్పేట్లున్నారు. అదిసరే గాని ఇలా కూర్చొకపోతే అలా బజారుకు వెళ్ళిరండి. లేకపోతే ఏదయినా ఉద్యోగానికి ప్రయత్నం చెయ్యండి, మీకు కాలక్షేపంగా వుంటుంది"

"ఉద్యోగమా! వచ్చేరోజున అదే నన్ను వెతుక్కుంటూ వస్తుంది. అయినా దేనికయినా టైము రావాలి" అన్నాడు దిలీప్

"మరిక్కడుండి ఏం చేస్తారు ;"

"హాయిగా పుస్తకాలు చదువుకుంటూ. కాలేజినుంచి త్వరగా వస్తావు కదా ?"

"అబ్బ మీకు దేవుడు కూడా చెప్పలేడు, ఔనుమరి. అమెరికా లాంటి దేశంలో ఉద్యోగం మీకు నచ్చలేదు.

ఇక్కడేం చేస్తాములేండి. అందులోనూ, అంతా న్యూక్లియర్ పవర్ యాట మిక్ ఎనర్జితో పనిచేసిన వారాయె. వస్తా నాకు టైమయింది" అతనికి టా టా చెప్పి ఆమె కాలేజీకి వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళిపోయిన కొద్ది సేపటి వరకూ దిలీప్ ఆ గదిలో అటు ఇటు పచార్లు చేశాడు. అలమరలో వున్న పుస్తకం వొకటి తీసుకొని చదువుకుంటూ కూర్చున్నాడు. అతనికి తెలియకుండానే నిద్రొచ్చింది. అలాగే తాను కూర్చున్న పడక కుర్చీలో నిద్రపోసాగాడు.

మంగాయమ్మగారు భోజనాల టైము కావడంతో డైనింగ్ హాల్లోకొచ్చి చూసింది. భోజనపదార్థాలన్నీ టేబుల్ మీదసిద్ధంగావున్నాయి. ఆమె భోజనానికి కూర్చొంది కాని ఏదో జ్ఞాపకం వచ్చి అక్కడనుంచి లేచి మేడపైకి వెళ్ళింది. దగ్గరకు వేసిన తలుపులు తోసుకుంటూ గదిలో ప్రవేసించింది.

"బాబూ దిలీప్" అంటూ గదిలో చూసింది. ఆమె చూపు పడక కుర్చీలో పండుకుంటున్న దిలీప్ మీద పడింది. ఆమె మరోమారు అతన్ని పిలిచి మేలుకొల్పాలనుకుంది. కాని ఆమె నోటమాటరాలేదు. అలాగే కన్నార్పకుండా చూస్తూ నిలబడుంది, ఆమె ఎందుకో అడుగులు వెనక్కి వేసు కుంటూ గది బైటకొచ్చింది. తలుపులు దగ్గర కులాగి త్వరత్వరగా మేడమెట్లు దిగింది. డైనింగ్ టేబుల్ దగ్గర

కూర్చొని గబగబా నాలుగుముద్దలు తిని భోజనం ముగించుకుంది.

"ఏటమ్మగారూ అంతముందరగా భోజనం జేస్తున్నారు. ఎక్కడికయినా ప్రయాణమా ?" అడిగాడు, వంటవాడు.

"ఆ... ప్రయాణం కాదు గాని ఎవరోవస్తానన్నారు. అంతే... అంతే...." ఆమె వెళ్ళిపోయింది.

"అమ్మా, దిలీప్ బాబుగారు రాలేదు. వెళ్ళి పిలుచుకు రమ్మంటారా ?"

వంటవాడి ప్రశ్నకూ ఆమె అతనివేపు అలాగే చూస్తూ నిలబడిపోయింది.

"పిలవమంటారా ?" మళ్ళీ వంటవాడు అడిగాడు

అది విన్న మంగాయమ్మగారు మరీ [illegible]గారు ప[illegible]పోయింది,

"ఒద్దు ఒద్దు. అతనేవస్తాడు నీకేమన్నా పనుంటే చూసుకో" అంటూ ఆమె వెళ్ళి డ్రాయింగ్ హాల్లో సోఫాలో కూర్చొని ఆరోజు దిన పత్రిక తిరగేస్తూవుంది, కానీ ఏ పేపరులోనూ నాలుగు బంగులు చదవడం లేదు, మాటి మాటికీ ఆమె మేడమెట్లవేపు పరీక్షగాచూస్తూవుంది. ఆమె ముఖంలో రంగులు మాటమాటకి మారుతున్నాయి. అలా గంటగడిచింది. మేడమెట్ల మీద అడుగుల చప్పుడయింది ఆమె అటుగా ఆతృంగా చూసింది.దిలీప్

మేడ మెట్లు దిగుతున్నాడు, ఆమె అతన్ని ఓ నిమిషం పరీక్షగా చూసింది. వెంటనే తాను చదువుతున్న వార్తా పత్రిక ముఖానికి అడ్డం పెట్టుకుంది. అడుగుల చప్పుడు దగ్గర దాకా వచ్చింది.

"పెద్దమ్మా"

"అ....ఆ....పిలిచావా !....దిలీప్ నువ్వేనా ...పిలిచింది" ఆమె కంగారుగా అతన్ని చూసి అన్నది,

"అరే అదేంటి పెద్దమ్మా ఏదో భయంకర వార్త పేపర్లో చూస్తున్నావా లేకపోతే పగటి కలలేమయినా కంటున్నావా ?" అతడునవ్వాడు.

"అబ్బె... ఆబ్బె... అదేం కాదు. బాబూనువ్వు.... నువ్వు.... భోంచేశావా ?"

"లేదు పెద్దమ్మా పద భోంచేద్దాం తోడుగా ప్రభ కూడా వుంటే బావుండేది, కాని ఆమె చదువో అంటూ పోయిందామెను," అన్నాడతను.,

"నేను భోంచేశాను బాబూ నువ్వుతినిరా"

"అదేం కుదరదు, నవ్వూనాకు తోడుగా కూర్చోవాలి. నన్నెందుకు పిలవలేదు పెద్దమ్మా ?"

"పిలవటానికి వచ్చాను బాబు. అహ రాలేదు, ఏదో తొందరగా ఆకలేసి తినేశా"

ఆమె అలా అంటూవుంటే దిలీప్ ఆమె చెయ్యి పట్టుకొని డైనింగ్ టేబుల్ దగ్గరకుతీసికెళ్ళి కూర్చోబెట్టాడు. వంటవాడు, దిలీప్‌తో పాటు ఆమెకూ వడ్డించాడు,

"నాకెందుకు వడ్డిస్తావు, నేను భోం చేశానుగా"

"అమ్మా ఎందుకో మీరు ఈ రోజు కంగారుగా వున్నారు, ఈ వయసులో భోజనం సరిగా వుండాలమ్మా లేకపోతే ఆరోగ్యం దెబ్బతింటుంది."

అంటూ వంటవాడు ఆమెకూ వడ్డించాడు. మంగాయమ్మగారు మారు మాట చెప్పకుండా అతనితో కలిసి భోం చేసింది. మధ్యమధ్య దిలీప్ ఆమెను అనేకసార్లు పలక రించాడు. కానీ ఆమె పరధ్యాన్నంగానే వుండి సమాధా నాలు చెప్పసాగింది.

"పెద్దమ్మా... ఏమిటి ఆలోచిస్తున్నావు?" అడిగాడు దిలీప్.

కాని ఆమె అతనికి సరైన సమాధానం చెప్ప కుండానే భోజనం ముగించుకొని డ్రాయింగ్ హాల్లోకి వచ్చి కూర్చుంది.

"పెద్దమ్మా నే వెళ్ళి విశ్రాంతి తీసుకుంటా" దిలీప్ లేచి నిలబడ్డాడు.

మంగాయమ్మగారు అతన్ని పదే పదే చూస్తూంది. అది గమనించిన దిలీప్,

"పెద్దమ్మా, అమెరికాలో వుండగా రాత్రింబవళ్ళు పగలనక పరిశోధనలు చేసి చాలా అలసిపోయాను. అందుకే వీలున్నప్పుడల్లా విశ్రాంతి తీసుకోవాలనిపిస్తుంది" అన్నాడు

"బాబుగారు కొత్త పెళ్ళికొడుకు, పగటిపూట నిద్ర రావడం సహజమే" అంటూ ముసిముసి నవ్వులు నవ్వుతూ నిలబడ్డాడు వంటవాడు.

"అధిక ప్రసంగం. వెళ్ళి నీ పని చూసుకో" ఆమె వంటవాడిని కసిరింది.

"రాత్రికి కూరలేమిటా అని..."

వంటవాడు చెపుతున్నది వినకుండానే మంగాయమ్మగారు.

"తరువాత చెపుతాలే" అంటూ ఆమె అతన్ని పంపేసింది. ఈ లోగా దిలీప్ మెల్లమెల్లగా తింటుంటే ఆమె అతన్ని పరీక్షగా చూస్తూ కూర్చుంది.

అలా ఆమె ఎంతసేపు కూర్చుందో ఆమెకే తెలియదు. నౌకర్లంతా ఆమెను పలుకరించటానికికూడా భయపడ్డారు,

సాయంత్రానికి ప్రతిభ కాలేజీనుంచి వచ్చేసింది. ఆమె రాకనుకూడా మంగాయమ్మగారు గమనించనేలేదు.

"మామ్మా! ఏమిటలా కూర్చున్నావు" అని అడిగింది.

[8]

"నేనా! ఆ, ఏం లేదమ్మా, పూర్వకాలపు విషయా లేవో గుర్తు వచ్చి అలా కూర్చున్నాను అంతే" అన్నది.

ఈ లోగా వంటమనిషి రెండు కప్పుల్లో టీ తీసుకొచ్చి వారిద్దరికీ ఇచ్చి వెళ్ళిపోయాడు. వారిద్దరూ టీ చప్పరిస్తూ కూర్చున్నారు.

"అమ్మాయి ప్రభా!"

"ఏమిటి మామ్మా!"

"మీ ఆయన సామాన్యుడు గాడమ్మా!"

"సామాన్యుడని ఎవరన్నారు మామ్మా. ఆయన సామాన్యుడే అయితే నన్నెలా పెళ్ళి చేసుకోగలుగుతాడు. అమెరికా ఎలా వెళ్ళగలుగుతాడు. అంతేకాదు. అంత పెద్ద సైంటిస్టుగా ఎలా తయారవగలుగుతాడు!" అన్నది ప్రభ.

"అది కాదమ్మా, ఇలా దగ్గరకు రా" అన్నది.

"ఏమిటి మామ్మా అంత చిదంబర రహస్యం."

"హుష్! దిలీప్ సామాన్య వ్యక్తిగాదు. అతనిలో ఏదో మహత్తర శక్తివుంది."

"మామ్మా! నీకేమన్నా పిచ్చా. ఇప్పుడు మహత్తర శక్తి వున్నదంటావు. రేపు ఆయనే దేవుడనికూడా అంటావు" ఆమె నవ్వింది.

"అది కాదే పిల్లా! నేను చెప్పేది మనసులో వుంచుకో, మీ ఆయన పండుకుంటుంటే గదిలోకి వెళ్ళి చూశాను,

అప్పుడు ఏమయిందో తెలుసా? అతని తలచుట్టూ కాంతి చక్రం తిరుగుతుంది. అది మహాపురుషులకుగాని వుండదు” అన్నది.

ఆమె మాటలు వింటున్న ప్రభ విరగబడి నవ్వనారంభించింది.

“మామ్మా! ఆయనో మహాపురుషుడు. ఆయనకు పెద్దమ్మవయిన నువ్వో పెద్దమహానుభావురాలివి, ఎవరన్నా వింటే నవ్వుతారమ్మా” అన్నది ప్రభ.

“ఏమోనమ్మా! నాకలా అనిపిస్తుంది. దేనికయినా మంచిదని నీ చెప్పిన వేశాను అంతే” అన్నదామె.

“మామ్మా, కొంపతీసి ఈ విషయం బయట చెప్పి వుంటే ఇంక మన ఇల్లొక యాత్రాస్థలంగా మారుతుంది. ఆయనను చూడటానికి ఏదన్నా టిక్కెట్టు పెడితే కావలసినన్ని డబ్బులు. ఆయనింక ఉద్యోగం చెయ్యవలసిన పనే వుండదు.” అంటూ ప్రభ మళ్ళీ నవ్వ నారంభించింది.

“ఇదుగో, నా మాట కొంచెం రహస్యంగా వుంచు. అవసరమయితేనే నామాటలో నిజానిజాలు పరీక్షించు. అంతేగాని లేనిపోనిగోలచేసి, నీ కాపురంలో కలతలు రేపుకోకు” అంటూ ఆమె సలహా చెప్పింది.

మామ్మగారి సలహా పాటిస్తానంటూ ఆమెకు మాట ఇచ్చి, ప్రభ మరో కప్పు టీ తీసుకుని తన గదికి వెళ్ళింది.

ఆమె వెళ్ళేటప్పటికి దిలీప్ కుంభకర్ణుడిలా నిద్రపోతున్నాడు. ప్రభ చేతిలో వున్న పుస్తకాలు టేబిల్ మీద విసిరి వేసింది. అతని దగ్గరకు వెళ్ళి తట్టిలేపింది. అతడు కళ్ళు నలుపుకుంటూ లేచి కూర్చున్నాడు. ఆమె భర్తకు టీ కప్పు అందించింది. అతడు వేడి వేడి టీ తాగుతూ ప్రభను ప్రేమగా చూశాడు.

"ఇదేనా కాలేజీనుంచి రావడం?"

"ఔనండి"

"అబ్బ ఇంత లేటే. ఇలాగయితే నేను భరించలేను. నే నొక్కడినే బోర్ కొడుతుంది."

"అందుకే ఏదన్నా వుద్యోగం చూసుకోమన్నా అలా మీరు ఆఫీసుకు వెళ్తే ఇట్టే టైము జరిగిపోతుంది. ఏమంటారు?"

"నా కెక్కడేం ఉద్యోగం దొరుకుతుంది, అంతగా ప్రయత్నంచేస్తే ఏదో పద్దులు రాసే గుమాస్తా గిరి దొరుకుతుంది. రెండొందలో మూడొందలో జీతం ఇస్తారు. అది చెయ్యమంటావా?"

"అది కాదండీ మీకు న్యూక్లియర్ పరికరాలు తయారు చేసే కంపెనీలలోనో, గవర్నమెంటులోనో ఉద్యోగం రావాలని కూర్చుంటే రావచ్చు. కానీ నే నొక చోట మీ రొక చోట. అబ్బ నేను ఒంటరిగా వుండలేనండి" ఆమె అతన్ని ప్రేమగా చూసింది.

దిలీప్ ఆమెను దగ్గరకు తీసుకున్నాడు. ఆ ఇదరూ ఒకరి కౌగిలిలో మరొకరు పెన వేసుకు పోయారు,

కాలం తనపని తాను చేసుకుంటూ పోతూవుంది. చీకటి పడింది. గదిలో లైటులేని విషయంకూడ వారికి తోచలేదు.

"అమ్మాయీ! ప్రభా! స్నానాలు అవి ముగించుకోండి. నౌకర్లు మీకోసం చూస్తున్నారు" అంటూమంగా అమ్మగారు కేకలేశారు. దానితో వారిద్దరూ ఈలోకంలోకి వచ్చారు.

•

"ప్రభా," ఏవిటే నీలో నివే నవ్వుకుంటున్నావు!"

"ఏవిలేదులేవే"

"అబ్బా నా దగ్గర దాయాలటే! అయినా నేను కనుక్కోలేనను కుంటున్నావా ?"

"ఆ, అన్నీ కనుక్కున్నావు సలీమా చెప్పవే నేనెందుకు నవ్వింది?" అడిగింది ప్రభ,

"నాకు చెపితే ఏమిస్తావే ?"

"చెప్పలేక పోతే నువ్వేమిస్తావే ?" సలిమా.

"అమ్మాయి! నువ్వు నిజం చెప్పాలి. నేను నిజం చెప్పినా అబద్ధమంటే నేనేం చెయ్యగలను."

సలీమా చెప్పింది కూడా నిజమేనని ఆమెకుతోచింది అందుకే ప్రభ,

"నువ్వు సరిగా చెప్పగలిగితే, నువ్వు తినన్నంతటిఫిను. తరువాత సినిమా" అన్నది.

"ప్రభ...మాట వరుసకంటున్నావుగాని, సినిమాకు ఎలా వస్తావే? మీ శ్రీవారు నిన్ను పోనిస్తారా? అదిగాక ఆయన్ని గురించి ఆలోచిస్తున్నావు కదూ? నిజం చెప్పు నేను గెలిచానుకదూ?"

సలీమా అలా అనగానే ఆమె తలవంచుకొని ముసి ముసినవ్వులు నవ్వసాగింది. ఆమె బుగ్గలుకూడా ఎర్ర బడ్డాయి.

"సలీమా. ఏం చెప్పమంటావు? కళ్ళుమూసి నోరు తెరిచినా ఆయన రూపమే కనిపిస్తూవుంటే. అంతేకాదు. పుస్తకం తెరిచినా ప్రతి పేజీలోనూ ఆయన రూపం ప్రత్యక్ష మవుతూవుందే."

"ఓ వో! ఇది నిజంగా చాలా పెద్ద జబ్బే త్యాంక్ గాడ్. ఇది అంటువ్యాధి అయితే నిజంగా ప్రమాదమే. ఇలాగయితే నీ చదువుసాగినట్లే ప్రభా! నా మాట వినవే, చదువులో టైమంతా వృథా చెయ్యక, ఆయనతోటే కాలక్షేపం చెయ్యి"

సలీమా ప్రభకు సలహా ఇచ్చింది.

"ఈ అవరు కాగానే వెళ్ళిపోతా మధ్యలో లేస్తే ఈ తెలుగు లెక్చరరు గోల పెడతాడు" అన్నది.

"సరే అలాగే చెయ్యి. కొన్నాళ్ళు అలా హాస్పిటల్ కు వెళ్ళిరావే. కొంత మనశ్శాంతయినా కలుగుతుంది" అన్నది సలీమా.

క్లాసు జరుగుతూవుంది. ప్రభ ఆలోచనలన్నీ దిలీప్ మీదే వున్నాయి.

"ప్రభా! ఏమిటి అలా పిచ్చిగా చూస్తున్నావు!" అడిగింది సలీమా.

"అదుగోనే దిలీప్ పిలుస్తున్నాడే!"

"ఎక్కడే!"

"అదుగోనే వరండాలో ఆకిటికీ పక్కనే పిలుస్తున్నాడు చూడు"

ప్రభ చూపించిన వేపుగా సలీమా చూసింది. కాని ఆమె కక్కడ ఎవరూ కనిపించలేదు.

"సరే నీకు మతికూడా పోతుందే. అక్కడ ఎవ్వరూ లేరే పిచ్చిముఖమా! అదంతా నీ భ్రాంతి. ప్రేమ ముదిరి, పైత్యంలో పడేలావుంది" అంటూ నవ్వింది.

పాఠం చెపుతున్న తెలుగు లెక్చరరుగారు ఆమె నవ్వు విన్నాడు.

"సైలెన్స్! చదువులో లేదుగాని సర్దాలకు నవ్వులు. ఎందుకొచ్చిన చదువులు పెళ్ళిళ్ళయితే ఈపాటికి అరడజను మంది సంతానం. ఇదిక్లాసు అన్న జ్ఞానం వుండాలి" అంటూ

శాపనార్ధాలు మొదలెట్టాడు. ఇంతలో బెల్ మోగింది తెలుగులెక్చరరుగారు తిట్టుకుంటూనే వెళ్ళిపోయాడు.

"ప్రిభా! వెళ్ళవే మళ్ళీ ఇంగ్లీషులెక్చరరువస్తే వెళ్ళ డానికి వీలుపడదు" అన్నది

దాంతో ప్రిభ క్లాసులోనుంచి వెళ్ళిపోతూ వరండా అంతా చూసింది. కాని ఆమెకి దిలీప్‌జాడ ఎక్కడా కనిపిం చలేదు, దాంతో ఆమె ఇంటిదారిపట్టింది.

ఆమె ఇల్లుచేరేసరికి దిలీప్ రూములో హాయిగా నిద్రపోతున్నాడు ఆమెకు ఇతన్నిచూసి కోపం వచ్చింది, కానీ వెంటనే ఆమెలో జాలికూడా కలిగింది. ఆమె అతని దగ్గరకు వెళ్ళింది. మంచం మీద కూర్చొని అలాగే చూడ సాగింది. అలాచూస్తూనే ఆమె అతనిమీద వాలిపోయింది. ఇద్దరి పెదవులు కలిశాయి. ఇద్దరి చేతులు శరీరాల చుట్టూ పెనవేసుకున్నాయి ఇంతలో తలుపులు తెరిచిన చప్పుడ యింది. ఇద్దరూ అటు చూశారు. ట్రేలో రెండు టీ కప్పులు పెట్టుకొని, లోపలకు రాబోయిన వంటవాడు వారిద్దరినిచూసి, భయంతోను సిగ్గుతోను వెనక్కి వెళ్ళ బోయి తలుపుకు కొట్టుకున్నాడు, అదిచూసిన ప్రిభ దిలీప్‌లు వొకరి కొకరు దూరంగా జరిగారు. అది గమనిం చిన వంటవాడు లోపలకు వచ్చి టీ కప్పులున్న ట్రే బల్ల మీద పెట్టి వెళ్ళిపోయాడు.

"కాలేజి అయిపోయిందా ప్రభా!"

"కాలేదు కాని మీరు కాలేజీకొచ్చారా!"

"నేనా, బాగుంది. ఇంట్లోనుంచి బయటికి "అడుగు పెట్టి వారం అయింది" అన్నాడు దిలీప్.

"ఏమండీ నాకు చదువు ఎలానూ అబ్బదు. ఏ పుస్తకం చూసినా, ఎటు చూసినా మీరే కనిపిస్తున్నారు. నేనిక ఒంటరిగా వుండలేను. మనం అలా కొన్నాళ్ళు దేశం తిరిగొద్దాం" అన్నది,

దిలీప్ ఆమె మాటలకు ఎంతో సంతోషించాడు ఆ రాత్రి వారు హనీమూన్ ట్రిప్పుకు బయలుదేరారు. ప్రభ ఊటీ వెళ్ళాలని చెప్పడంతో వారక్కడికి చేరి హోటల్‌లో మకాం చేశారు.

అది డిసెంబరునెల, చలి విపరీతంగా వుంది. సాయంత్రం అవసరమైన స్వెట్టర్లు, మఫ్లర్లతో ఆ నవదంపతులు అలా షికారుగా బయలుదేరారు. అప్పటికే చలి విపరీతంగావుంది, ప్రకృతి దృశ్యాలు చూసుకుంటూ వారు వూరికి దూరంగా నడిచివెళ్ళిపోయారు. వారిలాగానే చాలా మంది షికారుకు బయలుదేరారు. దారి పొడుగునా అనేక రకాల వూలు, పూలమొక్కలు చూసి వారు చాలా ఆనందపడ్డారు. రకరకాల కూృరమృగాల అరుపులు వినిపిస్తూవున్నాయి.

[:]

పడమరకు వాలిన సూర్యుడు ఎర్రగా కనిపిస్తున్నాడు. పొగమంచు అప్పుడే ఆ ప్రదేశాన్నంతా అలుముకుంటూ వుంది. హుషారుగా నడుస్తోంది ప్రభ. ఆమె అప్పటికే పది అడుగులు ముందుగా నడుస్తోంది. వారికి కొద్ది దూరంలో పెద్దగా కేకలు వినిపించాయి. ప్రభ వొక్కసారిగా వెనక్కి పరుగెత్తుకొచ్చి దిలీప్ చెయ్యి పట్టుకొంది.

"రక్షించండి, హెల్ప్, హెల్ప్" అంటూ ఆడా మగా గొంతులు వినిపిస్తున్నాయి. దిలీప్ ప్రభ చెయ్యి పట్టుకొని ముందుకు పరుగెత్తాడు. వారు కాలిదారి విడిచి మెయినురోడ్డుకు చేరారు. అక్కడో కారు ఆగివుంది, యమకింకరుల్లావున్న నలుగురు ఆ కారు తాలూకు యజమానిని, అతని భార్యను బలవంతం చేస్తున్నారు. కొట్టి వారి వద్దనున్న డబ్బు వస్తువులు బలవంతాన లాక్కుంటున్నారు. వారి చేతులలో వున్న కత్తులతో ఆ భార్యా భర్తలను పొడవబోతున్నారు. ప్రాణభయంతో ఆ భార్యా భర్తలు పిచ్చిగా అరుస్తున్నారు.

దిలీప్ ప్రభ చెయ్యి విదిలించుకుని వారివేపు పరుగెత్తాడు.

"ఆగండి ఏమిటీ దౌర్జన్యం" అన్నాడతను.

"నోరు మూసుకొని నీ దారిన నువ్వు పో. లేదా వీరికి పట్టిన గతే మీ ఇద్దరికీ పడుతుంది" అన్నాడు వాళ్ళ నాయకుడు.

"అరే, ఆళ్ళనట్టాపంపితే వాళ్ళే రేపు సాక్షులుగాను, మనకు శత్రువులుగా తయారవుతారు. ఆళ్ళకాడున్న డబ్బులు, నగలు, రిస్టువాచీలు తీస్కోండి" అన్నాడుమరో దొంగ.

అప్పటికే ఇద్దరు దొంగలు వారికి దగ్గరగావచ్చారు

"ఆగండి మీకు ప్రాణాలమీద ఏమాత్రం ఆశ వున్నా దగ్గరకు రాబోకండి" అంటున్నాడు దిలీప్.

కాని వాళ్ళు దిలీప్ మాటలకు బెదరలేదు. వారు అప్పటికే ప్రభ మెడలోవున్న నెక్లెసుతోపాటు బంగారు గాజులు, ఉంగరాలు రిస్టువాచి లాక్కున్నారు. తరువాత వారంతా వొక్కసారిగా వెళ్ళి దిలీపు మీద పడ్డారు. అతడు చెయ్యి కూడా కదిలించలేదు. కాని వారంతా పెద్దగా కేకలు వేస్తూ క్రిందపడిపోయారు.

"వొరే వాడ్ని తాకమాకండి, కరంట్ షాకులా కొడుతుంది వాడ్ని తాకితే" అరుస్తున్నాడు వాళ్ళ నాయకుడు. వాళ్ళను చూసి దిలీపు పిచ్చిగా నవ్వుతున్నాడు. ప్రభ ఆ వింతను ఆశ్చర్యంగా చూస్తూ నిలబడింది.

క్రిందపడిన వాళ్ళ దగ్గరకు దిలీప్ భయంకరంగా నడుస్తున్నాడు.

"బాబోయ్ మమ్మల్ని వదిలెయ్యి నీకు దండం. ఇదుగో ఈ నగలు, అవి ఇక్కడే పడేస్తున్నాం" అంటూ వాళ్ళు

అరుస్తున్నారు.

కిందపడ్డ నగలను ఏరుతున్నాడు దిలీప్. అవకాశం దొరికింది. దొంగలంతా నెమ్మదిగా లేచి కాలికి బుద్ధి చెప్పారు. అది చూసిన దిలీప్ వాళ్ళను తరుముతున్నట్లుగా నాలుగడుగులు ముందుకు వేశాడు, అంతే దొంగలు భయంతో వో గెంతు గెంతి చాలా స్పీడ్‌గా పరుగెత్తనారంభించారు. వాళ్ళని చూసి విజయగర్వంతో దిలీప్ నవ్వాడు.

దొంగలు పారిపోవడంతో కార్లో వచ్చిన భార్యాభర్తలు దిలీప్ దగ్గరకు వచ్చి అతనికి ధన్యవాదాలు పలికారు. అతని సహాయాన్ని జీవితాంతం మరిచిపోమని మాట ఇచ్చారు. తరువాత దిలీప్ వారి వస్తువులు వారికిచ్చేసి వారిని పంపించివేశాడు.

దిలీప్, ప్రభ హోటలుదారి పట్టారు. ప్రభ తాను చూసిన దాన్నిగురించి ఆలోచిస్తుంది. ఆమెకు మంగాయమ్మగారు దిలీప్‌ను గురించి చెప్పిన విషయంకూడా జ్ఞాపకం వచ్చింది.

"ప్రభ" పిలిచాడు దిలీప్. అతని పిలుపుకు ఆమె కంగారు పడింది.

"ఆ ... పిలిచారా ... దేనికి ... మరి ... నేను ..." ఆ కంగారులో ఆమె ఏదో మాట్లాడుతోంది

"ప్రభా, ఎందుకలా కంగారు పడుతున్నావు? మనం ఎవరికి భయపడవలసిన పనిలేదు. ఆ దొంగవెధవలు ఈ పాటికి ఎంతో దూరం పారిపోయివుంటారు.

ఏదన్నా కబుర్లు చెప్పు. నడవ వలసినదారి కొంతయినా తరుగుతుంది" అన్నాడు ప్రభతో....

ప్రభ అతన్ని ఇంకా ఆశ్చర్యంగానే చూస్తుంది. దిలీప్ అదేమీ లెక్కచెయ్యకుండా ఇంకాముందుకు నడిచాడు, ఇంక ఆమెకు గత్యంతర లేక అతనివెంట నడుస్తూ వెళ్ళింది.

*    *    *

దిలీప్, ప్రభలు, మకాం. చేసిన హోటలు విదేశీయులది, వేసవిలో తప్ప ఆ హోటల్‌కు పెద్దడిమాండు వుండదు. దిలీప్‌మాత్రం కావాలనే ఆ హోటల్‌లో దిగాడు. ప్రభకు, ఇతర దేశాలవారి ఆహార వ్యవహారాలు ఎలా వుంటాయో చూపించాలని అతని ఆశ, అందుకే అలా చేశాడు.

భార్యా భర్తలిద్దరూ ఆ సాయంత్రం జరిగిన సంఘటన గురించి మాట్లాడుకుంటూ చాలాసేపు నిద్రమేల్కొనే వున్నారు. కొంతసేపయిన తరువాత వారు నిద్రకుపక్రమించారు.

ప్రభకు మెలుకువవచ్చింది. ఆమె పక్కనే వున్న దిలీప్‌ను చూసింది. అతడు గాఢనిద్రలో వున్నాడు. ఆమె పక్కనే వున్న టీపాయి మీద పెట్టిన రిస్టువాచ్ తీసుకుంది. రేడియం డయల్‌లో ఆమెకు టైమ్ స్పష్టంగా కనిపించింది.

అప్పటికి రాత్రి వొంటిగంట దాటింది. ఆమె విసుగ్గా చేతి గడియారాన్ని టిపాయి మీద పెట్టి ఆప్యాయంగా దిలీప్‌ను కౌగలించుకుంది. కాని దిలీప్ ఏమాత్రం కదలేదు. ప్రభ ఏదో ఆలోచిస్తూ కళ్ళు మూసుకుంది. బైట ఎవరో నడుస్తున్నట్లుగా బూట్లచప్పుడు వినిపించింది. అది హోటల్ కావడంతో ఆమె అది అంతగా పట్టించుకోలేదు. డోర్ హ్యాండిల్ కదలడంతో ఆమె లేచి కూర్చుంది. జీరో వాల్టు బల్బు కాంతిలో హ్యాండిల్ కదిలినట్లుగా ఆమెకు కనిపించింది.

ప్రభ అలాగే చూస్తూ కూర్చుంది. అవసరమయితే దిలీప్‌ను లేపుదామనుకుంది. మరో పావుగంట వరకూ అక్కడే శబ్దం వినిపించలేదు. మళ్ళీ బయట బూట్లచప్పుడయింది. ఈ సారి ప్రభ తన బెడ్ మీదనుంచి లేచి నెమ్మదిగా డోర్ దగ్గరకు వెళ్ళింది. లోపల వేసిన బోల్టు వేసినట్లుగానే వుంది. ఆమె డోర్ హ్యాండిల్ పట్టుకుని తిప్పింది. కాని అది కదల్లేదు. లాక్ చేస్తే తప్ప డోర్ హ్యాండిల్ కదలకుండా వుండదు. ఆమెకు అనుమానం వేసి హ్యాండిల్‌ను గట్టిగా తిప్పింది. కాని లాభం లేకపోయింది.

ఆమె వెంటనే వెళ్ళి టీపాయ్ మీదవున్న తాళంచెవి తెచ్చి తలుపుకున్న తాళం తియ్యబోయింది. కాని తాళం చెవి ఏమాత్రం కదల్లేదు. బైట నుంచి మరో తాళంతో ఆ తలుపు రాకుండా ఎవరో తాళం వేశారు.

ఆ, అనుమానంరాగానే ఆమె శరీరమంతా చెమట పట్టింది. అరచేతులు తడ బడ్డాయి. అతి కష్టంమీద ఆమె

బెడ్ దగ్గరకు చేరింది ఆమె భర్తను లేపింది. విషయంవిన్న దిలీప్ ఆమె మాటలకు నవ్వాడు.

"ప్రభ, బైటవాళ్ళు రాకుండా మనం లోపల బోల్టు వేసుకున్నాం. మరి బైటికి రాకుండా వాళ్ళెవరో మనల్ని లోపలపెట్టి తాళం వేశారు. మంచిదేగా. మన సుఖానికి ఎవ్వరూ అడ్డురారు. రా, దగ్గరగా." అంటూ ఆమెను మరింత దగ్గరగా లాగాడు దిలీప్.

"అబ్బ. ఆగండి. విషయం తెలుసుకోకుండా సరదా లేమిటి?" అన్నది ప్రభ.

అంతలో పక్కన కిర్రు మంటూ శబ్దం కావడంతో వారిద్దరూ అటుగా చూశారు. గది గోడలు రెండూ దగ్గరకు జరుగుతున్నాయి.

"అమ్మో! ప్రమాదం. ఆగోడలు రెండూ జరిగివస్తే మనం వాటి మధ్య పడి నలిగిపోతాం" ప్రభ కేక వేసింది.

"ప్రభా, ఇది నిజమా, లేక కలా? గదిగోడ లేమిటి దగ్గరకు జరగడమేమిటి! అంతా తమాషాగా వుంది."

"ఏమండీ నాకు భయంగావుంది. మన మీద ఎవరో పగ బట్టారు. కారణం తెలియదు. మన దగ్గర నగలు, డబ్బు దోచుకోవాలంటే, అవి మొత్తంకలిపి రెండూ మూడు వేల కన్నా ఎక్కువ లేవుగా." అంటూ మంచంమీద నుంచి కిందకి దూకింది ప్రభ.

అప్పటికే రెండు మీటర్లకన్నా స్థలం ఎక్కువ లేదు.

"బాబో గోడలొచ్చేస్తున్నాయి"

ఆమె కేకతో దిలీప్ కూడా కంగారుగా లేచాడు. గోడలు నెమ్మదిగా ముందుకు జరుగుతున్నాయి. అలా వచ్చిన గోడలు మంచాన్ని ఆనుకున్నాయి. ఇంక గత్యంతరం లేక ఆ భార్యా భర్తలు మంచంమీద నిలబడ్డారు.

"దిలీప్!"

"ఎవరు నువ్వు?"

"అది నీ కనవసరం. నేను చెప్పినట్లు వింటే నువ్వూ నీ భార్య బ్రతుకుతారు. లేకంటావా నీ ఖర్మ"

"ఎవరు నువ్వు. ఏం కావాలో చెప్పు?"

"మాదగ్గరున్న నగలు, డబ్బు అంతా తీసుకోండి. కానిఅనవసరంగా మమ్మల్ని చంపకండి" ప్రభ భయంతో అరిచింది.

"ఉష్ అరవకు దానివల్ల ప్రయోజనం లేదు. నువ్వు అందరి కళ్ళు కప్పి తప్పించుకోవాలని చూస్తున్నావు కదూ? నీవిషయం నేనెవ్వరికి చెప్పను. మర్యాదగా, నీదగ్గరున్న ఫార్ములాలు ఇచ్చెయ్యి. అంతే నీకు కావలసినంత డబ్బిస్తా. సరేనా"

మాటలు మాత్రం వినుపిస్తున్నయి. మనిషి కనిపించడం లేదు.

"నాదగ్గరేమిలేవు అన్ని నాశనమయిపోయాయి"

"దిలీప్! అబద్ధమాడుతున్నావు. పండంటి జీవితాన్ని ఎందుకు నాశనం చేసుకుంటావు? నువ్వనుకున్న దానికన్న

నేను ఎక్కువ డబ్బులిస్తాను. ఆ ఫార్ములా కాగితాలు ఇచ్చెయ్యి" ఆ కనిపించని వ్యక్తిమాటలు చాలాకటువుగా వున్నాయి.

"ఏమండీ అలాంటి దేమయినా వుంటే ఇచ్చెయ్యండి. లేకపోతే ఆ వ్యక్తి అన్నంతపనీ చేసేటట్లున్నాడు" ప్రభ భర్తను బ్రతిమాలింది.

"ప్రభ! ఆ మతిమాలినవాడెవడో ఏదో అన్నాడని నువ్వా నమ్ముతున్నావా. మన దగ్గర అతనంటున్న ఫార్ములాలూ లేవు, పళ్ళగంపలూ లేవు. అతనెవడో పట్టి పిచ్చివాడల్లే వుంది,... ఇదుగో బాబూ! నువ్వెవరివో నాకు తెలియదు, ఇదుగోనిను పుణ్యముంటుంది, నా భార్య కూడా జడుస్తోంది. మా దగ్గరున్న డబ్బంతా తీసుకొని విడిచిపెట్టు," దిలీప్ కూడా ఆ కనిపించని వ్యక్తిని బ్రతిమాలాడు.

"దిలీప్ నన్ను బుకాయించకు, జాగ్రత్త. నిప్పుతో చెలగాటం ప్రమాదం. నేనో అయిదు నిముషాలు టైమిస్తున్నాను. లేకపోతే, ఈ రెండుగోడలమధ్య పడి పిండిపిండిగా తయారౌవుతారు" మళ్ళీ ఆ గొంతు దిలీప్‌కు సలహాఇచ్చింది.

ప్రభ ఎన్ని విధాల బ్రతిమాలినా దిలీప్ ఫార్ములా విషయాలే తనకు తెలియవన్నాడు కనిపించని వ్యక్తికూడా అతన్ని అనేక విధాల బ్రతిమాలాడు. ఆశపెట్టి చూశాడు. చివరకు భయపెట్టాడు. కాని లాభం లేకపోయింది గోడలు

దగ్గరకు జరుగుతున్నాయి. ఇనుపమంచం వంకర్లు తిరిగి పోయింది. ప్రిభ భయంతో దిలీప్‌ని కౌగలించుకుంది, అలాగే అతని భుజంమీద తెలివితప్పి పడిపోయింది, ఇంక దిలీప్‌కు గత్యంతరం లేకపోయింది, రెండు చేతులతో గోడలను దగ్గరకు రాకుండా అదిమిపట్టుకున్నాడు. అతని ముఖమంతా చెమటతో నిండిపోయింది. ముఖం ఎర్రబడింది. అతడిప్పుడు భయంకరంగా కనిపిస్తున్నాడు. తాను ప్రాణరక్షణకోసం ప్రయత్నిస్తున్నాడు.

"దిలీప్! ఆఖరిసారి అడుగుతున్నా. నా మాట విను. లేదా ఇంకో నిమిషంలో ఈ రెండుగోడల మధ్యన నలిగి పోతావు" మళ్ళీ ఆ గొంతు అతన్ని హెచ్చరించింది

"నేనూ అదేమాట అంటున్నా. అనవసరంగా నా జోలికి రాకు. వచ్చావా నీ అంతం చూస్తా" దిలీప్ మళ్ళీ అతన్ని హెచ్చరించాడు.

గోడవతలనుంచి భయంకరంగా నవ్వు వినిపించింది. గోడలు కటకట లంటూ ముందుకు జరిగాయి. దిలీప్ తన బలాన్నంతా వినియోగించి వాటిని గట్టిగా నొక్కి పట్టుకున్నాడు.

శరీరానికి వేడితగలడంతో ప్రిభ, దిలీప్ భుజంమీద నుంచి లేచింది. అతనిప్పుడొక నిప్పు ముద్దలాగ ఎర్రగా వున్నాడు.

"ఎవడీ! ఏమిటిదంతా!" ప్రిభ కంగారుగా అడుగుతుంది..

"ప్రభా! భయపడకు. నన్ను తాకకుండా దూరంగా నిలబడు అంతే"

గోడలు దగ్గరకు జరగకుండా అతడు వాటినిబలంగా తోశాడు. కదులుతున్న గోడలకు అతని బలానికీ పోటీలా వుంది ఆ పరీక్ష. దిలీప్ చెయ్యి పెట్టినచోట గోడ పెద్ద చప్పుడు చేస్తూ కొంత మేర పడిపోయింది గోడలు కదలడం ఆగిపోయింది, గోడకవతలగా సూటు వేసుకున్న పొట్టివ్యక్తి నిలబడివున్నాడు. అతని ప్రక్కనే కండలు తిరిగిన నలుగురు వస్తాదులు నిలబడి వున్నారు. వాళ్ళు దిలీపును మింగేద్దాం అన్నట్లుగా చూస్తున్నారు.

"దిలీప్! గోడపడగొట్టగానే సరిగాదు ఇప్పటికయినా నా మాట విను. ఈ భయంకరాకారుల చేతుల్లోపడి నలిగి పోకు" అన్నాడా పొట్టి వ్యక్తి.

"నేనూ అదేమాట అంటున్నా. నా భార్య ఏమౌస్తుం దని ఇందాకటినుంచి మీకు అవకాశం ఇచ్చాను. ఇంక క్షమించను,"

"ఊ... అధిక ప్రసంగం. నీ ముందే నీ భార్యను ఏం చేస్తామో చూడు. అరే చూస్తారేం కానివ్వండి" సూటు వేసుకున్న పొట్టివాడు వాళ్ళను ఉత్సాహపరిచాడు.

అంతే. వారంతా పడిపోయిన గోడగుండా ముందుకు రావడానికి ప్రయత్నించారు. దిలీపు వారిని తన చేతితో తాకాడు. అంతే అతని చేతిలోనుంచి పెద్ద ఎలక్ట్రికల్

స్ఫార్క్ లాంటిది వచ్చింది. అతడు తాకిన ప్రతివాడు పెద్ద కేక పెట్టి క్రిందపడిపోయాడు. అది చూచిన ఆ సూటు మనిషి తన జేబులోనుంచి రివాల్వరుతీసి, దిలీప్‌ను కాల్చ బోయాడు. పడిపోయిన గోడ తాలూకు రాతిని తీసి దిలీపు అతనిమీదికి గట్టిగా విసిరివేశాడు. ఆ దెబ్బ అతనికి తగి లింది. దెబ్బ తగిలిన కోతి పిల్లలా అతడు నేలమీదపడితన్ను కున్నాడు అదిచూసి దిలీప్ పెద్దగా నవ్వాడు. అతడునెమ్మ దిగ లేచాడు.

"చూడు నిన్నేం చేస్తానో" అన్నాడు తనకు తగిలిన దెబ్బ దులుపుకుంటూ.

"ఏడిశావు" అంటూ దిలీప్ మరో రాతిని చేతిలోకి తీసుకున్నాడు. అంతే ఆ సూటువేసుకున్న పొట్టివాడు పెద్ద కేక పెట్టి అక్కడనుంచి పారిపోయాడు.

"ఏమండీ! మీ శరీరమంతా కాల్చిన ఇనుములా ఎంత ఎర్రగా వుందో చూసుకోండి" అన్నది ఆశ్చర్యంగా ప్రభ.

"అదా... అది కోపంనుంచిలే" అని దిలీప్ అంటూ వుండగానే అతడు మామూలు మనిషి తయారయి పోయాడు.

"పదండి పారిపోదాం. బ్రతికుంటే బలుసాకయినా తినవచ్చు అంటారు. మనకెందుకొచ్చినపీడ."

భార్య తొందర చెయ్యడంతో కలిగిపోయిన తమ

బట్టల పెట్టె తీసుకొని ఆరాత్రే వారు హోటలు బయటకు వెళ్ళటానికి బయలుదేరారు.

హోటల్లో అప్పటికే మనుష్యుల అలికిడి లేకుండా పోయింది అందుకే దిలీప్ కూడా ప్రభతో అక్కడనుంచి నెమ్మదిగా వెళ్ళిపోయారు.

బయట ఎంతో చలిగావుంది, ఏమకలుకొరికే ఆ చలిలో వాళ్ళు ఎటూపోవటానికి తోచక రోడ్డువెంటనడుస్తున్నారు. వారికి కొంత దూరంలో వో కారు మహావేగంగా రావడం చూసి రోడ్డు ప్రక్కగావున్న ఫుట్ మీదికి వెళ్ళారు. కారు హెడ్ లైట్లు కాంతి వారిమీద పడుతూనేవుంది. దగ్గరకు వచ్చిన కారు వారిమీదకు తిరిగింది.

"ప్రభా! జాగ్రత్త శత్రువులు మనల్ని వదల్లేదు. ఈ కారుతో హతమార్చటానికి చూస్తున్నారు నాచెయ్యి పట్టుతో వదలకు."

దిలీప్ ఆమె చెయ్యి పట్టుకుని కారునుంచి తప్పించుకోడానికి అటూఇటూ పరుగెత్తు చున్నాడు. కారుకూడా వారిని విడువకుండా వెంటాడుతూనేవుంది. రోడ్డుప్రక్కగా పారిపోవాలంటే పక్కనే పెద్ద అగాధముంది.

"ఏమండీ నేనింక పరుగెత్తలేను. నా కాళ్ళు వణుకుతున్నాయి."

ప్రభ అరుస్తుంది. ఇక గత్యంతరములేక దిలీప్ ఆమెను తన రెండు చేతులలోకి ఎత్తుకున్నాడు. కారుకు యిప్పుడు

అవకాశము దొరికింది అందుకే అది చాలా వేగంగా వారి మీదకు వచ్చింది. అది వారికి ఒకమీటరు దూరంకన్నా దగ్గరలోనే వున్నది.

ఇక గత్యంతరం లేక డిలీప్ అలాగే నిలబడిపోయాడు.

కారు దగ్గరకు వచ్చింది. దిలీప్‌కు గత్యంతరం లేదు. అందుకే అతడు తన కుడికాలిని ఎత్తి వస్తున్న కారుకు అడ్డు పెట్టాడు. కారు లోపలనుంచి వికటంగా నవ్వులు వినిపించాయి. ఎత్తిన కాలితో కారును బలంగా వెనక్కినెట్టాడు. అది గాలిబెలూన్‌లా వెనక్కి వెళ్ళింది. కానీ అది మరింత వేగంగా ముందుకు వచ్చింది. మరోసారి దిలీప్ కారునిగట్టిగా తన్నాడు. కారు బంతిలా ఎగిరి రోడ్డుపక్కనే వున్న లోయలో పడిపోయింది. వెంటనే అక్కడ మంటలు కూడా లేచాయి. దిలీప్ అక్కడఆగకుండా ప్రభనుఎత్తుకొని చీకట్లో కలిసిపోయాడు.

## 4

"ప్రభా"

"ఏవిటి మామ్మా?"

"ఎలా వున్నదే హనీమూన్? విశేషాలుచెప్పవే తల్లీ"

"బాగానేవుంది మామ్మా"

"అదేవిటే పిల్లా అన్నివేలు తగలేసి కొంపతీసి దాన్లో

పోట్లాడుకున్నారా. మన దిలీప్ మంచివాడేనే. ఈపాటికి వాడిని కొంగున ముడేసుకున్నావనుకున్నా" మనవరాలితో సరాగాలు మొదలుపెట్టింది మంగాయమ్మగారు.

"మామ్మా ఎలుక్కి ప్రాణసంకటం, పిల్లికి చెలగాటం అలావుంది నీ సరదా."

ఆ మాటని ప్రభ తలవంచుకుంది. ఆమెను చూసిన మంగాయమ్మగార్కి మనుమరాలి మీద జాలివేసింది. అందుకే ఆమె ప్రభను దగ్గరకు తీసికొని తన ప్రక్కనే కూర్చోబెట్టుకుంది.తరువాత తలనిమురుతూ-

"అంత కష్టమేమొచ్చిందే తల్లీ, హాయిగా చిలకా గోరింకల్లా కాలం గడపాల్సిన ఈ వయసులో ఈ వేదాంతం ఏవిటే పిల్లా, మా కాలంలో పెళ్ళయి పిల్లలు పుట్టినా ఎంత పైలాపచ్చీసుగా వుండేవాళ్ళం. ఎంత యిది ఎంత అది...."

"మామ్మా నేనూ నీలాగే కలలు కన్నాను .కానీ...."

"ఆపావేం.... చెప్పు. సంసారంలో కలత, కంటిలో నలుసు వెంటనే తీసెయ్యాలి, లేకపోతే బాధ." అన్నది మంగాయమ్మగారు.

దాంతో ప్రభ చుట్టూ చూసింది. అక్కడో ఆడ నౌకరుతప్ప మరెవ్వరూ లేరు ఆమె కూడా ప్రభ చూపుల్లో అర్థం గ్రహించి అక్కడనుంచి వెళ్ళిపోయింది.

"మామ్మా"

"చెప్పు తల్లీ, నాదగ్గర ఎందుకు దాస్తావు. నీ తల్లి

తరువాత తల్లిలాంటి దాన్ని. చెప్పుతల్లీ" అంటూ ప్రిభను బతిమాలింది.

"మామ్మా మనిషిలో మహిమలుంటాయని నమ్ము తావా?"

"బాగుంది తల్లీ! దీనికోసమా సతమతమవుతున్నావు. మానవుడికి పూర్వజన్మ సుకృతంవల్ల కొన్ని అద్భుతశక్తులు వస్తాయి. అలాంటివారే మన మహాపురుషులంతా. అంతెందుకు ప్రిస్తుతం మనమధ్యనే తిరుగుతూ అనేక ఘనకార్యాలు చూపించే మహాత్ములు ఎంతమంది మన మధ్య వున్నారో చూడు."

"అదికాదు మామ్మా. అది వేరేవాళ్ళకయితే నేనంత కంగారుపడేదాన్ని కాదు. మావారికి అలాంటివున్న వని నాకూ అనుమానంగా వుంది."

ప్రిభ చెప్పిన మాటలు వింటున్న మంగాయమ్మగారి ఆలోచనలు ఎక్కువయిపోయాయి.

"ఔను ప్రిభా. నేనూ మీ ఆయన విషయంలో అదే అనుమానపడ్డాను. అలాంటిది నువ్వేం చూశావా?"

ఆమె అవున్నట్లు తల వూపింది. టూర్‌లో తాను చూసినవన్నీ మంగాయమ్మగార్కి విపులంగా చెప్పింది ప్రభ.

"మామ్మా నేను యిలాంటి వాళ్ళతో కాపురం చెయ్యడం...."

"పిచ్చి పిల్లా, అలాగని, ప్రితిభావంతుడు గొప్పవాడ

యిన భర్తతో కాపురం చెయ్యడానికి భార్య గర్వపడాలి గాని, సంసారాలు చెడగొట్టుకొంటే ఎలాచెప్పు."

"అదంతా నాకు తెలియదు. నేను నాలాంటి మనిషినే ప్రేమిస్తాను. మనసిస్తాను, అంతే కాని.... కాని..."

"ప్రిభా....అబ్బా ఏవిటా కంగారు. మన హిందూ సాంప్రిదాయం ప్రికారం భర్త ఎలాంటి వాడయినా జీవితం అంతా అతనితో గడపాల్సిందే. ఇది యుగ యుగాల నుంచి జరుగుతూ వుంది."

"మామ్మా"

అవునమ్మా, ఇది మన సంఘం. దీన్ని ఎదిరించి ఎవరూ బ్రితకలేరు. మనం ఒకవేళ ఈ సంఘాన్ని ఎదిరించినా లాభంలేదు. దాని యినుప పాదాలక్రింద పడి మనం నలిగి పోవలసిందే. ఏదయినా ఉపాయంగా వ్యవహరిస్తే మంచిది" అన్నది మంగాయమ్మగారు.

'నన్నేం చెయ్యమంటావు మామ్మా?'

'చెయ్యడానికేముంది. దిలీప్‌ను ఏ డాక్టరుకో, భూత వైద్యుడుకో చూపించాలి. అదీ కాకపోతే పుణ్యక్షేత్రాలు నాలుగూ తిప్పితే సరి, ఎటువంటిదయినా తగ్గిపోతుంది" అన్నది మంగాయమ్మగారు.

ప్రభ, మంగాయమ్మగారు బాగా ఆలోచించి పధకం వేశారు. దిలీప్‌కు తెలియకుండానే వాళ్ళు అతన్ని డాక్టరుకు,

భూత వైద్యుడికి చూపించారు. అతనిలో ఏవిధమైన లోపం లేదని తెలిసి వారా ప్రయత్నం విరమించారు. ఇంక వాళ్ళకు మిగిలిందల్లా పుణ్యక్షేత్రాలు దర్శించటం ఒక్కటే మిగిలింది.

ఆ రోజు డైనింగ్ టేబుల్ దగ్గర పుణ్యక్షేత్రాల విషయం ఎత్తింది ప్రభ. విషయం అలా అలా సాగి, తీర్థయాత్రలు చేయాలన్న నిర్ణయం వెల్లడించింది ప్రభ.

"నువ్వూ పెద్దమ్మా వెళ్ళిరండి. నేను ఇంటిపట్టునే వుంటాను" అన్నాడు దిలీప్.

"అదేమిటి బాబూ, యాత్రలు దంపతులు చేస్తే పుణ్యముంటుంది. అంతేకాదు పీడా పిశాచాలు విరగడైపోతాయి. సంతానం కలుగుతుంది. అనుకున్నవన్నీ కలిసొస్తాయి. అందుకే మీరిద్దరూ వెళ్ళిరండి బాబూ."

మంగాయమ్మగారు లౌకికం ఉపయోగించి, దిలీపును యాత్రలకు వెళ్ళడానికి అంగీకరింపచేశారు.

ఆనాడే వాళ్ళ ప్రయాణానికి అన్ని ఏర్పాట్లూ మొదలెట్టారు. నిర్ణయించిన ప్రకారం వారు పుణ్యక్షేత్రాల దర్శనార్థం బయలుదేరారు.

* * *

మొదటిసారిగా ప్రభ, దిలీపులు ఆంధ్రుల అభిమాన క్షేత్రమయిన తిరుపతి చేరారు. ఏడుకొండల మీద వున్న స్వామి దర్శనార్థం లక్షలాది ప్రజలు ప్రయాణమవుతున్నారు. ఉన్నవాళ్లు సొంత కార్లలోనూ, లేనివారు కాలినడ

కన కొండ పైకి వెళుతున్నారు. మధ్యతరగతివాళ్ళు అటు సొంత కార్లకూ నోచుకోక ఇటు కొండనడిచి ఎక్కలేక సత మతమౌతున్నారు.

కొండలెక్కిన ప్రతివాళ్ళూ పడ్డశ్రమంతా మర్చి పోయి స్వర్గాన్ని చేరినంత సంబరపడుతున్నారు. కలియుగ దైవమైన ఆ వెంకటేశ్వరుడు తన కై వచ్చిన భక్తులను వెయ్యి కళ్ళతో కాపాడుతున్నాడు.

కాటేజీ బుక్ చేసుకున్న దిలీప్, ప్రభలు స్నానం ముగించుకొని గుడికి వెళ్ళడానికి తయారయ్యారు.

"ఏవండీ"

"ఆఁ ఏవిటి?" అడిగాడు దిలీప్.

"నాకు ఎలాగో వుండండి."

"ప్రభా, నే చెప్పలా, ఇంటిదగ్గరుంటే బెడ్ కాఫీ తరు వాత టిఫిను, మళ్ళీ కాఫీ ఇలా వరసవారీగా తింటూ నౌకర్ల చేత పనిచేయించుకునే నీకు, యిప్పటివరకూ పాపం కాఫీ పడ లేదామె. అందుకే కాఫీ అన్నా తాగుదామంటే, దైవద ర్శనం కావాలంటుంటివి. ఉండు కాఫీ తెస్తా" దిలీప్ బయ లుదేరబోయాడు.

"ఆగండి, ఎలానూ యింతసేపున్నాము. ఇంకాకొంచెం సేపుంటే దైవదర్శనం అవుతుంది" అంటూ ప్రభగుడికి బయ లుదేరింది.

కాఫీ ఆమె నీరసంగా నడుస్తుండటం, దిలీప్ గమ

నించాడు. ఆమె వెంటనే నడుస్తూ జాగ్రత్తగా చూస్తు న్నాడు. ఆమె కొంతదూరం నడిచి అలానే నిలబడిపోయింది.

"ఆగావేం?"

'కళ్ళు బాగా తిరుగుతున్నాయి. పట్టుకోండి" అన్నదామె.

దిలీప్ ఆమెను గట్టిగా పట్టుకొన్నాడు. అటుగా వెళు తున్న కొందరు ఆ దంపతులను చూశారు. విషయం తెలుసు కున్నారు.

"ఇదుగోండి ఈ పక్క వీధిలో భార్యాభర్తల డాక్ట ర్లున్నారు. తీసికెళ్ళండి" అంటూ సలహా ఇచ్చారు.

అతికష్టంమీద దిలీపు ఆమెను అక్కడికి చేర్చాడు. లేడీ డాక్టరు ప్రభను పరీక్ష చేసింది. డాక్టరు ఏం చెబుతుందో నని దిలీపు కూడా కంగారుగా వున్నాడు.

"చూడండి మిస్టర్! మీరు కంగారు పడాల్సిన పనేం లేదు. మీరు తండ్రి కాబోతున్నారు" అంటూ నవ్వింది డాక్టర్.

ఆమె మాటలు విన్న దిలీపు ముందు ఆశ్చర్య పడ్డాడు. తరువాత అతనిముఖం సంతోషంతో వెలిగిపోయింది.

"థాంక్యూ డాక్టర్" అనిమాత్రం అనగలిగాడు. తరువాత అతని చూపులు డాక్టరు పక్కనే నిలబడివున్న ప్రభమీద పడ్డాయి. వారిద్దరికళ్ళు ఓ క్షణకాలం కలిశాయి. ప్రభమాత్రం సిగ్గుతో తలవంచుకొంది.

లేడీ డాక్టరు మందులేవో వ్రాసిన చీటీ ప్రభ చేతికిస్తూ.

"చూడమ్మా, నువ్వు కొంచెం నీరసంగా వున్నావు. ఈ మందులువేసుకో. అంతేకాదు తరచు పరీక్షలు చేయించుకుంటూవుండు" అని సలహా చెప్పింది.

దిలీపు డాక్టరు ఫీజు చెల్లించి ప్రభను వెంటపెట్టుకొని దైవదర్శనానికి బయలుదేరాడు. టిక్కెట్టుదర్శనం, స్పెషల్ దర్శనం దగ్గర జనం క్యూలో నిలబడివున్నారు. ధర్మదర్శనం కన్నా టిక్కెట్టుదర్శనానికే జనం విస్తారంగా వున్నారు. ఆ క్యూ చూసిన దిలీపుకు, ఆరోజు దర్శనం అవడం దుర్లభమని తోచింది.

"ప్రభా, మనం వెళ్ళి భోంచేసి వద్దాము. ఎందుకంటే దర్శనంఈరోజవుతుందన్న నమ్మకంలేదు అన్నాడు.

"ఏమండీ ఇంతదూరం వచ్చాం దర్శనం చేసుకుంటే మంచిదండీ. రోజూ తినే తిండేగా" అన్నది ప్రభ.

ఇంక చేసేదిలేక ప్రభతోబాటు అతడూ క్యూలో నిలబడినాడు. జనమంతా "గోవిందా గోవిందా" అంటూ భక్తి పారవశ్యంలో అరుస్తున్నారు. గంటలు గడుస్తున్నాయి. నత్త నడకగా ఆరంభమయిన క్యూ నడక నిమిషనిమిషానికి ఆగిపోతోంది. అప్పటికే దిలీపు ప్రభలు క్యూలోచేరి నాలుగు గంటలయింది. వాళ్ళు కనీసం యాభయి మీటర్లయినా ముందుకు పోలేకపోయారు. జనమంతా ఆలశ్యాన్ని భరించ

లేకపోతున్నారు. చంటిపిల్లలు ఊపిరి సలపక ఏడుస్తున్నారు. కొంచెం పెద్దపిల్లలు, చిరుతిళ్ళకు, మంచినీళ్ళకు తలిదండ్రులను ఏడిపించి దెబ్బలు తింటున్నారు. ధర్మం అంటూ బిచ్చగాళ్లు ప్రాణాలు తీస్తుంటే దొడ్డిదారి దర్శనం చేయిస్తామంటూ బ్రోకర్లు బేరాలు మొదలుపెట్టారు. విసుగుపుట్టి జనం ముందుకు పోలేకపోతున్నారు. వెనక్కి వెళ్ళడానికి ప్రయత్నిస్తే కొత్తగా వచ్చే భక్తులు చీమలదండులా వచ్చి పడుతున్నారు. దిక్కు తోచని జనానికి దేవుడి పేరుతప్ప మరోదారి కనిపించలేదు. అందుకే వారంతా "ఏడుకొండలవాడా వెంకటరమణా గోవిందా, వడ్డికాసులవాడా గోవిందా. ఆపదమొక్కులవాడా గోవిందా, గోవిందా" అంటూ కేకలేస్తున్నారు.

"ప్రిభా, నేను చెబితే విన్నావుకాదు. ఇప్పుడుచూడు మనం ముందుకూ వెళ్ళలేం వెనక్కి అంతకన్నా వెళ్ళలేం. ఇక్కడ నీరు, గాలి, ఆహారంకూడా దొరకవు, అబ్బా ఎందుకొచ్చిన శ్రమ" అన్నాడు దిలీపు విసుగ్గా.

"తప్పండి అలా అనకండి. యిన్ని లక్షలమంది పిల్లాజల్లాతో ఇలా నిలబడి ఎందుకున్నారంటారు? కేవలం ఆ శ్రీనివాసమూర్తి దర్శనానికే" రెండుచేతులెత్తి నమస్కరిస్తూ అన్నది ప్రిభ.

"అబ్బ నాకింక విసుగు పుట్టబోతోంది. ఇలాగే ఇంకా కొంతసేపుంటే పిచ్చెత్తిపోయేలాగుంది" అన్నాడు విసుగ్గా.

ప్రభ అతనిమాట అంతగా పట్టించుకోలేదు. మరో గంట గడిచింది.

"ప్రభా నేనింక ఇక్కడ నిలబడలేను. పద ముందుకు పోదాం" అన్నాడు దిలీపు.

"అమ్మో క్యూలో యింత జనం వున్నారు. మనం ముందు కెళితే వాళ్ళు గోలపెడతారు. అంతేకాదు దేవస్థానం నౌకర్లు కూడా మనల్ని అడ్డుపెడతారు" అంది ప్రభ.

"ఫరవాలేదు నేనింక వుండలేను. పద నాతోపాటు రా" అంటూ ప్రభ చెయ్యి పట్టుకున్నాడు. ఆమెకు కరంటు షాక్ కొట్టినట్లుగా అయింది. ఆమేదో చెప్పబోయింది. కానీ ఆమెకు మాట పెగిలిరాలేదు క్యూలో జనాన్ని తప్పుకొని వారు ముందుకు నడిచివెళుతున్నారు. క్యూలో నిలబడ్డ ఏ ఒక్కరూ వారికి అడ్డుపెట్టలేదు. కనీసం వారు ప్రభను, దిలీపును గమనించినట్లే లేదు.

"ప్రభ....ఊం త్వరగా నడు, త్వరగా దర్శనం చేసుకుని వెళదాం" అంటూ ప్రభను తొందరచేశాడు.

వారిద్దరూ ఓ అరగంట కాలంలో ఆలయంలో ప్రవేశించారు దూరంనుంచే మూలవిరాట్టు విగ్రహం కనిపిస్తూ వుంది. శ్రీనివాసుడి రూపం ప్రస్ఫుటంగా కళ్ళబడంగానే భక్తులు "గోవిందా, గోవిందా అంటూ అరుస్తున్నారు, ఆలయమంతా ప్రతిధ్వనించిపోతూ వుంది. ఎవరూ అడ్డు చెప్పకుండానే వారు మొదటిగేటు దాటారు. ఇంకా పదడుగులు

వేస్తే స్వామివారి నిండువిగ్రహంముందు వారు నిలబడతారు. అర్చకస్వాములు అప్పటికే వరుసలో వచ్చేవారికి తీర్థం శఠారి యిచ్చి జనాన్ని ముందుకు కదిలిపొమ్మని హెచ్చరిక చేస్తున్నారు.

ప్రభ చెయ్యి పట్టుకున్న దిలీపు ఆమెను గట్టిగా లాగుతూ..

"రా. త్వరగా" అంటున్నాడు.

"ఏయ్ బుద్ధిలేదు. క్యూలో రావయ్యా" అంటూ చీదరించుకుంటున్నాడు దేవస్థానం జమాను.

అంతవరకూ వారిని గమనించకుండా నిలబడివున్న జనం ఒక్కసారిగా శాపనార్థాలు ఆరంభించారు. ఇక గత్యంతరము లేక వారిద్దరూ అక్కడే నిలబడిపోయారు. దేవస్థానము జమాను వాళ్ళను నాలుగు తిట్టి క్యూలో నిలబెట్టాడు. చూస్తూవుండగానే క్యూ ముందుకు కదిలింది. వరుసలో ప్రభతో బాటు దిలీపుకూడా తీర్థము, శఠారి తీసుకొని దేవాలయములోనుంచి బైటపడ్డారు.

తరువాత వాళ్ళు భోజనం ముగించుకొని కాటేజ్ చేరారు. అంతవరకూ ప్రభ వొక్కమాటకూడా మాట్లాడలేదు.

"ప్రభా చివరకు నీ పంతమే నెగ్గింది. అబ్బ ఎంత విసుగు పుట్టిందో చెప్పలేం. అందుకే ధయిర్యం చేసి క్యూను తోసుకుని ముందుకు నడిచాను. మనం అలా చెయ్య

కపోతే ఈ రాత్రికికూడా అక్కడే వుండేవాళ్ళం" అన్నాడు దిలీపు.

"అవును ఆ విషయమే మిమ్మల్ని అడగాలని అనుకుంటున్నా, చీమ దోమను కూడా ముందుకు పోనియ్యని జనం మనము ముందుకు వెళుతూవుంటే నోరే తెరవలేదు. పైగా ముందుకెళుతున్న మనల్ని చూడనట్లే ప్రవర్తించారు. కారణము ఏమయివుంటుందంటారు?"

"నేను భారమంతా దేవుడిమీద వేసి ముందుకు నడిచాను. నా దృష్టిలో యిదంతా భగవంతుడి మహిమ అంటాను" అన్నాడు దిలీప్.

"మరి మనము స్వామి దర్శనము చేసుకోడానికి దగ్గరగా వెళ్ళినప్పుడు అక్కడున్న జనం, దేవస్థానం జవాను మనల్ని బలవంతంగా క్యూలో నిలబెట్టారుకదా. అప్పుడే మయింది? అయిదునిమిషాలముందు వున్న భగవంతుని దయ యింతలోనే మారిపోతుందా?"

"ప్రభూ, అనుమానాలెక్కువవున్న మనిషికి సుఖం తక్కువ. ముందుగా క్యూలో వున్న జనం మనల్ని చూసి వుండరు. గర్భాలయం దగ్గరయినప్పుడు చూసివుంటారు. అందుకే క్యూలోకి నెట్టారు అంతే" తేలిగ్గాఅనేశాడు దిలీప్.

"మీరన్నట్లు దేవుడు దయేవుంటే, వెంకవెక్కడో క్యూలో వున్న మనల్ని గర్భగుడిదాకా తెచ్చి అక్కడ

వదిలేశాడంటే ఎలా నమ్ముతాం చెప్పండి?'' ఆమె అనుమానంగా దిలీప్‌ను చూస్తూ అన్నది.

"కాకుంది అంతకాకా మనకు ముందుకు పోయె అర్హత వుండేను మనకు ముందున్న వాళ్ళు మనకన్నా పుణ్యాత్ములేమో'' దిలీపు చేతులెత్తి నమస్కరిస్తూ అన్నాడు.

ఇంక ఆ విషయం గురించి వారు తర్కించలేదు. పెట్టె సర్దుకొని తిరుగు ప్రయాణానికి సిద్ధమయ్యారు.

వారు అక్కడనుంచి శ్రీరంగం చేరారు. పవిత్ర కావేరీ నది రెండు పాయలమధ్య ఎంతో అందంగా వుందా ప్రదేశం. నిత్యకళ్యాణ తో ఎంతో శోభాయమానంగా వుందా శ్రీరంగనాథుని దేవాలయం.

"ఏమండీ! ఈ పుణ్యక్షేత్రంలోనే కదా పరమ భాగవతోత్తముడు విప్రనారాయణుడు తన జీవితం గడిపాడు'' అన్నది ప్రభ.

"ఔను అంత పుణ్యపురుషుని చెడగొట్టటానికి దేవదేవికూడా ఇక్కడే పుట్టింది. నాకు శ్రీరంగనాథుని వైభవంకన్నా ఆ విప్రనారాయణుడు పడ్డ బాధలు జ్ఞాపకం వస్తున్నాయి పాపం పురుషజాతిని మీ స్త్రీజాతి ఎప్పుడూ తిప్పలు పెడుతూనే వుంది'' అన్నాడు దిలీపు.

"ఔనండి, మీ మగవారు చాలామంచివారు. చాలా పెద్ద ఔదార్యవంతులు. పురాణకాలంనుంచి ఆడదాన్ని ఆటబొమ్మగానూ, బానిసగానూ వాడుకున్నారు. ఒక

భర్త తన భార్యను అప్పుకింద నడిబజార్లో అమ్మాడు. మరొకడు భార్యను పందెంలో పణంగా పెట్టాడు. మరో మహానుభావుడు శత్రువులతో యుద్ధం చెయ్యలేక భార్యను కానుకగా సమర్పించుకున్నాడు. ఇలా చెప్పదలిస్తే చాలా వున్నాయి. మనకు వాదనెందుకుగాని పదండి. త్వరగా దర్శనం చేసుకుందాం" అంటూ ముందుకు దారితీసింది ప్రభ.

పూజా ద్రవ్యాలు తీసుకొని ఆ భార్యాభర్తలు క్యూలో నిలబడ్డారు. జనం పెద్దగా లేరు, అయినప్పటికి తోక్కిస లాట ఎక్కువగా వుంది.

"ప్రభా అటు చూడు. ఆ ఆడమనిషి ముందున్న మగ వాళ్ళను ఎలా నెటుతూవుందో! చూడు చూడు నెట్టింది అంతతో ఆగిందా? వాళ్ళమీద ఎలాపోట్లాడుతుందో చూడు. పాపం ఆడవాళ్ళం ఎరగనంటావు నువ్వుకూడా" అన్నాడు దిలీపు.

"అబ్బో చెప్పొచ్చారు మహా. అదుగోండి అటు చూడండి పాపం! ఆ అమ్మాయిని అటుఇటువున్న మగ వాళ్ళు ఎలా నొక్కేస్తున్నారో!" అన్నది ప్రభ.

దిలీపు అటుగా చూస్తుంటే అతన్ని పట్టుకుని గట్టిగా కుదుపుతూ.

"ఏమండీ, అదుగో చూడండి. పాపం ఆ గర్భిణీస్త్రీని ఎలా నొక్కేస్తున్నారో. అయ్యో! అయ్యో! ఆమె చంక

లో వున్న పసిపిల్లను కూడా ఎలా నొక్కేస్తున్నారో చూడండి. దయా దాక్షిణ్యం కూడా లేకుండా, ఆ పసిపాపపడు పురుగు వారికి జాలన్నా వుందేమో చూశారా" అన్నదిప్రభ.

అలాగే అనేక సంఘటనలు చూపిస్తున్న ప్రభమీద అతనికి కోపం వచ్చింది.

"అబ్బా! ఈ ఆడవాళ్ళతోనే మానవజాతి పతనావస్థకు దిగజారిపోతూవుంది. అన్నిటిలోనూ సమానహక్కులు కావాలి. కానీ ప్రతిదానికీ ప్రత్యేక సదుపాయంకావాలి. స్పెషల్ బస్సులు, స్పెషల్ సీట్లు, స్పెషల్ అధికారాలు కావాలి. ఇన్ని సదుపాయాలున్నా ఏమీ లేవని అంటూనే వుంటారు" అన్నాడు దిలీపు కోపంగా.

"ఆ మాటలకేమొచ్చింది లెండి. దేవుడు వర మిచ్చినా పూజారి వరమివ్వడు. అలాగే పార్లమెంటులో పెద్ద కబుర్లు చెపుతారు. కానీ ప్రతి ఇంట్లోనూ ప్రతిమగవాడు తన భార్యను దాసీదానికన్నా హీనంగా చూస్తారు" అన్నది.

ఇంతలో క్యూ ముందుకు కదిలిపోవడంతో వాళ్ళు దేవాలయం ప్రవేశించి, దైవదర్శనం చేసుకొని బయట పడ్డారు.



ప్రభ, దిలీపు రామేశ్వరం, వివేకానందరాక్, మధుర తంజావూరు, క్షేత్రాలు చూశారు. వారు ఎక్కడికెళ్ళినా జీవానంద యోగిని గురించి ఆయన మహిమలను గురించి వింటున్నారు. ఆయన ఆశ్రమం తమిళనాడుకు కర్నాటకకు

సరిహద్దుమీద అడవిలో వుందట. అక్కడికి చేరాలంటే బస్సులో ప్రయాణం చేసినతరువాత పది కిలో మీటర్లు బండిమీద వెళితేగాని చేరరట.

స్వామివారికి భక్తులరాక, ముందే తెలుస్తుందట. అందుకే ఎంతమంది వచ్చేదీ ముందుగా తను ఆశ్రమ వాసులకు చెప్పి వచ్చేవారికి భోజన సదుపాయాలు, టిఫినుకాఫీలు తయారు చేయిస్తారట.అంతటి మహారణ్యంలో మరోమనిషి సహాయం లేకుండా ఆయనగారు బియ్యం పప్పులు, సంబారాలు ఎలా తెప్పిస్తున్నారో ఎవ్వరికీ అర్థం కావటంలేదు.

స్వామివారు వచ్చిన భక్తులలో తనకునచ్చిన వాళ్ళను దగ్గరకు పిలిచి వాళ్ళపేరు, ఊరు, వివరాలు అన్నీ ఆయన చెపుతారట. తరువాత వారికి రాబోయే మంచి చెడుగులను చెప్పి ముక్తిమార్గం చూపిస్తారట. ఆయన బాగుచెయ్యని వ్యాధి లేదు. విడిపించని దయ్యంగాని, భూతంగాని లేదు. ఆయన మట్టిని బంగారం చేస్తారట. గాలిలోనుంచి కావలసిన వస్తువులు తెప్పించి భక్తుల కిస్తారట.

ఇలా జీవానందయోగిగారిని గురించి ప్రజలు ఎంతో గొప్పగా చెప్పుకుంటున్నారు. స్వామివారు దైవాంశ సంభూతుడని కాదు దైవ స్వరూపమని, భక్తులు వాదించుకుంటున్నారు, ఆయనన్నగురించిపాటలు, బుర్రకథలు ప్రచారంలో కొచ్చాయి. కొన్ని పత్రికలు ఆయనన్ని గురించి ఘనంగా వ్రాశారు.

"పదండి! మనంకూడా స్వామివారిని చూద్దామా?" అన్నది ప్రభ.

"అబ్బ దేవాలయాలు చూసిచూసి ఇప్పటికే బోర్ కొట్టింది. ఇంక ఈ స్వాములు, వారి గమ్మత్తులు చూస్తూ వుంటే మనకు మతులుకూడా పోతాయి" అన్నాడు దిలీపు.

"అపచారం, అలాఅనకూడదండీ బాబూ. ఏపుట్టలో ఏ పాముందో చెప్పలేం. మహాభక్తుల్ని మొదట అందరూ అలాగే ననుకుంటారు"

దిలీప్‌కు ఇంక గత్యంతరం లేకపోయింది. అందుకే అతడు ప్రభతో రాజీ పరిష్కారంగా,

"అమ్మాయి, నువ్వు చెప్పినట్లే స్వామివారిని చూద్దాం. తరువాత మాత్రం ఇంటికి పోదాం. ఇంక ఇలా దేశాలు తిరగడం నావల్ల కాదు"

అంటూ కండిషన్ పెట్టాడు దిలీప్ ఇంక గత్యంతరం లేక. ప్రభకూడా సరే నన్నది, కాని దిలిప్‌లో వున్న అసలు విషయం గురించి స్వామివారేదన్నా చెపుతారేమోనని ఆమెకు కొంతఆశ కూడా వుంది, అవసరమయితే స్వామి వారిని అడిగి తన భర్తకు, తాయెజో, విభూదో తీసుకోవా లని ఆమె నిర్ణయించుకుంది.

చాలా ప్రయాస పడ్డ తరువాత వారు శ్రీ జీవానంద స్వామివారి ఆశ్రమం చేరారు. వారు ఆశ్రమం చేరగానే, వారిని గురించిన వివరాలన్నీ అడిగి, స్నానాదులకు, వసతికి

ఏర్పాట్లు చూపించారు స్వామివారి శిష్యకోటి. ఆశ్రమం అంతా జనంతో కిటకిటలాడుతూవుంది. భక్తికన్నా భుక్తి కోసం అక్కడ చాలామంది చేరారు. నిత్య భజనలు, సంకీర్తనలతో ఆశ్రమమంతా చాలా సందడిగావుంది.

"ప్రభ

"ఊఁ"

"ఇది ఆశ్రమమా లేకపోతే, అన్నదాన సమాజమా?" అన్నాడు దిలీప్.

"అబ్బ, ఎవరన్నా వింటారండీ. అసలే స్వామివారు మనిషిని చూడగానే అన్నీ తెలుసుకుంటారట. మనకెందు కొచ్చిన గొడవ చెప్పండి"

"బాగుంది. నీకూ ఈ భక్తిపిచ్చి ముదిరిందన్న మాట"

"ఇదుగో చూడండి, మీకు పుణ్యముంటుంది. స్వామివారు పదిగంటలకు దర్శనమిస్తారట. దర్శనం కాగానే వెళ్ళిపోదాం. తెలిసి తెలియక ఏదన్నా అంటే మంచికన్నా చెడే జరుగుతుంది." అంటూ భర్తను కొంచెం అదుపులో పెట్టడానికి ప్రయత్నం చేసింది ప్రభ.

భక్తులంతా వో పందిరిలో కూర్చున్నారు. ఎత్తుగా వున్న ఆసనం మీద స్వామివారు వచ్చి కూర్చున్నారు.

"జై శ్రీ, శ్రీ జీవానందయోగి మహాశయులకు జై" అంటూ నినాదాలు చేశారు భక్తులు.

స్వామివారు తన అభయహస్తం చూపించుతూ భక్తులను ప్రశాంతంగా వుండమని హెచ్చరిక చేశారు. ఆ ప్రదేశమంతా నిశ్శబ్దం ఆవరించింది. స్వామివారికి అరవై దాటి వుంటాయి. కాని ఆయన చాలా ఆరోగ్యంగా కని పిస్తున్నారు, విశాలమైన నుదురు, పెద్ద పెద్దకనుబొమలు. వాటికి తగ్గకళ్ళు, తెలుపునలుపు కలిసిన గడ్డం, మీసాలు. అందంగా సిగచుట్టబడిన తలకట్టు కాషాయవస్త్రాలు, రుద్రాక్షమాలలు విభూతిరేఖలతో ఆయన పరమశివుడులా వెలిగిపోతున్నాడు.

ఆరోజే ఆశ్రమానికి వచ్చిన ఇద్దరుభక్తులను స్వామి వారు పేరు పెట్టి పిలిచారు. అలా స్వామివారుతమ పేర్లను పిలవగానే ఆ భక్తులు ఆశ్చర్య పడిపోయారు. తరువాత స్వామివారు భక్తులు ఏవూరి వారో ఏపని మీద వచ్చారో కూడా విపులంగా చెప్పారు. ఆయన దాంతో ఆగలేదు.

"దిలీప్, ప్రభా... నా బిడ్డల్లారా మీరనుకున్న వన్నీ జరుగుతాయి....హ్రాం... క్లీం... క్లీం... ఓం శివ కేశవా" గట్టిగా అన్నాడు జీవానందయోగి.

"స్వామీ? మీ అనుగ్రహం వల్ల పిల్లలులేని నాకు సంతానం కలిగింది. అందులోనూ పండంటి మగబిడ్డ. బిడ్డల కోసం ఇరవై సంవత్సరాలుగా అనేక మందులు తిన్నాం. అనేక క్షేత్రాలు సందర్శించాం. అనేక మహానుభావులను చూశాం. స్వామి! మాకెక్కడా ఫలించనికోరిక తీర్చారు.

మీరు నిజంగా అవతారపురుషులు" అంటూ మధ్యవయసు దాటిన దంపతులిద్దరు స్వామివారి పాదాలముందు పసిబిడ్డను పండుకోబెట్టి. ఆయనకాళ్ళమీద పడి నమస్కరించారు. ఆయన ఆప్యాయతగా వారినిలేవనెత్తారు, గాలిలోకి చెయ్యి ఎత్తారు.

"జై శాంభవీ" అన్నారు. గాలిలోకి ఎత్తినచెయ్యి దించారు. అందులో వో తావీజువుంది.

"బిడ్డలారా. ఈ బాబుకు ఈ తాకీజు కట్టండి. వాడు గొప్పవాళ్ళల్లో గొప్పవాడవుతాడు" అంటూ తావీజు వాళ్ళ చేతికిచ్చాడు.

ఇంతలో వో యువకుడు స్వామివారి దగ్గరకు వచ్చి నమస్కరించి నిలబడ్డాడు. స్వామివారు అతన్ని తేరిపార చూశారు. అతన్ని దగ్గరకు రమ్మనమని సైగచేశారు. అతడు దగ్గరకు వెళ్ళాడు. స్వామివారు అతనిచెయ్యి గట్టిగా పట్టుకున్నారు.

"అబ్బాయి గోపీ నేనుచెప్పినట్టు చేశావా?"

"చేశానుస్వామీ. నొడ్డంతా తవ్వాను నాకు నిధి ఎక్కడా కనించలేదు. మీరుచెప్పింది అబద్ధం" ఆ యువకుడు స్వామివారిచేతి నుంచి తనచేతిని బలవంతాన లాక్కున్నాడు.

"బిడ్డా నన్నే శంకిస్తున్నావా. ఇదుగో ఇక్కడున్న

వారిలో పదిమంది తనవెంటతీసుకెళ్ళి మీా పెరట్లోవున్న బాదంచెట్టుకు ఉత్తరంగా నాలుగు మీాటర్ల దూరంలో తవ్వ. అబద్ధమో నిజమో నీకే తెలుస్తుంది అన్నారు.

యువకుడు అక్కడ కూర్చున్న పదిమందిని వెదికి వెంట తీసికెళ్ళాడు.

"అబ్బా ఎంతగొప్పవారండి ఈ స్వామి! పిల్లలులేని వాళ్ళకు పిల్లలు, డబ్బులేని వాళ్ళకు నిధులు, ఇస్తున్నాడు నిజంగాగొప్ప" అన్నది ప్రభ.

"ఆ, ఇదంతా నాటకం, ఆ మనుషులంతా ఆయన తాలూకువాళ్ళే. ఇలాగే కోజుకొకటి కల్పించి, మాయ నాటకాలాడి జనాన్ని మోసం చేస్తాడు" అన్నాడు దిలీప్.

"అపచారమండీ, అది ఆయనదాకాపోతుంది, లేని పోయింది ఆయన ఏదన్నా శాపం పెడితే మనం అంతే" అన్నది ప్రభ భయపడుతూ.

"ఆ వాళ్ళముఖం.వీళ్ళుగారడి వాళ్ళకన్నా అన్యాయం ఇది డబ్బుసంపాదన కోమార్గం" నిర్లక్ష్యంగా అనేశాడు దిలీప్.

వారలా మాట్లాడుకుంటూ వుండగా. ఖద్దరు పంచె, వదులుగా వున్న లాల్చీ, నెత్తిన గాంధీటోపీతో వొకతను అక్కడికి పరుగెత్తుకుంటూ వచ్చి స్వామివారి కాళ్ళమీాద వాలిపోయాడు. అతనివెంట మరో పాతికమంది పరుగెత్తు

కుంటూ వచ్చి స్వామివారికి సాష్టాంగ నమస్కారం చేశారు.

"స్వామీ రక్షించండి. బుద్ధి గడ్డితిని అందరూ వద్దంటున్నా ఎలక్షన్‌లో నిలబడ్డాను. వో ట్రక్క వోట్లు లెక్కిస్తున్నారు. ఇప్పటికీ నా ప్రత్యర్థి కంటే పదివేలు తక్కువగా వున్నాయి. నన్నెలాగయినా కాపాడాలి. మీరు నాకు అభయమిస్తేగాని మీ కాళ్ళు వదలను." అతడు, స్వామివారి పాదాలు మరింత గట్టిగా పట్టుకున్నాడు.

స్వామివారు ఎలక్షన్‌లో నిలబడ్డ అభాగ్యుని నెత్తిన చెయ్యి పెట్టి,

"శివోహం...గణేశా లెక్కలు తికమక చెయ్యి.... భక్తుడు అల్లాడిపోతున్నాడు" అంటూ ఆకాశంలోకి చూసి పదేపదే అరిచాడు.

"స్వామీ, నాకే వోటు వేస్తానని, నన్ను గెలిపిస్తానని నా దగ్గర డబ్బులు గుంజారు కొందరు. నాకే పనిచేస్తానని, నన్ను గెలిపిస్తానని, డబ్బు తినేశారు మరికొందరు. వాళ్ళలా మీరూ నా నెత్తిన చెయ్యి పెడుతున్నారా స్వామీ" అతడు దీనంగా అడిగాడు.

"పాపం శమించుగాక, మమ్మల్నే శంకిస్తున్నావా! ఛీ వెళ్ళు. నువ్వు ఓడిపోతావు" స్వామివారు చీదరించుకున్నారు.

ఇంతలో ఎవరో అక్కడకు పరిగెత్తుకుంటూ వచ్చి,

"బాబూ నువ్వు పదిహేను వేలవోట్ల తేడాతో వోడి పోయావు" అంటూ కేకలేశాడు.

అక్కడున్న వారంతా ఆ సంఘటనను ఆశ్చర్యంగా విన్నారు.

"నేను చెప్పలేదంటే స్వామివారు నిజంగా గొప్ప వారు. ఆయన్ని ఆశ్రయించి మీ ఉద్యోగం మీ శరీరా రోగ్యం అన్నీ తెలుసుకుందాం" అన్నదిప్రభ.

"ప్రభా ఇలాంటి పచ్చిమోసగాళ్ళు మన దేశంలో వుండబట్టే ఈనాడు దేశం ఇంత అధోగతికి దిగజారింది, ప్రజలను అమాయకులను చేసి వీళ్ళు లక్షలు ఆర్జిస్తున్నారు. ఏ నాటికయినా వీళ్ళమోసాలు ప్రజలు గ్రహించకమానరు. ఆనాడు వీళ్ళకు సంఘంలో మంచినీళ్ళుకూడా పుట్టవు" అన్నాడు కోపంగా.

వారలా మాట్లాడుకుంటూ వుండగానే స్వామివారి దృష్టి వారిద్దరిమీద పడింది.

"జై కాశీ అన్నపూర్ణేశ్వరి, మధుర మీనాక్షి, కంచి కామాక్షి, జై బెజవాడ కనకదుర్గా....నన్నూ అనుమాని స్తున్నారా....ఊ చేతులు పట్టండి...." అంటూ గాలిలో కెత్తిన రెండుచేతులు ఆ దంపతుల చేతుల్లో పెట్టి గుప్పెళ్ళు తెరిచాడు.

దిలీప్, ప్రభను కోపంగా చూశాడు ఇంక అతడే

మన్నా అంటాడేమోనని ఆమె భయపడిపోయింది. అతని చెవికి దగ్గరగా నోరుపెట్టి,

"మాట్లాడకండి. ఇచ్చింది తీసుకోండి. ఏదన్నా శాపం పెట్టాడంటే తరువాత తంటా" అన్నది ప్రభ. ఆమె శరీర మంతా చెమటలతో తడిసిపోయింది.

స్వామివారు చేతులు తీశారు. ప్రభ దోసిట్లో పూలు, పసుపుకుంకుమ వున్నాయి, ఆమె భక్తితో వాటిని కళ్ళకద్దుకుంది. దిలీపు దోసిలి చూసుకున్నాడు. అందులో విభూతి వుంది!

"బిడ్డా ప్రభా నీకు పండంటి కొడుకు పుడతాడు. కానీ ఈ దిలీపుకు మాత్రం ఇంకా పరీక్ష చెయ్యాలి, గంటాగి నా ధ్యానమందిరానికి రండి" అన్నాడు స్వామి.

ప్రభ అంగీకారసూచనగా తల ఆడించి భర్త చెయ్యి పట్టుకొని దూరంగా వెళ్ళి ఆ జనంలో కూర్చుంది.

"ఇదంతా ట్రిక్కులోయ్. వెళదాం పద నేనూ ఇలాంటి గమ్మత్తులు వందలు చూపిస్తా" అన్నాడు దిలీపు,

"అబ్బా అలా అనకండి. ఈయనిచ్చే తావీదు తీసుకొని వెళ్ళిపోదాం అప్పటిదాకా ప్లీజ్ నామాట వినండి" ప్రభ భర్తను బతిమాలింది,

స్వామివారు గాలిలోనుంచి, శివలింగాలు. విభూతి, కుంకుమ. పళ్ళు, పూలు తెప్పించి చాలామందికిఇస్తున్నాడు. అక్కడ చేరిన జనమంతా జయజయ జేజేలు పలుకుతున్నారు.

అప్పటికే గంటకావచ్చింది. స్వామివారు లోపలికి వెళ్ళారు. ఆయన కొంత మందినే పూజామందిరానికి రమ్మన్నమని ఆహ్వానించారు. పూజామందిరం దగ్గర భక్తులు క్యూలో నిలబడివున్నారు స్వామివారి శిష్యులు వో ముగ్గురినే లోపలకు పంపుతున్నారు వంతురాగానే, ప్రభ ఆమె వెంట దిలీప్ స్వామివారి పూజామందిరంలోకి వెళ్ళారు. పులిచర్మం మీద స్వామివారు కూర్చున్నారు. చేతికిందుగా దండం నిలబెట్టివుంది.

"బిడ్డలారా రండి... బైట భక్తులు చాలామంది వున్నారు మీ వ్యవహారం రెండు నిమిషాలలో తేల్చి చెపుతా, బాబు ప్రవర్తనలోనూ, మాటలోను తేడా కన్పించింది కదూ తల్లి నీకు!"

ఆయన అడిగిన ప్రశ్నకు ఔనని తల ఆడించింది ప్రభ.

"అలాగయితే ఈ వేరుముక్కని భర్త చేతికి కట్టు నువ్వు చెప్పినట్లు వింటాడు" అంటూ ఆయనో వేరుముక్కను ప్రభ చేతిలో పెట్టాడు. ఆమె దాన్ని భక్తితో కళ్ళ కద్దుకుంది. వేరుకు కట్టిన పసుపుతాడు దిలీపు చేతికి కట్టబోయింది ప్రభ. స్వామివారు నవ్వుతూ వారిద్దరిని చూస్తున్నారు.

"ప్రభా నీకేమన్నా పిచ్చా ఈ పిచ్చి వేరుముక్కలవల్ల ప్రయోజనేం ఏమీవుండదు, ఇదంతా మాయనాటకం దగా" అరుస్తున్నాడు దిలీపు. కాని ప్రభ అదేది వినిపించు

కోకుండా అతని చేతికి తావీజు కట్టింది. అంతవరకూ కేకలే స్తున్న దిలీపు మంత్రం వేసిన పాములా అయిపోయాడు, అతను రెండు చేతులు జోడించి స్వామివారికి నమస్కరిస్తూ.

"స్వామీ రక్షించండి, నా తప్పులు మన్నించండి అంటూ ఆయన దగ్గరకు నడిచాడు.

అది చూసిన ప్రభ చాలా సంతోషించింది. ఆమె కూడా స్వామీజీకి చేతులెత్తి నమస్కరించింది.

"మూర్ఖుడా, మా శక్తినే శంకిస్తావా, జాగ్రత్త. నేననుకున్నానంటే నిన్ను కుక్కపిల్లగా మారుస్తా. జై శాంభవీ" ఆయన చెయ్యి గాలిలో కెత్తి మళ్ళీ దించాడు. ఆయన చేతిలో కుక్కల్ని కట్టేసే ఇనపగొలుసుంది.

"స్వామీ రక్షించండి, నా భర్తను క్షమించండి. ఆయన్ని కుక్కగా మాత్రం మార్చకండి" ప్రభ పరుగెత్తు కుంటూ వెళ్ళి స్వామివారి కాళ్ళమీద పడింది. ఆయన ఆమెను తీక్షణంగా చూస్తూ-

"ప్రభా! ఈ తప్పుకు శిక్షేమిటో తెలుసా!" తెలియ దన్నట్లు ప్రభ తలాడించింది.

"నీ ఒంటిమీద నగలన్నీ అపరాధం క్రింద నాకు సమర్పించు. లేదా నీ భర్త ఈ క్షణంలోనే కుక్కగామారి పోతాడు" ఆయన తన చేతిక్రింద వున్న దండం ఎత్తి దిలీపు నెత్తిన పెట్టబోయాడు.

"దుర్మార్గుడా ఇంతసేపటినుంచి చూస్తున్నా. నువ్వే

దో గొప్ప మాంత్రికుడివన్నట్టుగా అనుకున్నావు కదూ. అందుకే నేనూ నీకు తగినట్లుగా ప్రవర్తించా. కాగా త్త. నగలు గిగలు అన్నావంటే నీ సంగతంతో సిన్మా చూపెడతా"

అలా అంటూనే దిలీపు అతని చేతిలోవున్న దండం లాక్కున్నాడు. వెంటనే స్వామి తన త్రిశూలంతీసి దిలీపుమీదకి విసిరాడు దిలీప్ ఆ విషయం ముందుగానే పసికట్టి పక్కకు తప్పుకున్నాడు. త్రిశూలం దూరంగా పడి పోయింది. వెంటనే దిలీపు శరీరమంతా కాంతివంతమైంది. అతడు బరువుగా అడుగులు ముందుకు వేస్తూ వెళ్ళిదండంతో స్వామివారిని తాకాడు, స్వామివారి పిగ్గులాంటిజుట్టు ఎగిరి పోయింది. దాంట్లోనుంచి, చిన్న పెద్ద శివలింగాలు, విభూతి కుంకుమ, వగైరాలన్నీ క్రిందపడినాయి దాంతో ఆగలేదు. స్వామివారు ఎలక్ట్రిక్ షాక్ తగిలినవాడిలా అరవడం మొదలెట్టారు, కొంతసేపటికి తెలివితప్పిపడిపోయాడు.

ఆ సంఘటనచూసిన వారికి స్వామివారి మహిమలు వగైరాలు వట్టి బూటకమని తేలిపోయింది. అక్కడున్న భక్తులందరూ తామేదో పెద్ద తప్పుచేసిన వాళ్ళలా తలలు వంచుకున్నారు. స్వామివారి ప్రత్యేక శిష్యబృందం ఆయన గారికి ఉపచారాలు చెయ్య నారంభించారు.

"ఒరే దొంగ సన్నాసి శిష్యుల్లారా? ఇంకా మీ గురువు గొప్పవాడని నిరూపించటానికి ప్రయత్నించకండి. వాడో చవట. మిమ్మల్నందరిని మోసంచేసి లక్షలార్జిస్తున్న వో మాయగాడు. ఊ... చూస్తారేం. మీ గురువు ముఖాన

కొంచెం నీళ్ళు చల్లండి లేచి కూర్చుంటాడు" దిలీపువాళ్ళకు ఆర్డర్లు జారీ జేశాడు.

వెంటనేవారు దిలీపు చెప్పినట్లు చేశారు. కొంత సేపటికి స్వామి కళ్ళు తెరిచాడు. భయంతో వణికిపోతూ దిలీపు కాళ్ళమీద పడ్డాడు.

"తప్పు క్షమించండి. ఇంక ఇలా ప్రజలను మోసం చెయ్యను. వెళ్ళిపోతున్నా, దయ మాత్రం వుంచండి" అంటూ కేక లేస్తూ వెళ్ళిపోయాడు.

అలా వెళ్ళిపోతున్న స్వామివారిని చూసి జనం విరగబడి నవ్వసాగారు. ఇంక దిలీపును అక్కడ వుంచేటట్లయితే స్వామివారి బదులు అతన్నే స్వామివారిగా తయారుచేసే ప్రమాదంవుందని ప్రభ గ్రహించింది. అందుకే జనమంతా స్వామివారి సందడిలో వుండగానే ప్రభ దిలీపును తీసుకొని ఆశ్రమంనుంచి బయటపడింది, ఇంక అక్కడ ఆగకుండా వెంటనే ఇంటికి ప్రయాణం కట్టింది.

మంగాయమ్మగారిల్లు పెళ్ళిల్లులా వుంది. మామిడితోరణాలతోనూ రంగు రంగు ఎలక్ట్రిక్ దీపాలతోనూ ఆ ఇల్లు దేవేంద్ర భవనంలా వుంది. వచ్చేవాళ్ళు వస్తున్నారు,

భోజనాలు, టిఫినులు అడిగిన వాళ్ళకందరికీ అందుబాటులో వున్నాయి, చక్కని బ్యాండ్ మేళం, సినిమాపాటలు వినిపిస్తుంటే మైకులు పగిలిపోయేలా బ్రాహ్మలు మంత్రాలు చదువుతున్నారు.

చక్కగా అలంకరించిన మందిరంలో అతి మనోహరంగా అలంకరించబడిన ప్రభ కూర్చుంది. చుట్టూ ముత్తయిదువులు చేరారు' కొందరు ఆమె సిగలోపూలు సరిచేస్తుంటే మరికొందరు ఆమెకు చీరెసర్దుబాటు చేస్తున్నారు.

ఆహ్వానితులందరికీ ముందుగా సత్కారం చేస్తున్నారు మర్యాదగా లోపలికి తీసికెళ్ళి కూర్చోబెడుతున్నారు. బయటికి వెళ్ళేవారికి చందన తాంబూలాలతో పాటు, స్వీట్లు పెట్టిన ప్యాకెట్లు ఇస్తున్నారు. అంతా సంతోషంగా ఉన్నారు.

"డాక్టర్ సుశీలగారు" అంటూ అక్కడ కూడినజనం అంటున్నారు. ఆమెచాలాహుందాగావుంది. చూసినవారు. ఆమెను గౌరవించకుండా వుండలేక పోతున్నారు. ఆమెకు ఎదురుగా వెళ్ళింది మంగాయమ్మగారు. ఆమె చెల్లెలు రేణుక కూడా డాక్టర్ సుశీలకు ఎదురుగా వెళ్ళి ఆమెరుఆహ్వానించారు.

"డాక్టర్ గారూ! ఈమె మా చెల్లెలు రేణుక. మా ప్రభకు అత్తగారు" అంటూ ఆమెను పరిచయం చేసింది. ఇంతలో దిలీపుకూడా అక్కడికివచ్చి డాక్టర్ సుశీలగారికి నమస్కరించాడు.

"హల్లో మిస్టర్ దిలీపు, మీరు మగపిల్లవాడి తండ్రి అవుతారని ఆశీర్వదిస్తున్నాను" అన్నది డాక్టర్ సుశీల.

"థాంక్యూ డాక్టర్. మగఅయినా, ఆడఅయినా, మాకేం బాధలేదు. కాని ప్రభ ఆరోగ్యం సరిగా వుంటే పది అదే వేలు" అన్నాడు.

"మిష్టర్ దిలీప్! ఆమె ఆరోగ్యం గురించి మీరేమి కంగారు పడకండి అదంతా నేను చూసుకుంటాను" అన్నదామె.

కార్యక్రమం ముగిసింది. అందుకే ప్రభ అక్కడికి వచ్చి డాక్టర్ సుశీలకు నమస్కరించింది. ఆమె వెళ్ళిపోతూ వుంటే స్వీట్లు పొట్లాలు కారు వెనక సీట్లో పెట్టారు. ప్రభ, దిలీప్, మంగాయమ్మగారు రేణుక అందరూ డాక్టరుగారిని సాగనంపటానికి కారు దాకా వచ్చారు. డాక్టర్ సుశీల వారందరికీ టాటా చెప్పి వెళ్ళిపోయింది.

అంతా వెళ్ళిపోయిన తరవాత ఆ కుటుంబసభ్యులంతా డైనింగ్ టేబుల్ దగ్గర కలిశారు.

"అబ్బాయి దిలీప్! పెళ్ళయిన తరవాత ఇల్లే మరిచి పోయావేమిరా, అదీ కాకుండా నువ్వు ఇలా ఉద్యోగం సద్యోగం లేకుండా కూర్చుంటే రేపు పిల్లా జల్లా పుడితే ఎలారా" అన్నది రేణుక.

"నేనూ అదే ఆలోచిస్తున్నానమ్మా" తేలిగ్గా సమాధానం చెప్పాడు దిలీపు.

"అదేమిటమ్మా చెల్లీ ఇది పరాయి ఇల్లా ఏమిటి. నేను దిలీపుకు సయాన పెద్దమ్మను కాదా! ఈ ఆస్తి అంతా ఎవరు తిన. ప్రభ, దిలీపులు పిల్లా జల్లాతో నా కళ్ళముందు తిరుగుతూ వుంటే అదే పదివేలు" రేణుక మాటల్ని తోసి పారేస్తూ అన్నది మంగాయమ్మ.

"అదేమన్న మాటలే మామ్మా. మగవాళ్ళకు ఉద్యోగం ముఖ్యం. అప్పుడే గౌరవం కూడా వుంటుంది" అన్నది ప్రభ.

"ఔను బాబూ! నువ్విలా కూర్చుంటే కొన్నాళ్ళకు సోమరితనం అలవాటయిపోతుంది... తరవాత ఏదన్నా చెయ్యాలన్నా చెయ్యలేవు". రేణుక కొడుక్కి సలహా చెప్పింది.

దిలీపుకు ఏదో ఒక సమాధానం చెప్పవలసివచ్చింది. అతడు కొంతసేపు ఆలోచించాడు.

"నేనొక వారం రోజుల్లో ఢిల్లీ వెళదామని చూస్తున్నాను. మా స్నేహితుడొకతను నన్ను అక్కడికి రమ్మన్నాడు. ఈసారి దేశం వదిలి ఉద్యోగాలకోసం ఇతర దేశాలకు వెళ్ళదలచలేదు" అప్పటికి సమాధానం చెప్పి తప్పించుకున్నాడు.

కాని రోజూ భార్య, తల్లి వాళ్ళ పోరు పడలేకపోయాడు. అందుకే ప్రయాణం కట్టి ఢిల్లీ బయలుదేరి వెళ్ళి పోయాడు. దిలీప్ వెళ్ళిన తరువాత ప్రభను ఉద్యోగం నో

సం పంపినందుకు ఆమె చాలా బాధపడింది. తనన్నతాను అనేకసార్లు తిట్టుకుంది కాని ప్రయోజనం లేక పోయింది. దిలీప్ ఢిల్లీ వెళ్ళి పదిరోజులయినా అతని దగ్గర నుంచి జాబు రాక పోవడంతో మరింత క్రుంగి పోయింది. ఆమె రాత్రిలు ఈ ఆలోచనతో నిద్ర పట్టేది కాదు. అలా మరోపదిహేను రోజులు గడిచాయి. ప్రభ దిగులుగా కూర్చునేది. ఆహారం కూడా తగ్గిపోయింది. దానికి తోడు ఆమె డాక్టరుగిచ్చిన టానిక్కులు వగైరా కూడ వాడటం మానేసింది.

మంగాయమ్మగారు ప్రభలో వచ్చిన మార్పు గ్రహించింది. అందుకే ఆమెను డాక్టరు సుశీలగారి దగ్గరకుతీసికెళ్ళింది.

"అమ్మాయిప్రభా, నేను వ్రాసి ఇచ్చిన టానిక్కు మందులు అవి సరిగా వాడుతున్నావు కదా!" అడిగింది డాక్టరు సుశీల.

ప్రభ నోరు తెరవకుండానే లేదన్నట్లు తల ఊపింది.

"చూశావా, అందువల్లనే నీకు నీరసం వస్తూంది. ఏది అలా టేబుల్ మీద పడుకో పరీక్ష చేస్తా"

డాక్టరుగారు చెప్పిన ప్రకారం ప్రభ పడుకుంది. స్టెతస్కోపుతో ఆమె పరీక్ష చేసింది. తరువాత ఆమె ప్రభ కడుపుమీద చెయ్యి వేసింది. సిగ్గుతో ముడుచుకు పోయింది ప్రభ. డాక్టరు కంగారుగా అక్కడున్న వారందర్ని చూసింది. తరువాత ఆత్రంగా ప్రభ కడుపు పరీక్షించ సా

గింది. ఆమెలో కంగారు ఎక్కువయింది. నర్సుని పిలిచింది. ఏవో పరికరాలు తెచ్చి ప్రభను అనేకసార్లు పరీక్షించింది. సీలింగ్ ఫ్యాన్ విసురుగా తిరుగుతూనే వుంది. కానీ డాక్టరు ముఖమంతా చమట బిందువులతో నిండిపోయింది ఆమె కంగారు చూసిన మంగాయమ్మగారికి భయం వేసింది. ఆమె ఇంక ఆగలేక పోయింది.

"ఏమయింది డాక్టర్? త్వరగా చెప్పండి అడిగిందామె. సుశీల కంగారు ఇంక తగ్గలేదు. ఆమె మంగాయమ్మ గారిని తేరిపార చూసింది.

"ఏమండీ ఈ అమ్మాయి నేనా నాకు మీరు లోగడ చూపించారు?"

డాక్టరు అలా అడిగే టప్పటికి మంగాయమ్మగారికి మతిపోయినంత పనయింది. రోగులను పరీక్షిస్తుండగానే కొందరు డాక్టర్లకు మతులు పోతయ్యని ఆమె లోగడ విని వుంది. అయినా ఆమె కొంత తమాయించుకొని,

"అదేంటి డాక్టర్ అలా అడుగుతారు ప్రభను మీరు కొన్ని సంవత్సరాలుగా ఎరుగుదురు. ఇప్పుడు కొత్తగా మాట్లాడుతున్నారు. అసలేం జరిగింది చెప్పండి." అన్నది మంగాయమ్మగారు.

"అదిసరే లెండి, ప్రపంచంలో అనేకం జరుగుతూ వుంటాయి. ఈ ప్రభకేగా మీరు శ్రీమంతం చేసింది. ఈ ప్రభనేగా నేను ట్రీట్ చేస్తున్నాను"

అలా అంటూనే డాక్టరు సుశీల తన కుడిచేతిని ఎడమ చేత్తో గిల్లుకుంది. ఆమె ప్రివర్తన చూసిన మంగాయమ్మ గార్కి అనుమానం మరింత ఎక్కువయింది.

"డాక్టర్ దయచేసి విషయం చెప్పండి. మాకు చాల కంగారుగా వుంది" అన్నది మంగాయమ్మ.

"ఏవండీ! ఇదంతానాకు అయోమయంగా వుంది నిన్నటి వరకూ ప్రిభ గర్భవతి అని నేను ట్రీట్ మెంటు ఇచ్చాను. నీ ఈరోజున ఆమె గర్భవతి కాదు అని చెప్ప డానికి నేను సందేహిస్తున్నాను.

"డాక్టర్ ఏమిటి మీరనేది, ప్రిభ గర్భవతి కాదా! ఇన్నాళ్ళూ నాటకమాడారా! కాదు...నిజంగా మీకు మతిపోయింది. నా ప్రిభ గర్భవతే, నా తల్లి ఇలాంటి డాక్టర్లకు చూపించటం మనదే పొరపాటు."

మంగాయమ్మగారు ప్రిభను వెంటపెట్టుకుని వెళ్ళిపో తూవుంటే డాక్టరు సుశీలగారు కళ్ళప్పగించి చూస్తూ నిల బడిపోయారు

బైటికి వచ్చిన మంగాయమ్మ రేణుక, ప్రిభ వెంటనే మరో పేరు మోసిన లేడీ డాక్టరు దగ్గరకు వెళ్ళారు. ఆమె కూడా ప్రిభను పరీక్షించి, ఆమె గర్భవతి కాదని నిర్ధార ణగా చెప్పింది.

"డాక్టర్ అలా అనకండి. మరోమారు పరీక్షించి చూడండి. అనేకమంది డాక్టర్లు ఈమె గర్భవతి అనే చెప్పారు.

శ్రీమంతం కూడా చేశాము. ఇప్పుడదంతా అబద్ధమంటే ప్రజలు నమ్ముతారా చెప్పండి. దయచేసి మరోమారు పరీక్ష చెయ్యండి" అంటూ మంగాయమ్మగారు డాక్టర్ని బ్రతిమాలింది.

"అమ్మా నామాట వినండి. నేను గైనకాలజీ స్పెషలిస్టును. దాదాపు పాతిక సంవత్సరాలనుంచి ప్రాక్టీసు చేస్తున్నాను. నా పరీక్షలో ఏనాడూ జరగలేదని గర్వంగా చెప్పుకుంటున్నాను. అమ్మా మరోమాట. ఈ అమ్మాయి గర్భవతి అని ఏ డాక్టరయినా నిరూపిస్తే ఈనాడే నేను నా ప్రాక్టీసును మానేస్తాను. సరేనా" అన్నది,

ఇక గత్యంతరం లేక వారంతా యిల్లు చేరారు. ప్రభ అయోమయ స్థితిలో పడిపోయిం౦. లోకులకేం చెప్పాలా అని మంగాయమ్మగారు ఆలోచిస్తున్నారు. రేణుక కూడా తన వంశాంకురాన్ని చూసి సంతోషించాలని వుబలాటపడిసది. కానీ ఆమెకు నిరాశ ఎదురయ్యేసరికి మనిషి కృంగిపోయింది.

"పోస్టు" అన్న కేకతో వారంతా మళ్ళీ ఈ ప్రపంచములో కొచ్చిపడ్డారు.కవరుమీద దిలీపు వ్రాత చూసి ప్రభ కొంతవరకు తృప్తిపడింది. కవరుచించి అందులో వున్న ఉత్తరం చదివింది. తాను అశోకాహోటల్‌లో వుంటున్నట్లు ఉద్యోగప్రయత్నాల తొందరలో తీరికలేక ఉత్తరం వ్రాయ లేదంటూ దిలీపు వ్రాశాడు. అందులోనే ప్రభ ఆరోగ్యం గురించి, పెదతల్లి, తలిదండ్రుల యోగక్షేమాలను గురించి

కూడా రాశాడు. అవసరమయితే తనకు ఫోన్ చెయ్యడానికి నెంబరు కూడా వ్రాశాడు.

ప్రభ చదివిన ఉత్తరం విన్న మంగాయమ్మగారు వెంటనే ఫోన్ దగ్గరకు వెళ్ళి ఢిల్లీకి ట్రంకాల్ చేశారు. అర గంటలో అటునుంచి సమాధానం వచ్చింది.

"హలో దిలీప్‌ను మాట్లాడుతున్నా. నేను ఉత్తరం రాశాను అందిందా?"

"ఆ....అందింది. నేను పెద్దమ్మను మాట్లాడుతున్నా. నువ్వు వున్న పాళంగా వచ్చెయ్యి. ఇక్కడ చాలా పనులు న్నాయి" అన్నది మంగాయమ్మ.

"అబ్బ ఏపటి పెద్దమ్మా, ఉద్యోగం, ఉద్యోగం అని ప్రాణం తీశారు. తీరా యింకో వారంలో దొరకబోయే ఉద్యోగాన్ని వదులుకొని రమ్మంటున్నారు."

"ఆ వెధవ ఉద్యోగం అది లేకపోతే బ్రతకలేమా? నువ్వు రా బాబూ. యిక్కడ యింటి వ్యవహారాలు చూడాలి. అసలే మగదిక్కులేని సంసారమాయె" అన్నది మంగాయమ్మ.

"ఒక్కసారి ప్రభను మాట్లాడమను" అన్నాడు దిలీప్.

మంగాయమ్మగారు ఫోన్ మవుత్‌పీస్ మూసి "ప్రభా, ఈ విషయాలేం చెప్పకు. నేను చెప్పినట్లే చెప్పు అతను రావడం మనకు చాలాముఖ్యం. అందులోనూ దిలీప్

వెళ్ళిన దగ్గర్నుంచీ నువ్వు బెంగపెట్టుకున్నావాయె" అంటూ ఆమె ఫోన్ ప్రభ చేతికిచ్చింది.

"హల్లో" అన్నది ప్రభ.

"హల్లో ప్రభా! ఏమిటి గందరగోళం. నిజంగా నేను రావాలా? నువ్వు చదువుకున్నదానివిగా ఆ మాత్రం పనులు చూడలేవు" అన్నాడు దిలీపు.

"ఆ....ఆ....చూసుకోండి ....కాని ఎలాగూ మగవారుంటే మంచిదికదా. త్వరగా వస్తే త్వరగా వెళ్ళిపోవచ్చు" అన్నది ప్రభ.

తరువాత వారేవో విషయాలు మాట్లాడుకున్నారు. మరునాడు ఉదయమే తాను బయలుదేరి వస్తున్నానని చెప్పాడు. వార్తవిన్న మంగాయమ్మగారు, రేణుక ఎంతో ఆనందించారు. కాని భర్తను తన ముఖం ఎలా చూపించాలా అన్న సిగ్గుతో ప్రభమాత్రం విచారంగా వుండిపోయింది.

అనుకున్న టైముకు దిలీపు రానేవచ్చాడు! అందరూ సంతోషించారు. కానీ వారిలో వున్న మార్పు మాత్రం స్పష్టంగా కనిపిస్తూవుంది. దిలీపు అసలు విషయం ఏమిటని, పెదతల్లిని, భార్యను నొక్కి నొక్కి అడిగాడు. కానీ వారు నిజం చెప్పటానికి సందేహించారు. ఇక దిలీపుకు సహనం సన్నగిల్లింది. అందుకే అతను వాళ్ళను నిగ్గదీసి అడిగాడు. ఇక వారికి గత్యంతరం లేక విషయాన్ని చెప్పేశారు. అంతా విన్న దిలీపు నవ్వాడు.

"పెద్దమ్మా, మీదంతా చాదస్తం నేను ప్రభను డాక్టరు దగ్గర చూపిస్తా. మీరు కూడా నాతోరండి" అన్నాడు.

వారంతా కలసి డాక్టర్ సుశీల దగ్గరకు వెళ్ళారు. మంగాయమ్మగారితో పాటు ప్రభ కూడా సుశీలను చూసి కొంచెం సిగ్గుపడిపోరు కానీ దిలీపు ఆమె దగ్గరకు ధైర్యంగా వెళ్ళాడు.

"డాక్టర్, ప్రభనుమతోసారి పరీక్షిస్తారా?" అన్నాడు.

డాక్టర్ సుశీలకు కోపం వచ్చింది. అయినా తన కోపాన్ని బైటకు కనపడనివ్వకుండా.

"దిలీప్‌గారూ, మీ భార్యను చాలా శ్రద్ధగా పరీక్షించాను. ఇంక పరీక్ష చెయ్యవలసిన అవసరం నాకెక్కడా కనపించలేదు" అన్నది.

"అలాకాదు డాక్టర్ ఈసారి మీరు నా సంతృప్తి కోసం ఆమెను పరీక్షించండి. నేను ఆమెను అనేక చోట్ల పరీక్ష చేయించాను. మీరుచెప్పినట్లుగా ఎవ్వరూ చెప్పలేదు" అన్నాడు దిలీప్

ఇంక అతని మాటలు తీసెయ్యలేక డాక్టర్ సుశీల, ప్రభను మరోమారు పరీక్షిస్తానని చెప్పి టేబుల్ మీద పండుకోబెట్టింది. మనసులో ఇష్టంలేకపోయినా ఆమె ప్రభ కడుపు పరీక్షించింది పరీక్షిస్తున్నంతసేపూ ఆమె ఎంతో మర్యాదగా వుంది.

"మైగాడ్ .... నేను నిజంగా మేలుకొని వున్నానా లేక పోతే కలగంటున్నానా." ఆమె రెండు చేతులతో తల నొక్కుకుంది.

"డాక్టర్! ఏవిటి అలా అయిపోతున్నారు. నర్సు.... త్వరగా" అంటూ దిలీపు కేకలు పెట్టాడు.

నర్సు అక్కడకు పరుగెత్తుకొచ్చి డాక్టర్ సుశీలను పట్టుకుంది. కొంతసేపయినతరవాత ఆమె నెమ్మదిగా కళ్ళు తెరచి మంచినీళ్ళు తెమ్మని నర్సుతో చెప్పింది. మంచినీళ్ళు రాగానే ఆమె వొకే గుక్కలో నీళ్ళన్నీ తాగింది.

"మిష్టర్ దిలీప్, ఈమె పేరు ప్రతీకదూ?" అన్నది.

'డాక్టర్ మీకా అనుమానం ఎందుకొచ్చింది?" దిలీపు ఆమెను ఎదురు ప్రశ్నించారు.

"అదికాదు వొకవేళ ప్రభ కవలపిల్లలలో వొకామె అయివుంటుందా అని అనుమానం" అన్నది డాక్టర్.

'మీకా అనుమానం ఎందుకొచ్చిందో నాకర్థం కావడంలేదు." ఈసారి దిలీప్ గొంతులో శ్రుతి ఎక్కువయింది.

"మీరు మరోలా అనుకోకండి ప్రభతోపాటు కవల పిల్లలెవరయినా వున్నారా?"

"అబ్బే అదేంలేదు డాక్టర్" అన్నది మంగాయమ్మ గారు.

"డాక్టర్ ఇదంతా ఏమిటి, మేము ప్రభను పరీక్ష చెయ్యమంటే ఆమెతోపాటు పుట్టిన కవలలు ఎవరన్నా వున్నారా?

అని అడుగుతున్నారు. విషయం దాచకుండా చెప్తారా?"
కఠినంగా అడిగాడు దిలీపు.

డాక్టర్ సుశీల గట్టిగా శ్వాస పీల్చుకుంది.

"మిస్టర్ దిలీప్ ఇప్పుడు నేను పరీక్ష చేస్తున్న ప్రభ. నిజంగా గర్భవతే. ఆమెకు దాదాపు ఏడుసామాలు కూడా నిండాయి. కానీ కొన్నాళ్ళ కిందట పరీక్షించిన ప్రభ మాత్రం గర్భవతి కానేకాదు. అందుకే వీరిద్దరూ వొకరే అని మీరు అంటున్నా నాకు మాత్రం నమ్మకం లేదు" అన్నది డాక్టర్.

"డాక్టర్! అలాగయితే అంతకుముందు మీరు పరీక్షించిన ప్రభ, శ్రీమంతం చేసుకున్న ప్రభా గర్భవతేనంటారా? అందులో కూడా అనుమానం వుందా?" మంగాయమ్మగారు నిగ్గదీసి అడిగింది.

డాక్టరుగారి ముఖమంతా కందగడ్డలా తయారయింది. ఆమె కళ్ళ నున్న జోడు తీసి, దూరంగా టేబుల్ మీద విసిరి వేసింది మరో గ్లాసు మంచినీళ్ళు తాగింది.

"యిదుగో చూడండి నేను పరీక్షించిన మనిషి ప్రభో కాదో నాకు తెలియదు. కానీ నేను పరీక్షించినపుడు గర్భవతి అన్న మనిషి గర్భవతే. అంతే అంతకన్నా నేను మీకు ఎక్కువ చెప్పలేను. మాయలు, మంత్రాలు, మహిమలు అంటే నాకు నమ్మకం లేదు" అన్నది డాక్టరు.

దిలీపు, మంగాయమ్మగారు, ప్రభ ఒకరి ముఖాలు ఒకరుచూసుకున్నారు, ఇంక వారికి గత్యంతరం తోచలేదు.

"మరి మమ్మల్నేం చెయ్యమంటారు డాక్టర్? దిలీపు అడిగాడు.

"చెయ్యటానికేముంది? ప్రభను గర్భవతిగానే ట్రీట్ చేస్తున్నా కదా. అలాగే ఆమెకు మందులు టానిక్కులు సరయిన వేళకు యిస్తూ వుండండి. ఇంకా అంతకన్నా చేసేదేముంది. సరే నేనింక వస్తా. ఇతర పేషంట్లు చాలామంది కూచున్నారు" అనిచెప్పి ఆమె తనపని చూసుకోటానికి వెళ్ళి పోయింది.

మంగాయమ్మగారికి డాక్టరు సుశీల మాటల్లో నమ్మకం కుదరలేదు. అందుకే ప్రభను మరో పేరుపొందిన డాక్టరు దగ్గరకు తీసుకువెళ్ళారు. ఆమె కూడా లోగడ ప్రభను పరీక్షించి గర్భవతి కాదని చెప్పింది. కాని ఇప్పుడు ఆమె అదే నోటితో ప్రభ గర్భవతి అన్నది.

అప్పటికిగాని వారందరికీ తృప్తి కలగలేదు. తన డెలివరీ అయ్యేవరకూ ఎటూ వెళ్ళటానికి వీలులేదని దిలీపుమీద ఆంక్ష పెట్టింది ప్రభ. అందుకే వారం రోజులలో వచ్చే వుద్యోగం కూడా మానుకొని దిలీపు భార్యదగ్గరనే వుండిపోయాడు. రోజులు గడుస్తున్న కొద్ది ప్రభలో నీరసం ఎక్కువ కాజొచ్చింది. ఆమెలో పూర్తి గర్భవతి లక్షణాలు కనిపిస్తున్నాయి. ఆమె కదలటానికి కూడా చాలా అవస్థ పడుతూ వుంటే దిలీపు ఆమెకు సహాయంగా వుండి అన్ని పనులూ సరి చేస్తున్నాడు. కాలం జోరుగా ముందుకు సాగిపోతూవుంది.

# 7

హీరోషిమా, నాగావళీల పేరు చెబితేనే ప్రపంచం కొన్నాళ్ళు దడదడ లాడింది. అంతులేకుండా మారణహోమం సాగుతున్న రెండవ ప్రపంచ యుద్ధకాలంలో మానవ జీవితం అస్తవ్యస్తమైపోయింది. హితులెవ్వరో, విరోధులెవ్వరో తెలుసుకోటానికి కూడా వీలులేనంత పతనావస్థకు మానవ సమాజం దిగజారిపోయింది. యుద్ధం ఆగకపోతే భూగోళానికి ప్రళయం సంభవించే రోజులు వచ్చాయి. మంచికో చెడ్డకో అణుబాంబులు హీరోషిమా, నాగావళీలమీద ప్రయోగించబడినాయి. ఆ రెండు మహానగరాలు నామరూపాలు లేకుండా తుడిచిపెట్టుకు పోయాయి. యుద్ధం ఆగిపోయింది. యాటం బాంబు పేరుచెపితే ప్రజలు భయభ్రాంతులు కాజొచ్చారు. క్రమంగా యాటంబాంబులు కొన్ని దేశాలలోనే తయారు కావడం వల్ల ఆ దేశానికి తతిమ్మా దేశాలన్నీ దాసోహం అన్నవి. రోజులు గడుస్తున్న కొద్ది ఇతర దేశాలలో కూడా యాటంబాంబును గురించి పరిశోధనలు జరిగాయి. కాల క్రమాన చాలా దేశాలు ఈ యాటంబాంబును తయారుచేసే విధానం గ్రహించారు. కొన్ని దేశాలు వాటిని తయారు చేసి వుంచుకున్నాయి కూడా. ఎక్కువ బాంబులున్న వారికి ఎక్కువ ప్రాధాన్యత వచ్చింది. దాంతో యాటంబాంబు తయారీలో పరుగుపందెం ఆరంభమయింది.

యాటంబాంబు ప్రయోగమంటే అనేక లక్షల జన నష్టం, ఆస్తినష్టం అంతేకాదు దానితాలూకు ధూళీవల్ల

మానవాళికి కలగబోయే నష్టం అపారం. అందుకే చాలా మంది పెద్దలు యాటం శక్తిని, మానవాళికి వుపయోగపడేలా చూడమని సలహా యిచ్చారు. దానికోసం అనేక దేశాలలో ప్రయోగాలు ఆరంభించారు.

అమెరికా కూడా యిలాంటి పరిశోధనలు చెయ్యనారంభించింది. అణుశక్తి యింటి అవసరాలకు ఎలా వుపయోగపడుతుందో చూడమని అమెరికా ప్రభుత్వం శాస్త్రజ్ఞులని నియమించింది. ఇండియాలోనుంచి కూడా కొంతమంది శాస్త్రజ్ఞులు వెళ్ళి ఆ పరిశోధనలో పాలుపంచుకుంటూ వుండేవారు. ఆలా అణుశక్తి ప్రయోగశాలలలో ఓ డజనుమంది పేరు బడిన పెద్ద సైంటిస్టులు వున్నారు. వారిలో ముఖ్యంగా డాక్టర్ యాదవ్, డాక్టరు రామారావు, డాక్టర్ శాస్త్రి, డాక్టరు దిలీపుకుమార్, డాక్టరు అయ్యంగారు చెప్పుకోదగినవారు. వారే డ్యూటీ ప్రకారం పరిశోధనలు చేస్తుండేవారు.

ఆనాడు ప్రయోగశాల అంతా చాలా సందడిగా వుంది. ఇండియా నుంచి వచ్చిన సైంటిస్టులు అణుశక్తిని చిన్న పెన్‌టార్చి అంత సైజులో ఇముడ్చిదానిద్వారా ఇంటి అవసరమయిన వంట గ్యాసు, లైటింగు కూడా వచ్చేలా తయారు చేస్తున్నారని చాలామందికి తెలిసిపోయింది. ఆ రోజు డ్యూటీ ప్రకారం ముగ్గురు సైంటిస్టులు పనిచేస్తున్నారు. వారెంతో కష్టపడి అణుశక్తిని పెన్‌టార్చిలాంటి దాంట్లోకి పంపటానికి ప్రయత్నం చేస్తున్నారు. చాలా

సార్లు ఆ ప్రయోగం ఫేయిల్ అవుతూవుంది. కానీ ఆనాడు వున్న సైంటిస్టులకు గూడా పట్టుదల ఎక్కువయింది, అందుకే వారు బలమైన యంత్రసహాయంతో అణుశక్తిని పెన్ టార్చి లాంటి దాంట్లోకి ఎక్కించటానికి ప్రయత్నిస్తున్నారు. ఉన్నట్లుండి ప్రయోగశాలలో పెద్ద పెట్టున పేలుడు సంభవించింది. ప్రయోగాలు చేసే పరికరాలన్నీ గాలిలోకి దూదిపింజల్లా ఎగిరిపోయాయి. దాంతోపాటు ఫర్నిచర్ కూడా ముక్కలు ముక్కలయింది. అంతటితో ఆగలేదు లేబరేటరీ అంతా నిప్పంటుకుంది. క్షణాలలో ఈ వార్త ప్రయోగకేంద్రంలో అందరికీ తెలిసిపోయింది. తక్షణం రక్షణ చర్యలు ఆరంభించారు. ఫైర్ ఫైటింగువారు మంటలార్పటానికి చాలా తిప్పలు పడసాగారు, ఏడెనిమిది గంటలకు గాని మంటలు అదుపులోకి రాలేదు. ప్రయోగం చేస్తున్న ముగ్గురు సైంటిస్టులు ఎవ్వరూ కనిపించలేదు. అప్పుడే వార్త దేశ దేశాలు రేడియో ద్వారా తెలిసిపోయింది. డ్యూటీలో వున్న డాక్టర్ యాదవ్, డాక్టర్ రామారావు డాక్టరు శాస్త్రి గురించి అన్వేషణ జరిపిస్తున్నట్లు అణుశక్తి కేంద్రం ప్రకటించింది. వార్తాపత్రికలు తమకు తోచిన విధంగా విషయాన్ని గురించి వ్రాయసాగాయి తరవాత కొన్నాళ్ళవరకూ ప్రయోగశాలలో ఆ ప్రత్యేక విభాగాన్ని మూసివేసినట్లు ప్రకటనలు వెలువడ్డాయి. అణుధార్మికశక్తి అనేక విధాలుగా మానవజీవితం

మీాద చెడుపరిణామాలు తెస్తుందని, ప్రజలు, సైంటిస్టులు ప్రయోగశాలలో పనిచేసే ఇతర సిబ్బందిని కూడా జాగ్రత్తగా వుండమని అణుశక్తి కంట్రోలు వారు ఆదేశాలిచ్చారు కానీ అవన్నీ చేతులు కాలిం తర్వాత ఆకులు పట్టుకున్న చందంగా తయారయ్యాయి.

రోజులు గడుస్తున్నకొద్దీ జనం ఈ విషయాన్ని మరిచి పోయారు. కాని అమెరికా ప్రభుత్వం అణుశక్తి ప్రయోగ కేంద్రం మాత్రం పేలుడుకుగల కారణాలు దాని పరిణామాల గురించి కమిటీలు వేసి నివేదికలు అందుకుంటూనే వున్నారు.

* * *

కాలం మరికొంత ముందుకు నడిచింది. ప్రభ ఇప్పుడు నిండు చూలాలు. ఆమె లేవడానికి తిరగడానికికూడా చాలా బాధపడి పోతూవుంది ప్రసవం రెండురోజులలో వస్తుందని డాక్టర్ సుశీల చెప్పడంతో ప్రభను అక్కడే చేర్చారు.

శుభముహూర్తాన ప్రభ పండంటి కొడుకును కన్నది. తల్లి పిల్ల వాడు ఆరోగ్యంగా వున్నారు. వారు పదకొండవ నాటికి ఇల్లు చేరారు. పసిపాపలు చాలాకాలంగా లేని ఆ యింట్లో పసివాడి ఏడుపుతో ఆనందం వెల్లువికింది. పిల్లవాడిని, రాత్రిం బగళ్ళు చూసుకోవడానికి ఆయానుకూడా మాట్లాడేశారు మంగాయమ్మగారు.

బారసాల, నామకరణం తతంగాలన్నీ ముగిశాయి.

రేణుక వొకసారి మనవడ్ని తీసుకొని వారింటికి రమ్మనమని చెప్పి వెళ్ళిపోయింది. రోజులు గడుస్తున్నాయి. బాబుకు మూడువ నెల కూడ వచ్చేసింది.

బాబుకు భాను ప్రకాశ్ అంటూ నామకరణం చేశారు, రోజులు గడుస్తున్నకొద్ది బాబు దబ్బపండులా తయారయ్యాడు. మూడు నెల్ల బాబును చూసిన వారంతా సంవత్సరం బాలు డంటున్నారు. అందరూ అల్లారుముద్దుగా చూస్తున్న బాబు ఇప్పుడు మనుషులు పిలిస్తే వారి వంక చూస్తున్నాడు. దాదాపు మనుషులనందర్నీ గుర్తిస్తున్నాడు. బోసినోటి నవ్వులతో ఆ ఇంటిలో బాలచంద్రుడిలా పెరుగుతున్నాడు. ఆయాకూడా బాబును గురించి చాలా శ్రద్ధ తీసుకుంటూ వుంది.

"బాబూ భానూ" అంటూ దిలీప్ పిలి నప్పుడల్లా బాబు కిలకిలా నవ్వేవాడు. తండ్రిని ఎత్తుకోమని రెండు చేతులెత్తేవాడు, అది చూసిన దిలీప్‌కు ఒళ్ళు తెలియని సంతోషం వచ్చేది. బాబునెత్తుకొని గంటల తరబడిఆడించేవాడు సాయంత్రింపూట చక్రాలబండీలో కూర్చోబెట్టి తోటంతా తిప్పేవాడు.

బాబు సందడిలో దిలీప్ ఉద్యోగవిషయుంగాని, మరే ఇతర విషయాలుకానీ వారంతగా పట్టించుకోవడం లేదు. మంగాయమ్మగారు తన ఆస్థి వూర్తిగా భాను ప్రకాష్ పేరన వ్రాసేసింది, బాబుకోసం కావలసిన ఆటవస్తువులు అన్నీ ఆమె కొంటూ వుంది.

ఆ నాడు ప్రభ, దిలీప్ చాలాసేపు బాబు దగ్గరే కూర్చున్నారు. పది దాటటంతో బాబుకు నిద్ర వస్తుందన్న నెపంతో వారిద్దరినీ పంపేసింది. భార్యా భర్తలిద్దరూ తమ గదికి వెళ్ళి బట్టలు మార్చుకొని పండుకున్నారు.

గోడగడియారం రెండు కొట్టింది. దిలీప్‌కు మెలుకువ వచ్చింది. అతడు బద్ధకంగా కళ్ళు తెరిచి చూశాడు. జీరో వాట్లు బల్బు కాంతిలో గదంతా చూశాడు. తన పక్కనే ప్రభ హాయిగా నిద్రపోతూవుంది. ఇంతలో పక్క గదిలో నుంచి బాబు ఏడ్పు వినిపించింది. అతడు లేవడానికి బద్ధకించాడు. అందుకే పక్కనేవున్న ప్రభను తట్టిలేపాడు. ఆమె లేస్తూనే వొంటిమీద బట్టలు సర్దుకుంటూ.

"అబ్బ, బాబు ఏడుస్తే, ఆయా చూస్తుంది లెండి, నాకు నిద్ర ముంచుకొస్తుంది" అంటూ పక్కకు తిరిగి పండుకుంది.

ఇంక గత్యంతరంలేక దిలీప్ దుప్పటి ముసుగుదన్ని పండుకున్నాడు. కాని అతని మనస్సంతా బాబుమీదనే వుంది. వెళ్ళి ఆయాను లేపి రమ్మనమని ప్రభతో చెప్పాడు. ఆమె నిద్రలో "ఊఁ" అనిమాత్రం అన్నది. అలా ఆలోచిస్తున్న దిలీప్‌కుకూడా నిద్రపట్టింది. అలా అతడు ఎంత సేపు నిద్రపోయాడో అతనికే తెలియదు. బయట ఎవరో తలుపు మోదిన చప్పుడు కావడంతో ప్రభ లేచింది. ఆమె వెళ్ళి తలుపు తెరవబోయింది. కానీ లోపల గడియ తీసివుంది.

ఆమె తలుపు తెరిచింది. ఎదురుగా ఆయా కంగారుగా నిల బడి వుంది.

"అమ్మా! బాబు కనిపించడంలేదు. తలుపులు తెరచి వున్నాయి" ఆమె మాటల్లో ఏడుపు ధ్వనిస్తుంది.

ప్రభ అక్కడ ఆగలేదు. వెంటనే ఆయా గదికి పరు గెత్తింది. గది అంతా వెతికింది, కానీ బాబు జాడే తెలియ లేదు. ఆమె పిచ్చిగా అరుస్తూ తమ బెడ్ రూముకు పరుగెత్తు కొచ్చింది.

"ఏమండీ... మీమ్మల్నే ... బాబు ... బాబుకనిపించ డం లేదు" అన్నది.

ఆమె అరుపులకు దిలీప్ కంగారు పడ్డాడు. మొదట అతనికి విషయం అర్థం కాలేదు. తరువాత అతడుకూడా ఆయా గదిలోకి వెళ్ళి చూశాడు ఆమె నడిగి వివరాలు తెలుసుకున్నాడు. తాను లేచిచూసేసరికి బాబు పక్కమీద లేడని, గది తలుపులు తెరిచి వున్నవని ఆయా చెప్పింది. ఇంక గత్యంతరం లేక అతడు ఫోను దగ్గరకు వెళ్ళి డయల్ చేశాడు.

"హల్లో"

"యస్ ప్లీజ్. ఇది పోలీసు స్టేషను"

"మీరు తొందరగా రావాలి. మా బాబు నెవరో ఎత్తుకొని పోయారు. త్వరగా రావాలి" అంటూ వారికి యింటి అడ్రసు చెప్పాడు. ఈ వార్త విన్నమంగాయమ్మ

గారు సుడిగాలిలా వచ్చిపడింది. ఆమెలో ఆవేశం పెరిగి పోయింది. ఆయాని, నౌకర్లని చివరకు ప్రభను, దిలీప్‌ను కూడా తిట్టిపోసింది. అలా ఎడ తెరిపి లేకుండా తిడుతున్న మంగాయమ్మగారికి పూర్వం వున్న రక్తపు పోటు మళ్ళీ వచ్చింది. దాంతో ఆమె అక్కడ నిలబడలేక, ప్రభ గది లోకి వచ్చి మంచంమీద పడుకుంది.

అసలే బాబు కనిపించలేదని కంగారుతో వున్న ప్రభకు మంగాయమ్మగారి బ్లడ్ ప్రెషర్ సమస్య కూడా వచ్చింది. అందుకే ఆమె కూడా వెళ్ళి మంగాయమ్మగారి ప్రక్కనే కూర్చోబోయింది. కానీ ఆమెకు దుప్పటి క్రింద ఏదో మెత్తగా తగలడంతో దుప్పటి ఎత్తి చూసింది. ఆమె ఆశ్చ ర్యానికి అంతు లేదు. బాబు హాయిగా నిద్రపోతున్నాడు.

"మామ్మా బాబు.... బాబు ఇక్కడే వున్నాడు" అంటూ ఆమె కేకలేసింది.

"ఏడీ... ఎక్కడ... నా కన్నతండ్రెక్కడ" అంటూ మంగాయమ్మగారు లేచి బాబును తన చేతుల్లోకి తీసుకుంది విషయం తెలిసిన దిలీప్, ఆయా అందరూ ఆ గదిలోకి పరు గెత్తుకొచ్చారు. అప్పుడే నిద్రమేలుకున్న బాబు మంగా యమ్మ గారి చేతుల్లో కిలకిలా నవ్వుతున్నాడు. అంతకు ముందు అయోమయంగావున్న ఆ యింటి పరిస్థితి క్షణాలలో మారిపోయింది. ఎవరి ముఖాన చూసినా సంతోషం కని పిస్తూవుంది. మంగాయమ్మగారి రక్తపుపోటు ఎలావచ్చిందో

అలాగే మాయమయింది. బాబు ఆయా గదిలోంచి ప్రభ గదిలోకి ఎలా వచ్చాడా అన్న సమస్య మాత్రం మిగిలి పోయింది. అంతలో బూట్లు టపటపలాడించుకుంటూ పోలీసులు రానేవచ్చారు. ఇంక దిలీప్ వారికి క్షమాపణ చెప్పుకొని పంపేశాడు.

"ఆయా! నీ గదిలో వున్న బాబు వాళ్ళగదిలో కెలా వచ్చాడంటావు" మంగాయమ్మగారి మాటలు కటువుగా వున్నాయి.

"నాకు తెలియదండి, గది తలుపులు కూడా మూసి వున్నాయి. ఇది ఎలా జరిగిందో నా కర్థం కావడం లేదు." అంటూ తెల్ల ముఖం వేసింది, ఆయా.

"మామ్మా, రాత్రి బాబు ఏడుస్తున్నాడని ఆయన గారు నాకు చెప్పారు. నాకు నిద్రముంచుకొచ్చింది. నేను లేవలేకపోయాను. ఆయనే ఈ పని చేసి వుంటారు" అన్నది ప్రభ.

"అబ్బే... నాకేం తెలియదు. నిన్న లేపాను అంతే. తరువాత నేను నిద్రపోయాను. అడిగాక ఆయా గదిలోపల గడియపెట్టి పడుకుంటే నేను లోపలకు ఎలా వెళ్ళగలను?" అతడు సమాధానం చెప్పాడు.

కానీ ప్రభమాత్రం మంగాయమ్మగారి చెవిలో ఏదో చెప్పింది దాంతో ఆమె దిలీప్ని చూసినవ్వింది. దిలీప్కు కోపం వచ్చేదిలాగుంది

"పెద్దమ్మా నువ్వు నమ్ముతున్నావా? నేను చెప్పింది అక్షరాల నిజం. ప్రతిభే ఆ గదిలో లేచి వెళ్ళి బాబును తీసుకొచ్చి వుంటుంది. ప్రతిభ పిలవగానే ఆయా కూడా నిద్రకళ్ళతో తలుపులు తెరిచి వుంటుంది. అంతే ఆమె బాబును తీసుకొచ్చి వుంటుంది ఈ ఆడవాళ్ళంతా ఇంతే, ఏదయినా పని చేస్తారు. దాన్ని వెంటనే మరిచిపోయి దాని కప్పిపుచ్చడానికి వంద అబద్ధాలాడుతారు" అన్నాడు.

విషయం కొంతవరకు నా వ్యధగా పరిణమించింది. ఇంతకీ బాబు ఆ గదిలోకి ఎలా రాగలిగాడా అన్న ప్రశ్న మాత్రం తేలలేదు.

"అబ్బ పోద్దురూ. బాబు సురక్షితంగా వున్నాడు. అంతేచాలు నా బాబే లేచి గదితలుపులు తీసుకొని వచ్చి తల్లి, తండ్రిదగ్గర పడుకున్నాడు అనుకుందాం ఇంక ఈ విషయం మరిచిపోండి. మా బాబు అలా గదితలుపులు తెరుచుకుని రావడం వరకూ వస్తే చూసి ఆనందించాలని వుంది" మంగాయమ్మగారు ఆ తగాదాకు పరిష్కార మార్గం చెప్పింది. దాంతో ఎవరి పనులకు వాళ్ళు వెళ్ళిపోయారు.

బాబుకు అయిదవ నెలవచ్చింది. బోర్లపడటం, నేల మీద పాకడం లాంటివి చేస్తూవుంటే, ఆ ఇంట్లో అందరూ అది చూసి ఆనందించేవారు. ఒకరోజు భోజనాలయిన తరవాత, మంగాయమ్మగారూ, ప్రతిభ డ్రాయింగ్ హాల్లో

కూర్చున్నారు, ఆయినాకూడా అప్పుడే పిల్లవాడిని తెచ్చి ప్రభ చేతికిచ్చి తాను ఫోంచేసివస్తానని వెళ్ళిపోయింది.

బైట ఎండ తీవ్రంగా వుంది, తల్లి దండ్రులను చూసి వద్దామని వెళ్ళిన దిలీప్ అప్పుడే వచ్చాడు. అతని చేతిలో రంగు రంగులబొమ్మలున్నాయి, వాటిని చూసి భాను ప్రకాశ్ కేరింతలు కొట్టనారంభించాడు.

"బాబూ, ఇవిగో బొమ్మలు అన్నీ నీకోసమే. చూడు ఈ బెలూనెంత బాగుందో" పిలిచాడు దిలీప్,

బాబు నవ్వుతూ ఆటవస్తువుల కోసం చూస్తున్నాడు.

"రా బాబూ. రా. ఇదిగో తీసుకో" ముద్దుగా పిలిచాడు దిలీప్.

అప్పటి వరకు నేలమీద పాకుతున్న బాబువొక్క సారిగా లేచి కూర్చున్నాడు. తరువాత తప్పటడుగు వేస్తూ తండ్రిదగ్గరకు వెళ్ళాడు. అదంతా చూస్తున్న ప్రభ, మంగాయమ్మగారు, దిలీప్ ఆశ్చర్యపోయారు. దిలీప్ తన చేతిలో వున్న ఆట వస్తువులను బాబుకు అందించాడు. అవితీసుకున్న మరుక్షణమే, భానుప్రకాశ్ మళ్ళీ నేలమీద పండుకున్నాడు. కేరింతలుకొడుతూ వాటితో ఆటలాడుతున్నాడు.

"అయిదునెలలపిల్లవాడు అలా నడిచి వెళ్ళాడంటే, అందరూ ఆశ్చర్యపోతారు, దృష్టికూడా తగులుతుంది. ఈ విషయం ఎక్కడా చెప్పకండి. బాబుకు దృష్టితీస్తూవుండండి"

మంగాయమ్మగారు ఉప్పు తీసుకురావడానికి వంటగదిలోకెళ్ళారు.

"ఏమండీ ఇదంతా రహస్యంగా వుంచాలి కదూ, ఈ విషయం తెలిసిందంటే జనం మనింటికి తండోపతండాలుగా వచ్చి పడతారు. అంతేకాదు, పత్రికల వాళ్ళు కావలసినంత ప్రచారం ఇస్తారు" అన్నది ప్రభ.

"అసలీ విషయాన్ని బైటికి ఎందుకు తెలియనివ్వాలి అదీగాక నా బాబు బాలకృష్ణుడిలా ఎన్ని మహిమలు చూపిస్తాడో" అంటూ మురిసిపోయాడు దిలీపు.

ఇంతలో మంగాయమ్మగారు ఉప్పు తెచ్చి బాబు మీద తన చెయ్యి తిప్పుతూ దిష్టి మంత్రం ఏదో చదివింది. తరువాత ఉప్పు తీసుకెళ్ళిపాయిలో పారేసి డ్రాయింగ్ హాల్లోకొచ్చి కూర్చుంది.

"నమస్కారం అత్తయ్యగారూ" పెరిగిన గడ్డం మీసాలు, తలుపు వారగాయన లోపలకు వచ్చాడు.

"నేనేనండి, శివాజీరావును. అమ్మా! ప్రభా బాగున్నావా తల్లీ" అతడు ఆమె దగ్గరకు వెళ్ళబోయాడు.

కాని ప్రభ దూరంగా జరిగింది "ఆ, బాగానే వున్నాను" అంటూ ముక్తసరిగా మూడు మాటల్లో తేల్చి చెప్పింది.

"నువ్వా బాబూ. దారితప్పి వచ్చినట్లున్నావు. కూర్చో అంతా కులసాయేనా! పిల్లంతా ఎక్కడున్నారు!" మంగాయమ్మగారు ప్రశ్నల వర్షం కురిపించింది.

శివాజీరావుగారు కూర్చున్నారు. అత్తగారడిగిన ప్రశ్నలకు వరుసగా సమాధానం చెప్తున్నారు. అప్పుడే తన గదిలోనించి బైటికొచ్చిన దిలీప్ ఆయన్ని చూసి నమస్కరించాడు. శివాజీరావు కూడా వారి యోగక్షేమాలు అడిగి తెలుసుకున్నాడు.

"ఏమిటి బాబూ గడ్డాలు మీసాలు పెంచావు విశేష మేదయినా వుందా!" అడిగింది మంగాయమ్మగారు.

"ఉండటానికే ముంది అత్తగారూ! నేను రిటైరయ్యాను. పిల్లలు అయిదుగురూ చదువుకుంటున్నారు. మన ప్రభకన్నా వారంతా పసివెధవలు. ఇంకా నాలుగు కాలాలపాటు కష్టపడితే వాళ్ళ కాళ్ళమీద వాళ్ళే నిలబడతారు" అన్నాడు శివాజీరావు.

"మరినువ్వు వచ్చేవాడివి పిల్లలనయినా తీసుకురాలేక పోయావా?" మంగాయమ్మగారు ప్రశ్నించింది.

"వారెక్కడొస్తారు చెప్పండి. అంతా చదువుకుంటున్నారు. వేళకు, బడికి కాలేజీకి వెళ్ళాలంటే టైముకు భోజనము తయారు చెయ్యాలిగదా! మరి ఆమెకు ఈ పనితోటే సరిపోతుంది. ఇంక ఇల్లు విడిచిరావడానికి కుదరదు" ఖండితంగా చెప్పాడు శివాజీరావు.

"మరి రిటైర్ అయ్యావ్ కదా, ఏదన్నా చిన్న వ్యాపారమో, మరో ఉద్యోగమో చేస్తే వేడి నీళ్ళకు చన్నీళ్ళు తోడుగా వుంటాయికదా" మంగాయమ్మగారు సలహా ఇచ్చింది.

"నిజమే. తిరిగే కాలూ, తిట్టేనోరూ ఊరుకోదట. కానీ నాకు ఈ వయసులో పుణ్య తీర్థాలు సేవించాలని కోరిక కలిగింది. నాతోపాటు రావడానికి మా ఆవిడ ఇష్ట పడలేదు, పిల్లా జల్లా చదువులు, వంటలతో ఆమెకు టైమే దొరకటం లేదు, సరే నాకు తప్పేదేముంది. అందుకే యాత్రలకు బయలుదేరాను."

"యాత్రలు సేవించాలన్నా అదృష్టం వుండాలి. ఇప్పటికీ నేనొక యాత్రకూడా చెయ్యలేదు" నొచ్చుకుంది మంగాయమ్మగారు.

ఇంతలో ప్రకాష్ పాకుతూవచ్చి తాతగారి పంచె పట్టుకుని లాగాడు. అంతటితో ఆగక చిలిపిగా నవ్వుతూ, ఎత్తుకోమన్నట్లు చేతులు పైకెత్తాడు.

అది చూసిన ప్రభ, దిలీప్ వొకరిముఖాలు వొకరు చూసుకున్నారు.

"ఓర్, ఓర్, నిన్నుచూడనే లేదురా బాబూ.... అత్తయ్యగారూ వీడు మన ప్రభ కొడుకేగా?" అడిగాడు. అప్పటికే తాను ప్రకాష్ తాతగారి వొడిలో చేరి ఆయన గడ్డం సవరిస్తూ వున్నాడు.

"వాడే, వాడే, ఎంతయినా నీ అభిమానం పోని చ్చావు కాదురా, కష్టపడి ఇన్నాళ్ళూ పెంచినా, ముక్కు ముఖం తెలియని తాతగారు రాగానే ఆయనదగ్గర చేరావా?" అన్నది మంగాయమ్మగారు.

"అదే పెద్దమ్మా! నీకు పల్లమెరుగు నీజము దేవుడెరుగు అన్నారు పెద్దలు. ఎంతయినా రక్తసంబంధం కదా మరి." విషయాన్ని ఆమెకు బోధపడేలా చెప్పాడు దిలీప్.

కొంతసేపు వారంతా ఆ మాటా ఈ మాటలతో కాలం వెళ్ళబుచ్చారు.

"పదండి స్నానంముగించుకుని భోజనం చేద్దురుగాని" అన్నది మంగాయమ్మగారు.

కొంతసేపయిన తరువాత వారంతా డైనింగుటేబిల్ దగ్గర చేరారు. పిచ్చాపాటీ మాటలు సాగుతున్నాయి.

"అత్తయ్యా, నేనొకసారి అమ్మాయిని మనవణ్ణి పిలుచుకువెళతా. దానికి మీ అంగీకారం..."

"పిలుచుకెళ్ళు బాబూ... నువ్వు ఎంతయినా తండ్రివి. కాలం కల్పించిన భేదాలు ఎన్నాళ్ళుంటాయి. బాంధుత్వం ముఖ్యంగాని" అన్నది మంగాయమ్మగారు.

"సరే అలాగయితే. నేను యాత్రలుమానేసి అమ్మాయిని పిలుచుకెళతా, తరువాతే నా ప్రయాణం" అన్నాడు శివాజీరావు.

తన్ను ఆహ్వానించలేదని దిలీప్‌కు లోపల కోపంగా వుంది, కానీ అతడు వారి ప్రయాణం గురించి ఏమీ మాట్లాడలేదు. నవ్వి వూరుకున్నాడు. ఎప్పుడూ లేనంత ఆప్యాయత తనమీద ఒలకబోస్తున్నందుకు ప్రియ తండ్రిని అసహ్యించు

కుంది. కానీ తాను తండ్రివెంట రానని వెంటనే చెప్పలేక, తాను భర్తతో మాట్లాడి మరీ బయలుదేరుతానని మాట అడ్డం వేసింది.

"సరేనమ్మా అలాగే చెయ్యి. నీ ప్రయాణం తేలే వరకు నే నిక్కడే వుంటాను. అందుకే త్వరగా తేల్చు తల్లీ!" అన్నాడు శివాజీరావు.

తండ్రివెంట వెళ్ళేవిషయం భర్తనడిగింది ప్రభ.

"నా కసలు ఇష్టం లేదు. ఎలాగూ నువ్వు సవతి కూతురివి. అందుకే ఇన్నాళ్ళూ నీ దగ్గరకు రాకుండా నిన్ను పిలుచుకెళ్ళకుండా అడ్డుపడివుంటుంది. అలాంటప్పుడు మనం ఆలోచించి వ్యవహరిస్తే మంచిది. ఈ విషయంలో పెద్దమ్మ ఏమన్నది" అడిగాడు దిలీప్.

"బాధ్యతంతా మనమీద పెట్టింది. అందుకే నేనూ ఆలోచిస్తున్నా" అన్నది ప్రభ.

"అలాగయితే వెంటనే రానంటే బాగుండదు. రెండు రోజులుండి విషయం చెప్పి ముసలాడిని పంపెయ్యి" దిలీప్ సలహా యిచ్చాడు.

# 8

తెల్లవారుతుండగానే ఆయా పరిగెత్తుకుంటూ వచ్చి దిలీపు వాళ్ళ బెడ్‌రూము తలుపు తట్టింది. ప్రభతోపాటు దిలీపుకూడా కంగారుగా లేచి తలుపు తెరిచాడు.

"బాబు మీ గదిలో వున్నాడేమో చూడండి" అన్నది ఆయా.

భార్యాభర్తలిద్దరూ గది అంతా వెతికారు, కానీ బాబు జాడే కనిపించలేదు. వారంతా మంగాయమ్మగారి గదికి పరుగెత్తారు. ఆమె అప్పటికే లేచి దైవ ధ్యానం చేసుకుంటూవుంది. అక్కడ బాబు లేకపోయేసరికి ఇంటి వారూ నౌకర్లు అంతా ఇల్లంతా వెతికారు. కానీ బాబు ఎక్కడా కనిపించలేదు. శివాజీరావుగది లోపల గడియపెట్టి వుండటంతో ఆయనంటె అనుమానంగా వున్నందున దిలీప్ వెళ్ళి ఆయన్ని లేపాడు. ఆయన అప్పుడే నిద్రలేచాడు ఆవలిస్తూ.

"ఏమిటి బాబూ! నిద్రలేపావు?" ఎదురు ప్రశ్న వేశాడు.

దిలీప్‌కు ఆయన ప్రశ్న చిరాకనిపించింది. ఇంకతప్పని సరి కావడంతో విషయం చెప్పి వెంటనే అక్కడనుంచి వెళ్ళిపోయాడు. కొంత సేపయిన తర్వాత వొక నౌకరు, బాబు ఉయ్యాలలో దొరికిందంటూ వో ఉత్తరం తెచ్చి దిలీపుచేతికిచ్చాడు. విషయం తెలిసిన ప్రభ, మంగాయమ్మగారు, శివాజీరావు మరికొంతమంది నౌకర్లు అక్కడికి చేరారు. వారందరూ వింటూండగా దిలీప్ ఆ ఉత్తరం చదవనారంభించాడు.

మిస్టర్ దిలీపు' మీ బాబు చిరంజీవి భాను ప్రకాశ్

మా దగ్గర సురక్షితంగా వున్నాడు. మీ బాబును ఈరోజు రాత్రి పన్నెండు గంటలకు గండిపేట చెరువువద్దనున్న ఊడల మర్రి దగ్గర అప్పగిస్తాం. కాని వొక షరతు. మాకు లక్షరూపాయల నగదు ఇవ్వాలి, విషయం రహస్యంగా వుంచాలి. ఈ విషయంలో నువ్వు మమ్మల్ని పోలీసులకు పట్టించడానికి ప్రయత్నాలు జరిగినా లేక మాకు అనుమానం వేసినా, చాలా ప్రమాదం. బాబు మీకు దొరక్కపోగా మీ ప్రాణాలు కూడా అపాయస్థితిలో వుంటాయి. జాగ్రత్త. మీ మంచి కోరి చెప్తున్నాం. మాకు లక్షకావాల్సి వచ్చింది. మాటతప్పితే మహా ప్రమాదం.

ఇట్లు

భయంకర్.

దిలీప్ ఉత్తరం చదవగానే అందరూ అతని వైపు ఆశ్చర్యంగా చూశారు.

"నాబిడ్డ. బాబూ, భానుప్రకాష్! ఎక్కడున్నావు? బాబూ, మామ్మా! నా బిడ్డని నాకప్పగించండి గానగలన్నీ తీసుకోండి ఏవండీ! ఇంక ఆలోచించకండీ" ప్రభ భర్త భుజాలుపట్టుకొని విసురుగా ఊపేసింది.

"ఔను బాబూ. ఆ దొంగవెధవతో మనకెందుకు నగానట్రా అమ్మి లక్ష తీసికెళ్ళి వాళ్ళకిచ్చెయ్యి, మనకు బాబు ముఖ్యంగాని డబ్బుకాదు. త్వరగా కానివ్వండి" అన్నది మంగాయమ్మగారు.

"ఇదిగో అల్లుడూ ఇటువంటి విషయాల్లో మగవాళ్ళు జంకకూడదు. ఎలాగో ఉపాయంగా బాబును తెచ్చుకోవాలి. మన తెలివి ఉపయోగించి, బాబుని, డబ్బుని కూడా వాళ్ళకందకుండా చూడాలి. ఆ విషయం నాకొదిలెయ్యండి. ఎంతయినా రిటైర్డు డిప్యూటీ కలెక్టర్ని కదా. పోలీసు వారితో మాట్లాడి, ప్లాను వేసి, తరువాత... అంతా వుందిలెండి" అంటూ చెప్పబోయిన విషయాన్ని మధ్యలో తెంచేశాడు అప్పుడే అక్కడకు వచ్చిన శివాజీరావు.

"అమ్మో, పోలీసుని తీసుకురావద్దు. విషయం తెలిసిందా, ప్రమాదం, ఆ దొంగలు అసలే పచ్చి ఖసాయి వాళ్ళలావున్నారు. అల్లుడుగారు! డబ్బిచ్చే బాబును సురక్షితంగా తీసుకురండి" అన్నది మంగాయమ్మగారు.

లక్షరూపాయలు నగదు పోగుచెయ్యడానికి మంగాయమ్మగారు కొన్ని నగలు అమ్మారు. మరికొంత వీలున్న చోట అప్పుతెచ్చారు. చివరకు ఎలాగో డబ్బంతా పోగుచేసి, వో ఎటాచీలో పెట్టారు, రాత్రి పదకొండు కావచ్చింది. దిలీప్ ఎటాచే శివాజీరావుగారికిస్తూ,

"మావయ్యా ఇదిగో ఈ ఎటాచీ తాళాలు. దొంగలు పెట్టె వోమారు తెరిచిన తరువాత బాబునెత్తుకొని త్వరగా వచ్చేయ్యండి. నేను మీకోసం పాడుబడ్డ శివాలయం దగ్గరవుంటా" అన్నాడు.

మొదట శివాజీరావు ఇష్టపడలేదు, వచ్చేరిస్కంతా తానే భరిస్తానని చెప్పాడు. కానీ ఆయనకు ఏ అపదా రాకుండా దిలీప్‌ను తప్పకుండా తీసికెళ్ళమని ఆడవాళ్ళు గొడవలు పెట్టడంతో ఇంక తప్పదన్నట్లు ఆ మామా అల్లుళ్ళు బయలుదేరారు.

శివాజీరావుగారు నల్లసూటు వేసుకున్నాడు. దిలీప్ కూడా అలాంటి డ్రెస్ వేసుకున్నాడు. కన్నుపొడుచుకున్నా కనపడని చీకటి. ఎలాగో వారిద్దరూ శివాలయం చేరారు.

"బాబూ దిలీప్ నువిక్కడేవుండు కాని నేను, కేక లేస్తేను త్వరం జాగ్రత్తగారా! వొకవేళ ఆ దొంగ విధవలు మోసం చెయ్యవచ్చు. "అంటూ ఎటాచి తీసుకొని ఆ చీకట్లో కలిసిపోయాడు. అతడు ఊడలమర్రిచేరాడు. అక్కడో నల్లని ఆకారం నిలబడివుంది.

"నాన్నా, పనికాయాపండా!" అన్నదా ఆకారం.

"అబ్బాయి శేఖరం! మనం ప్లాను వెయ్యడం అది వృధా పోవడమున్నా బాబెక్కడ?"

"ఇదుగో కడుపునిండా పాలుతాగి తెగ నిద్రపోతు న్నాడు. అబ్బ చెయ్యిలాక్కొస్తుంది."

శివాజీరావు కొడుకు శేఖరం తన చేతులోవున్న భానుప్రసాద్‌ను అక్కడ నేలమీద పండుకో బెట్టాడు.

"అరెరే బాబును ఇలా ఇవ్వు" అన్నాడు శివాజీ రావు.

"ఆ డబ్బు ఇలా ఇవ్వు నాన్నా బాబును, నువ్వొత్తుకో" అన్నాడు శేఖర్.

"నీకు డబ్బివ్వడమా! వొరే శేఖరం నేనొట్టి పిచ్చివాడి ననుకున్నావా నేనూ రిటైర్డు డిప్యూటీకలెక్టర్నిరా! బాబు ఈ డబ్బు నీకిస్తే ఇంకేమన్నా వుందా గద్దకి కోడి పిల్ల దొరికినట్టే" అన్నాడు శివాజీరావు ఎటాచీ గట్టిగా పట్టుకుంటూ.

"అలాగయితే బాబును ఎలా వాళ్ళకు చేరుస్తావు?" అన్నాడు శేఖరం

"దాంకేముందిరా, అడగో ఆ కనపడే శివాలయం దగ్గరే వున్నాడు దిలీప్. అతని చేతికి బాబునిచ్చి వెళ్ళమను తరువాత నేను కలుస్తానని చెప్పు"

"నాన్నా బావ దగ్గరకు నేను వెళ్ళాలా, ఖర్మం చాలక ఆయన నన్ను పట్టుకుంటే!"

"పట్టుకుంటే ఏమయిందిరా, నీ ముఖం వాడికి తెలియదుగా నువ్వు ఫలానా అని చెప్పకు అంతే"

"బాగుంది నన్ను పోలీసులు పట్టుకుంటారు. తరువాత జైలు తరువాత నీ కొడుకునని తెలిసి నిన్నూ నా దగ్గరికే పంపుతారు"

"వొరేయి వెధవా, లక్షరూపాయలెలా వస్తయిరా. నీకు పనాపాటా ఉద్యోగం లేదు సద్యోగం లేదు. ఇన్నాళ్ళు డిప్యూటీ కలెక్టర్నిగా వున్నాకాబట్టి ఎలాగో తప్పించా. ఇంక కుదరదు" అన్నాడు శివాజిరావు.

"నా గొడవకేం గాని నాన్నా మరి నిన్నుకూడా పోలీసులు వదలరుగా?" అన్నాడు శేఖరం.

"ఎవడ్రా నన్ను పట్టుకునేది? నేనెంతయినా రిటైర్డు డిప్యూటీ కలెక్టర్ని తెలుసా?"

"నాన్నా, దేశంలో పెద్ద పెద్దవాళ్ళే తమ కొడుకులు చేసిన తప్పులు కప్పిపుచ్చడానికి నానా గడ్డికరుస్తున్నారు, మరి నువ్వో..."

"నోరుముయ్యరా వెధవా! ఇంకా ఆలశ్యం చేస్తే దిలీపు రానేవస్తాడు. మన నాటకం అర్థం చేసుకున్నాడో మనపని ఖాళీ. త్వరగా వెళ్ళు జాబును ఇచ్చిరా" అన్నాడు శివాజిరావు.

శేఖర్ తండ్రి చేతులోవున్న ఎటాచేను ఆచీకట్లో గుడ్లగూబలా చూశాడు. తరువాత ఎటాచిని బలవంతంగా లాక్కోబోయాడు. కాని ఆయన వదల్లేదు. ఇద్దరికి పెనుగులాట ఆరంభమయింది. శేఖర్ తండ్రి చేతులో వున్న ఎటాచేని బలంగా లాగి ఆయన్ని ముఖం మీద బలంగా గుద్దాడు. ఆ దెబ్బతో శివాజీరావు చెయ్యి పట్టుతప్పింది. కళ్ళు తిరిగాయి. అతడు క్రింద పడిపోతూ,

"శేఖరం.... ఇదంతా మీకోసమేరా ... పెళ్ళిగాని ఆడపిల్లలున్నారా. పదోపాతికో వాడుకొని తతిసూది మీ అమ్మకియి ... మరి ... మరి" అంటూ అతడు క్రింద పడిపోయాడు.

అతనలా అక్కడ ఎంతసేపు పడివున్నాడో అతనికే తెలియదు. కళ్ళు తెరిచిచూశాడు. తానెక్కడున్నది మొదట అతనికి అర్థంకాలేదు. క్రమేపి అతనికి వెనుకటి దంతా జ్ఞాపకం వచ్చింది. వెంటనే లేచి భానుప్రసాద్ కోసం అక్కడంతా వెతికాడు. బాబు జాడలేదు. కాని అతన్ని కప్పుకొని వచ్చిన దుప్పటి మాత్రం క్రింద పడివుంది. ఇంక అతడు చేసేది లేక పాతశివాలయం దగ్గరకు పరుగెత్తాడు. అక్కడ దిలీప్ జాడలేదు. అతనిలో కంగారు మరింత ఎక్కువయింది. అతడు మంగాయమ్మగారింటి వైపు పరుగెత్తాడు.

మంగాయమ్మగారి ఇంటి తలుపులు తెరిచి వున్నాయి. లైట్లు వెలుగుతున్నాయి. శివాజీరావు భయం భయంగా ఇంట్లోఅడుగు పెట్టాడు. ప్రభ, మంగాయమ్మగారు బాబును ఎత్తుకొని ముద్దులాడుతున్నారు శివాజీరావు ముఖం చేటంత అయింది. అతడు వారి దగ్గరకు పరుగెత్తాడు

"అమ్మాయి, బాబుని ఎవరు తెచ్చారు? అల్లుడుగారేనా"

"లేదు నాన్నా, వోగంట క్రితం బాబే పాకుతూ తెరిచివుంచిన వాకిలి గుండా వస్తుంటే మామ్మ స్వయంగా చూసి కేక వేసింది. అంతే బాబూ వెనుకాల ఎవరూ కనిపించలేదు" అన్నది ప్రభ.

శివాజీరావొక నిముషం ఆలోచించాడు. తరవాత నవ్వుతూ.

"దొంగలు నిజాయితీ పరులన్నమాట. డబ్బు తీసుకున్నా మాట నిలబెట్టుకున్నారు." అంటూ అక్కడే వున్న సోఫాలో కూర్చున్నాడు.

శివాజీరావు చేతిలోవున్న ఎటాచి తీసుకొని పరుగెత్తబోతున్న శేఖరానికి దారిలో ఓనల్లని ఆకారం ఎదురయింది. ఆకారం దారికడ్డంగా నిలబడివుంది. శేఖరానికి పారిపోవాలన్న ఆలోచనే తప్ప మరొకటి లేదు.

"ఎవరునువ్వు తప్పుకో. అడ్డం వచ్చావా కాల్చి చంపుతా" అతడు జేబులో చెయ్యి పెట్టాడు.

"ఎదురుగా వున్న వ్యక్తి మెరుపులా అతనిముందుకు దూకి మెడమీద గట్టిగా చరిచాడు. శేఖరం ఆదెబ్బ లెక్క చెయ్యకుండా ఆ వ్యక్తిమీద తిరగబడ్డాడు. యిద్దరికీ పెద్దగా ముష్టియుద్ధం ఆరంభమయింది. జయాపజయాలు తెగటం లేదు. శేఖరం ఇంక గత్యంతరంలేక తన చేతిలోవున్న ఎటాచీతో ఎదుటి వ్యక్తిని కొట్టనారంభించాడు. వారిద్దరూ అలా ఓ అరగంటదాకా పెనుగులాడారు. ఆవ్యక్తి చివరిసారిగా శేఖరం చేతిమీద బలంగా తన్నాడు. ఎటాచి దూరంగా పడిపోయింది. దాన్ని అందుకోటానికి ఇద్దరూ ప్రయత్నం చేస్తున్నారు. ముందు వెళుతున్న వాడిని రెండవవాడు బలంగా వెనక్కి లాగి గుద్దుతున్నాడు. చివరిసారిగా ఆ వ్యక్తి శేఖరాన్ని ముఖం మీద తన్నాడు. అంతే శేఖరం మొదలు

నరికిన అరటిచెట్టులా పడిపోయాడు. తరవాత ఆవ్యక్తి పెట్టెచి దగ్గరకు పరుగెత్తాడు. ఆత్రంగా అది తెరిచి చూశాడు. అతడు తృప్తిగా పెట్టెను మూశాడు. తరవాత అతడు తెలివి తప్పి పడిపోయిన శేఖరాన్ని ఎంతో కష్టంమీద భుజాన వేసు కొని మరోచేతితో పెట్టెచి తీసుకొని నెమ్మదిగా నడిచాడు. భుజానవున్న శేఖరం కొద్దిగా కదిలాడు. అందుకే ఆ వ్యక్తి తన నడక హెచ్చించి పోలీసుస్టేషనుకు వెళ్ళి భుజాన వున్న శేఖరాన్ని దించాడు. అప్పటికీ అతనికి తెలివిరాలేదు. పోలీ సువారి సహాయంతో అతని ముఖాన నీళ్ళు చల్లాడు. అతడు అటు యిటు కదిలి లేచి కూర్చున్నాడు. దిలీపు విషయ మంతా పోలీసులకు చెప్పాడు. అతన్ని తేరిపార చూశాడు. హెడ్ కానిస్టేబుల్ రంగయ్య ప్రక్కనేవున్న సబ్ ఇన్‌స్పె క్టరుగారి దగ్గరగా జరిగాడు.

"సార్"

"ఏమిటి రంగయ్యా?"

"వీడు పాతనేరస్తుడే"

"అలాగా, రెండు తగల్నిస్తే విషయమంతా చెప్పు తాడుగా" అన్నాడు సబ్ ఇన్‌స్పెక్టరు.

"సార్ వీళ్ళ బాబు డిప్యూటీకలెక్టరు"

"అయితే ఏం రంగయ్యా! మనం చట్టం ప్రకారం నడిచేవాళ్ళం. మనకెవరయినా సమానమే. చట్టానికి పెద్దల యినా పిన్నలయినా వొకటే. నేను డ్యూటీలోవుంటే, కలెక్ట

రయినా బిల్లుకలెక్టరయినా సమానమే" అన్నాడు సబ్ ఇన్స్పెక్టరు.

"అలాకాదు సార్. వీడి బాబు వున్నాడు చూశారూ, పెద్ద హేండ్. ప్రతి దాంట్లోనూ కొడుకును వెనకా లేసుకొచ్చేవాడు. అందుకే అన్ని కేసులు ఫైల్ అయ్యాయి"

"ఏవిటీ వీడు మంచి గ్రంధసాంగుడేనన్నమాట. అవును వీడి బాబు పేరు?"

"పేరా సార్ చెప్తా నోట్లో ఆడుతోంది. అదే అదే మహారాష్ట్ర వీరుడు....అదే శివాజీరావుగారు" అన్నాడు.

శివాజీరావు పేరు వినగానే సబ్ఇన్స్పెక్టరు కొయ్యబారిపోయాడు. తర్వాత కొంత తేరుకొని దిలీప్ను చూస్తూ.

"విషయం తెలిసేదాకా మీరిద్దరూ ఇక్కడేవుండాలి" అన్నాడు.

"ఏవండీ మా బాబును ఎక్కడ దాచారో అడగండి. ఆ విషయం తెలిసేవరకూ నేను కూర్చోటానికి వీలులేదు" అన్నాడు దిలీప్.

"సబ్ఇన్స్పెక్టరు కూడా వెంటనే సమాధానం చెప్ప లేకపోయాడు. కాని శేఖరం దిలీప్ దగ్గరగా జరుగుతూ,

"బావా మీ బాబును నాన్నదగ్గర వదిలేశాను. ముస లాడికి డబ్బుమీద కాంక్షపోలా అందుకే ఈ ఎటాచి నేనెత్తు కొస్తున్నా. అంతలో నన్ను యిరగదన్ని ఇక్కడికి తెస్తిరి.

బావా! నిజం నీతో చెప్తాగాని, ఈ పోలీసులకు చెప్తానా! అబ్బో" అన్నాడు శేఖరం.

"అబ్బాయి నువ్వెవరివో నాకు తెలియదు. నన్ను బావా అంటున్నావు. కొంపతీసి నువ్వు శివాజీరావుగారి అబ్బాయివా?" అన్నాడు దిలీప్.

"కరెక్టు బావా. ఇదంతా మానాన్న ఆడిన నాటకం. ఇది మన కుటుంబ వ్యవహారం. ఈ పోలీసోళ్ళకేం పని. పద మనింటికి పోదాం" అంటూ లేచాడు.

"ఛీ...దుర్మార్గుడా. రిటైరయి సంపాదనకు మార్గం తోచక, మీ అయ్యాకొడుకులు ఆడే దొంగనాటకమా ఇది. చెప్పు నా బావెక్కడ? లేకపోతే నీ ప్రాణం తీస్తా" దిలీప్ శేఖరం మెడపట్టుకున్నాడు.

వెంటనే సబ్ ఇన్స్పెక్టరు వారిద్దరినీ దూరంగా నెట్టుతూ,

"ఇది పోలీస్ స్టేషన్. అదిగు ర్తుంచుకొని ప్రవర్తించితే మంచిది. రంగయ్యా ఇద్దరు కానిస్టేబుల్స్‌ను తీసికెళ్ళి ఆ శివా జీరావుగారిని అరెస్టుచేసి తీసుకురా. ఊఁ! వెళ్ళు త్వరగా.

సబ్ ఇన్స్పెక్టరు చెప్పినా రంగయ్య వెంటనే కదల్లేదు.

"రంగయ్యా భయపడక. ఆయన యిప్పుడు రిటైరు ఐయిన డిప్యూటీకలెక్టరు. వెళ్ళు త్వరగా. పిల్లవాడు కూడా దొరకచ్చు" అన్నాడు సబ్ ఇన్స్పెక్టరు.

"ఏమిటి శివాజీరావుగారు రిటయిరు అయ్యారా సార్! ఇంక ఆయన్ని నిముషాలలో మీా ముందు నిలబెట్టకపోతే నన్ను హెడ్ రంగయ్య అనిపిలవకండి" అతను యిద్దరు కానిస్టేబుల్స్‌ను తీసుకొని వెంటనే అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

. శివాజీరావుగారు మంగాయమ్మగారి యింటివద్ద వున్న విషయం బాబు దొరికిన వివరాలన్నీ తెలియటంతో సబ్ ఇన్‌స్పెక్టరు శేఖరును శివాజీరావును అరెస్టు చేశాడు. దిలీప్‌ను యింటికి వెళ్ళి తమ పనులన్నీ చూసుకొని మరునాడు వివరాలు చెప్పమన్నారు.

"బాబూ నిన్నెవ్వరెత్తుకెళ్ళారు" అడిగాడు సబిన్‌స్పెక్టరు.

ప్రభ చంకలో వున్న బాబు, తల్లి చేతుల్లోనుంచి క్రిందికి దిగి, శివాజీరావుగారి దగ్గరకు పారుతూ వెళ్ళాడు. ఆయన ప్యాంటు పట్టుకొని లాగాడు"

పోలీసుస్టేషన్‌లో వున్న సబిఇన్‌స్పెక్టరు తత్తిమా పోలీసులు బాబు తెలివికి విస్తుపోయారు.

"బాబు అన్నీ సైగతో నిరూపించ గలడు, కానీ మాటలురావు కదా అందుకే చెప్పలేడు" అన్నాడు దిలీప్.

"బాబూనిన్నెత్తుకెళ్ళి ఎవరికిచ్చాడాయన?" అంటూ అడిగారు ఇన్‌స్పెక్టరు ఈసారి.

బాబు చక్కగా పాకుతూ వెళ్ళి శేఖర్‌ను పట్టిలాగి

అతనికాళ్లు కదలబోయాడు. అంతలో ప్రభ వచ్చి బాబు నెత్తుకుంది.

"అది సరే నువ్వు ఆ చీకట్లో మర్రిచెట్టు దగ్గరనుంచి ఇంటికి ఎలా వచ్చావు?" మళ్ళీ అడిగాడు ఇన్స్పెక్టరు.

బాబు తల్లి చంకలోనుంచి క్రిందికి జారాడు. అతను పాకుతూ పోలీసు స్టేషన్ దాటాడు. రోడ్డుమీద పాకుతూన్న బాబు మోకాళ్ళు కొట్టుకుపోతున్నాయి. అందుకే ప్రభ బాబునెత్తుకుంది. తల్లి చంకలోవున్న బాబు దారి తెలిసిన వాడిలా వేలితో వారు వెళ్ళవలసిన దారి చూపించుతూ వుంటే వారంతా ముందుకు నడిచారు. అతను వారినందరిని పాడుబడ్డ శివాలయం ఊడల మర్రిదగ్గరకు తీసికెళ్ళాడు. అక్కడనుంచి వారికి ఇంటిదారి కూడా చూపించాడు.

సరైనసాక్ష్యాధారాలు దొరకడంతో పోలీసు కేసు శివాజీరావు మీద అతనికొడుకు శేఖర్ మీద పెట్టారు. కేసు విచారణకు వచ్చింది. బాబు మాట్లాడలేకపోయినా విషయాన్నంతా యాక్షన్ ద్వారా జడ్జిగారికి అర్థమయ్యేలా చేశాడు.

దాంతో శివాజీరావు, శేఖర్ దొంగలుగా తేలిపోయారు. పిల్లవాడిని అపహరించిన నేరానికి, మోసం చేసి లక్షరూపాయలు కాజెయ్యడానికి ప్రయత్నం చేసినందుకు ఆ తండ్రి కొడుకులకు చెరో సంవత్సరం జైలు శిక్షవిధిస్తూ

తీర్పు ఇచ్చాడు జడ్జిగారు, శిక్ష వెంటనే అమలు పరిచారు.

# 9

అణుశక్తి లేబరేటరీ పేలిపోయిన తరువాత డాక్టర్ యాదవ్, డాక్టర్ రామారావు, డాక్టర్ శాస్త్రిగార్ల కోసం ప్రభుత్వం అన్వేషణకు ఆరంభించింది. కాని వారి జాడ ఎక్కడా కనిపించలేదు. ప్రయోగశాలతో పాటు వారూ కాలిపోయివుంటారన్న నిర్ణయానికి వచ్చి సైంటిస్టులను గురించిన వివరాల సేకరణలో ఎవ్వరూ అంత ఆసక్తి చూపించడంలేదు.

రెండు సంవత్సరాల తరువాత అమెరికా వార్తా పత్రికలు రేడియోలు అన్నీ డాక్టర్ శాస్త్రిని గురించిన వార్తను పెద్దగా ప్రచారం చేశాయి. ఎప్పుడో అణుపరిశోధనలో అంతు తెలియకుండా పోయిన డాక్టర్ శాస్త్రిరాక అమెరికానే కాదు ప్రపంచాన్నంతా ఆశ్చర్య పరచింది. పేపరువాళ్ళు, రేడియోవాళ్ళు ఇతర ప్రముఖులు డాక్టర్ శాస్త్రిగారితో ఇన్‌టర్‌వ్యూల కోసం తహతహ లాడారు. ప్రజలు పత్రికలు అంత ప్రాధాన్యత ఇస్తున్నందున అమెరికా ప్రభుత్వం కూడా డాక్టర్ శాస్త్రిగారితో కొందరు ప్రముఖులకే ఇన్‌టర్‌వ్యూలు ఏర్పాటుచేసింది, పత్రికల వాళ్ళు రేడియోవాళ్ళు డాక్టర్ రావుగారిని ప్రశ్నలడుగుతు న్నారు. ఆయన సమాధానాలు చెపుతూనే వున్నారు.

ప్రశ్నలు సమాధానాలతో డాక్టర్ రావుగారు విసిగిపోయారు. అసలే నీరసించి పోయినట్లు కనిపిస్తున్న డాక్టర్ రావు గారికి విసుగుపుట్టింది. అందుకే ఆయన వారందరినీ చూస్తూ.

ఫ్రెండ్స్. మీరు నన్ను వేలకొలది ప్రశ్నలు వేస్తున్నారు. అడిగిన ప్రశ్నే అడిగి నన్ను బాధపెట్టకండి. అందుకే నేను జరిగిన చరిత్ర అంతా చెపుతాను. అదివిని మీ కేదన్నా అనుమానాలుంటే అడగండి. అలా మీరు అంగీకరిస్తే, జరిగిన విషయమంతా చెపుతా లేకపోతే మీ దారి మీది నా దారినాది" అన్నాడు.

ఇంక గత్యంతరం లేక డాక్టర్ శాస్త్రిగారి కథ వినడానికి వారందరూ అంగీకరించారు. ఆయన జరిగిన విషయాన్ని చెప్పనారంభించాడు.

"ఫ్రెండ్స్, నేనూ నాతోపాటు డాక్టర్ యాదవ్ డాక్టర్ రామారావు డాక్టర్ దిలీప్‌కుమార్, డాక్టర్ అయ్యంగార్ అణుశక్తిని సామాన్య ప్రజోపయోగానికి ఎలా పనికి వస్తుందోనని పరిశోధనలు ఆరంభించాం. విపరీతమయిన అణుశక్తిని పెన్‌టార్చి లాంటి దాంట్లో బిగించి, అవసరాన్ని బట్టి స్విచ్చి నొక్కి అణుశక్తిని వాడుకునే పద్ధతిని రూపొందించనారంభించాం.

ప్రయోగాలు జరుగుతున్నాయి. చాలాసార్లు మా ప్రయోగాలు విఫలమయ్యాయి. కాని మేమంతా పట్టుదలతో

ప్రయోగాలు చేస్తున్నాం. భారత దేశపు పరిశోధకులు ఘన కార్యం చేశారన్న కీర్తి మా దేశానికి, మాంతూ దక్కా లని మేమంతా పట్టుదలతో పని చెయ్యనారంభించాం. ప్రతిసారి టరన్ ప్రకారం ముగ్గురు సైన్‌టిస్టులం మాత్రం పని చేసేలా ఏర్పాటు చేసుకున్నాం.

నాకు రెండవరోజు తెల్లవారుతూనే ఆరు గంటలకు డ్యూటీ వుండటంతో పెందలాడే పండుకున్నాను. కొంత సేపు నా దేశంలోవున్న భార్య పిల్లలు గుర్తొచ్చారు. పరిశోధన పూర్తి అయిన తరువాత వాళ్ళసందరినిఇక్కడకు పిలిపించాలని నిర్ణయించుకున్నాను. తరువాత ప్రయోగం గురించి ఆలోచిస్తూ నిద్రలోకి జారిపోయాను.

అర్ధరాత్రి దాటింది. చెవులు పగిపోయేలా కాలింగ్ బెల్ మోగుతూవుంది. నేను విసుగ్గాను, బద్ధకంగానూ లేచాను. నేనున్నదో చిన్న బంగళా. వంట అది, నేనే చేసు కుంటూవుండేవాడిని. అందువల్ల నా దగ్గర నౌకర్లెవరూ లేరు. ఇంక తప్పని సరికావడంతో, లేచి లైటు స్విచ్చి వేసి తలుపు తెరిచాను.

నాకళ్ళను నేనే నమ్మలేకపోయాను. నల్లగా మెరుస్తూ కాలసర్పంలా వున్న రివాల్వరు నా గుండెలకు ఆనుకుంది. వెంటనే నల్లని ముసుగులు ధరించిన, నలుగురు మనుషులు నన్ను లోపలకు నెట్టి తలుపుమూశారు.

"ఎవరు మీరునన్నెందుకిలా చేస్తున్నారు?" అంటూ అరిచాను.

"ప్రాణాలమీద ఆశలుంటే అరవకు. సైలన్సరు బిగించిన రివాల్వరు గుండు మీ గుండెల్లో దూసుకుపోతుంది" అన్నాడా రివాల్వరు చేతులో పట్టుకున్న వ్యక్తి.

"మీకేం కావాలి. నన్ను బాధపెట్టకండి నిద్రొస్తుంది" అన్నాను.

"డాక్టర్ శాస్త్రి! మీరు చాలా మంచి వారులాగున్నారు. పేచీ లేకుండా వెంటనే వ్యవహారంలోకి దిగారు." అతడు తన, నల్లనిలాంగ్ కోటు జేబులో చెయ్యి పెట్టి పెద్ద నోట్లకట్ట తీశాడు.

"ఏమిటిది!" అన్నాను నేను.

"మీ సహాయానికి మా బహుమానం. మీరు చేస్తున్న పరిశోధనల తాలూకు వివరాలు మాకివ్వండి. పని వెంటనే జరిగిపోవాలి." అన్నాడా ముసుగు మనిషి.

నా కతని మాటలు వినగానే వొళ్ళు మండింది. వాళ్ళు నన్ను బలవంతం చెయ్యనారంభించారు. నాలో సహనం నశించింది. వాళ్ళను నోటి కొచ్చినట్లు తిట్టి, ఏమరుపాటులో వున్న అతని చేతిలో వున్న రివల్వారు లాగేసుకున్నాను.

"జాగర్త, కదిలితే కాలుస్తా. చేతులెత్తండి." అంటూ నేను, నెమ్మదిగా టెలిఫోను వున్న చోటికి జరగబోయాను. కాని వెనుక నుంచి నానెత్తిన బలమయిన దెబ్బ పడింది. అంతే నా కళ్ళు తిరిగాయి. నేను క్రింద పడిపోయాను. అలా, నేను ఎంతసేపున్నానో నాకే తెలియదు.

నేను కళ్ళు తెరిచేసరికి మంచం మీద పడుకొని వున్నాను. తల మీద తగిలిన దెబ్బ చాలా బాధగా వుంది. ఎలాగో ఓపిక చేసుకొని తల ఎత్తి చుట్టూ చూశాను. నల్లటి ముసుగుల్లో పదిమంది దాకా నాచుట్టూ నిలబడి వున్నారు. అందులో ఒకతను నాకు దగ్గరగా వచ్చి,

"డాక్టర్ శాస్త్రి అనవసరంగా ఎందుకు చెడిపోతావు? జీవితంలో ఏది చేసినా డబ్బు కోసమేగా. నీకు కావసినంత ఇస్తాం. నిన్ను సురక్షితంగా మా దేశం చేరుస్తాం. మా మాట విను. భార్య బిడ్డలతో హాయిగా కాలంగడుపు" అన్నాడు.

నాకు మరీ కోపం వచ్చింది. వారిని తిట్టడమే గాక వాళ్ళ మీద కలియబడ్డాను. ఫలితం వాళ్ళు నన్ను వదలకుండా తాళ్ళతో కట్టేశారు. నన్ను, చాలా బాధపెట్టారు. కానీ వాటినన్నిటిని సహించాను. రహస్యం మాత్రం చెప్ప తలచలేదు.

"డాక్టర్ శాస్త్రి నేనొక ఉపాయం చెప్తా విను- దాంతో నీకు ప్రమాదముండదు. మా మాట దక్కించిన వాడివౌతావు" అన్నాడు వాళ్ళ నాయకుడు.

అలా వాళ్ళ చేతుల్లో నరకయాతన బాధలు పడే దానికన్నా ఎలాగో వాళ్ళ కళ్ళు కప్పి తప్పించుకోవాలనిపించింది. ఆ ప్రయత్నంలో నా ప్రాణాలు పోయినా వీళ్ళు పెట్టే బాధలు తప్పుతాయిగదా అనుకున్నాను. అందుకోసమే వాళ్ళ నాయకుడ్ని విషయం చెప్పమన్నాను.

"మరేం లేదు. మీ ప్రయోగశాలఫైర్ పోయింది. అందులో నీతో పాటు డాక్టర్ యాదవు" డాక్టర్ రామారావు కనిపించ కుండా కాలిపోయారని ప్రపంచ మంతా తెలిసిపోయింది ఇదిగో కావలిస్తే ఈ పేపర్లు చూడు" అంటూ నా ముందు ఇన్ని పేపర్ల కట్ట పడేశారు.

నేను ఆత్రంగా పేపర్లన్నీ చదివాను. వాస్తవం తెలిసిపోయింది. మేము చేసే ప్రయోగానికి ముగ్గురు సైన్టిస్టులు ఎప్పుడూ అవసరంగా వుండాలి. నేను లేకపోతే నా బదులు డాక్టర్ జలీప్కుమార్ పని చేస్తాడు. నా ముగ్గురు మిత్రులతో పాటు ప్రయోగశాల, ప్రయోగ విశేషాలు కాయితాలు కాలిపోయి వుంటయి నాకు చాలా విచారం వేసింది.

"డాక్టర్ శాస్త్రి అలా విచారిస్తూ కూర్చుంటే ఏం లాభం. ప్రపంచానికి నువ్వొక చచ్చిన వాడితో సమానం. కాబట్టి నువ్వు విషయాన్ని మాకు ధైర్యంగా చెప్పు. మాతో సహకరించావా మా దేశంలో నేవుండొచ్చు. నీ భార్య బిడ్డలను కూడా నిమిషాల్లో తెస్తాం అన్నాడు వాళ్ళ నాయకుడు.

నేను కొంచెంసేపు ఆలోచించాను. నేను కాదంటే వీళ్ళు నా భార్యా బిడ్డలను కూడా ఎత్తుకొచ్చే టట్లున్నారు అందుకే వాళ్ళతో రాజీ పడినట్లుగా మాటలు సాగించాను.

వారం రోజులలో వాళ్ళు నన్ను పూర్తిగా నమ్మేలా చేశాను.

"చూడండి నన్నిలా కష్టపెడితే ఏంలాభం? కావలసిన కాయితాలు. అవి ఆ పరిశోధనశాలలో కాలిపోయి వుంటయి. అందుకే నాకు కావలసిన పరికరాలు వుంటే ఇక్కడే పరిశోధన సాగిస్తా. మరో విషయం మీలో వున్న సైన్‌టిస్టులలో పెద్దవాళ్ళను నాకు సహాయంగా ఇవ్వండి" అడిగాను.

వారు నా సూచనకు అంగీకరించారు. నాకు కావలసిన వస్తువులన్నీ ఎంతో త్వరగా తెప్పించారు. నాకు సహాయంగా ఇద్దరు సైన్‌టిస్టులను కూడా తోడిచ్చారు. నేను ప్రయోగాలు ఆరంభించాను. నేను ఏ దేశంలో వున్నానో నాతో వున్న వాళ్ళెవరో తెలుసుకోడానికి ఎంతో ప్రయత్నం చేశాను. కనీసం వాళ్ళు నాకు తమ ముఖాలు కూడా చూపించకుండా నల్ల ముసుగులు వేసుకొని వున్నారు.

రోజులు గడిచాయి. నేను అనేక సార్లు పారిపోవడానికి ప్రయత్నం చేశాను. కానిలాభం లేకపోయింది. ఫలితం నా మీద మరింత నిఘా వేశుంచారు. దాదాపు అలా రెండు సంవత్సరాలు గడిచిన తరువాత నేనొక చిన్న లంకలో వున్నానని మాత్రం తెలుసుకున్నాను, ఆ లంక ఏదో దేశానికి మిలిటరీ స్థావరం అని కూడా గ్రహించగలిగాను. నేను ఆలోచించి ప్లాను వేసుకున్నాను.

ప్రపంచంలో ఏమూలనయినా చిన్నదయినా పెద్ద

దయినా యాటంబాంబు పేలిస్తే అణుశక్తిప్రయోగాలు చేసే ప్రతి దేశానికీ తెలుస్తుంది. అందుకే నేను నాశత్రువులకు తెలియకుండా చిన్న సైజు యాటంబాంబు తయారుచేశాను. తరువాత వాళ్ళ నాయకుడి కోసం కబురంపాము. ఆయన వచ్చాడు.

"చూడండి, చెయ్యవలసిన దంతా చేశాను. కాని దాన్నిప్రయోగించి చూడాలి" అన్నాను.

"దానికేముంది ప్రయోగించండి" అన్నాడతడు.

"అలాకాదు. పరిశోధనకు చుట్టూ ఎనిమిది కిలో మీటర్ల దూరంలో మనుష్యులుండకూడదు. అందుకే సముద్రంలో అయితే మంచిది" అన్నాను.

వాళ్ళ నాయకుడు దానికంగీకరించాడు. రెండవరోజు తెల్లవారుఝామున పదిమంది నాతోకూడా స్టీమ్ బోటులో బయలుదేరారు. అందులో కొందరు మిషన్‌గన్స్‌తో నాకు కాపలా కాస్తున్నారు. లంకనుంచి స్టీమ్‌బోటు చాలా దూరం వెళ్ళింది. చుట్టూ సముద్రం. బోటును ఆపమన్నాను.

"ఇనుగోండి! ఈ చిన్న పెట్టెను తీసుకుని లైట్‌బోటు మీద మూడు కిలోమీటర్లదూరం పోండి, నేనిక్కడ నుండి ఈ పెన్‌టార్చ్ స్విచ్ నొక్కుతాను. తరవాత మీ లైట్‌బోటు నేను చెప్పినట్లుగా నా దగ్గరకు వస్తుంది. నేను ఎటు తిప్పితే అటు మీ బోటు తిరుగుతుంది. అపయింతరవాత ఈ స్టీమ్‌బోటులో ఉన్న ఏ వస్తువునయినా సముద్రంలో పారేస్తే

అలా అలా నీళ్ళమీద తేలుతూ మీ దగ్గరకు చేరుతుంది" అన్నాను. వాళ్ళనాయకుడు ముందుగా సరేనన్నాడు. తరవాత వారు తమలో తాము సంప్రదించుకున్నారు. నన్ను అనుమానంగా చూశాడు వాళ్ళ నాయకుడు.

"డాక్టర్! శాస్త్రి మీరు చెప్పినదానికి మాకు అంగీకారమే. కాని చిన్న అనుమానం. మీరేదన్నా మోసం చేసి మా స్టీమ్ బోటులో పారిపోతే? అందుకే మీరే లైట్ బోటులో వుండండి. మా వాళ్ళిరువురూ మరతుపాకులతో మిమ్మల్ని కాపలా కాస్తుంటారు" అన్నాడు.

"నేనిక అంగీకరించక తప్పలేదు. కాదు అనేటట్లయితే వాళ్ళు నన్నేమన్నా చెయ్యగలరు. నేనూ, నావెంట ఇరువురు కాపలావాళ్ళు లైట్ బోటులో వున్నాం. స్టీమ్‌బోటు దూరంగా వెళ్ళిపోయింది. అనుకున్న దూరం చేరగానే వాళ్ళు మాకు సిగ్నల్‌గా పైకి తుపాకి పేల్చారు. ఆ శబ్దం మాకు బాగా వినిపించింది. నేను వెను వెంటనే నా దగ్గరవున్న పెన్ టార్చిని సంచిలోనుంచి బయటికి తీశాను. దాన్ని నా రెండు చేతులతో గట్టిగా లాగాను. కాని అది రాలేదు. నా పక్కనున్న కాపలావాళ్లు నేను చేసే ప్రతి పనీ పరీక్షగా చూస్తున్నారు, నేను దాన్ని లాగటానికి ప్రయత్నం చేశాను, అది రాలేదు. నేను వాళ్ళ వేపు చూశాను. మళ్ళీ లాగటానికి ప్రయత్నం చేశాను. నా అవస్థ చూసి కాపలా వాళ్ళలో వొకడు,

"ఎని హెల్ప్ వాంటెడ్" అన్నాడు.

నేను అవునన్నట్లు తలూపాను. అతడు తన చేతిలో వున్న తుపాకి ప్రక్కవానికిచ్చి నా చేతిలోవున్న పెన్ టార్చిని తీసికొని రెండు చేతులతో లాగటానికి ప్రయత్నం చేశాడు. కాని అది రాలేదు. రెండవవాని సహాయం కూడా తీసుకోమని సలహా యిచ్చాను. తుపాకీలు రెండూ క్రింద వుంచి వారిద్దరూ పెన్‌టార్చిని లాగటానికి ప్రయత్నం చేశారు. నాకు మంచి అవకాశం దొరికింది. ఇరువురిసీ చెరో గుద్దు గుద్దాను. వాళ్ళు నీళ్ళలో పడిపోయారు. అందులో ఒకడు పయికి తేలి జేబులో వున్న మైక్రో ఫోను లాంటిది తీసి తన నోటిదగ్గర పెట్టుకోబోతున్నాడు, నేనిక ఓ నిమిషం ఆగితే ప్రమాదం ముంచుకొస్తుంది. అందుకే లైట్ బోటులో వున్న మరతుపాకి తీసుకొని అతన్ని నిర్దాక్షిణ్యంగా కాల్చేశాను. మరక్షణంలో అతడు నీళ్ళలో మునిగిపోయాడు. అంతలో రెండవవాడు లైట్‌బోటు పట్టుకొని పైకి రాబోయాడు. ఇంక గత్యంతరంలేక అతన్ని కూడా కాల్చేశాను. నాకు వెంటనే దూరాన వున్న స్టీమ్‌బోటు గుర్తుకొచ్చింది. అందుకే అంతవరకూ నా జేబులో భద్రంగా దాచి వుంచిన పెన్‌టార్చి లాంటిది తీసి వెంటనే స్విచ్ నొక్కాను. అంతే స్టీమ్‌బోటులో వున్న మినీ యాటంబాంబు పేలింది. మరు క్షణంలో ఆకాశంలో కుక్కగొడుగు లాంటి పొగలేచింది. ఇంక నేను ఆలశ్యంచేయకుండా లైట్ బోటును తోసుకుంటూ

ముందుకు పోయాను. అలాపోతున్న నాకు దూరాన విమా నాల మోత వినిపించి ది. రానున్న డేంజరు గ్రహించి నేను సముద్రంలోకి దూకేశాను. చిన్నతనంలో నేర్చుకున్న ఈత నాకు అప్పుడు బాగా ఉపయోగపడింది. అలా నీటిలో మునిగి తేలుతున్న నేను నాకు దగ్గరగా వెళుతున్న ప్రతి విమా నాన్ని గమనిస్తున్నాను. ప్రొద్దుకూకే వేళ అమెరికా విమా నం ఆకాశంలో ఎగరటం చూశాను. నేను మామూలుగా లైఫ్ బోటు ఎక్కి వేసుకున్న బుష్‌షర్టుతీసి గాల్లో వూపాను. నా అదృష్టం బాగుంది. విమానంలో వాళ్ళు నన్ను చూశారు. చాలా తక్కువ ఎత్తులో ఎగురుతూ నా కోసం వాళ్ళు నిచ్చెన వేశారు. అది అందుకొని ఇలా మీ అందరి మధ్యకూ వచ్చాను. కానీ నా బాల్యమిత్రుడు, నా సహచ రుడు, అనుకోకుండా నా కోసం తన ప్రాణాలను వదిలిన దిలీ ప్‌కుమారుకి నేనెంతో ఋణపడివున్నాను" అన్నాడు డాక్టరు శాస్త్రి.

ఆ రెండవరోజే పత్రికలవాళ్ళు తాటికాయంత అక్షరా లతో డాక్టరు శాస్త్రిగారు చెప్పిందంతా ప్రచురించారు. అనుకోకుండా అదృశ్యమయిపోయిన దిలీప్‌కుమారు కోసం ప్రభుత్వం అన్వేషణ ఆరంభించారు.

పేలుడు జరిగిన రోజున దిలీపు తన యింటికి వేసిన తాళం అలాగేవుందా అని అధికారులు పరీక్షించబోయారు. కానీ తాళం తీసివుంది. ప్యాడ్‌లాక్ మాత్రం బిగించి వుంది.

వాళ్ళు అనుమానంగా లోపలంతా సోదా చేశారు. యింట్లో ఖరీదయిన వస్తువులేవీ పోలేదు. బట్టల బీరువా తెరిచి వుంది. దాంట్లో అన్ని బట్టలు వున్నవో లేవో ఎవ్వరికీ తెలియలేదు. కానీ గదిలో మాత్రం నెత్తురుతో తడిసిన బూటు మరకలు మాత్రం కనిపించాయి? కాలి గుర్తులు ఇంట్లో నుంచి బైటి కొచ్చాయి. రెండేళ్ళ కాలం గడిచిపోవడంతో బైటికొచ్చిన కాలిగుర్తులు కాలగర్భంలో కలిసిపోయాయి. ఇంక పోలీసులు ఆ ప్రయత్నం నుంచి విరమించుకున్నారు.

విషయం తెలిసిన యాటమిక్ రీసెర్చి వారికి మాత్రం డాక్టరు దిలీపు కుమార్‌ని గురించి అనుమానం వేసింది. తమతోపాటు ప్రపంచంలో మరి రెండు దేశములు అణుపరీక్షలు చేస్తున్నట్లు వార్తలందడంతో దిలీపును గురించిన అనుమానాలు ఎక్కువయ్యాయి.

డాక్టర్ దిలీపు తమ శత్రుదేశములలో ఎక్కడో వుండి వుంటాడని వారికి గట్టి నమ్మకం ఏర్పడింది. దాంతో వారు దిలీపు కోసం ప్రపంచమంతా వలవేసి గాలించనారంభించారు.

# 10

"ప్రభా!"

"ఏమిటండీ?"

"బాబెక్కడ?"

"మామ్మవెంట గుడికెళ్ళాడు"

"గుడా! ఇప్పటినుంచే వాడికి గుడి గోపురాలు చూపించి మతం అనే మత్తుమందు ఇప్పటినుంచే పోస్తే..."

"చాల్లెండి, మానవుడు కట్టుబాట్లలో వుండాలంటే మతం చాలా ముఖ్యం. కట్టుబాట్లు లేని మానవజీవితం తెగిన గాలిపటంలా అలా అలా ఎగురుతూపోతుంది ఏ చెట్టు దొరికితే ఆ చెట్టుకు చుట్టుకుంటుంది"

"అబ్బా! యీ మతాలపేరుతో ఎంతమంది కూపస్థ మండూకాలయిపోయారో తెలుసా? మత్తు పదార్థాలు అలవాటయితే మానడం కష్టం. అలాగే మతం పిచ్చి, ప్రేమ పిచ్చి" అన్నాడు దిలీపు.

ఆ మాట అనగానే ప్రభ ఏదో అనబోయింది. కానీ బయటనుంచి గాలి చాలా విసురుగావచ్చింది. తిరుగుతున్న ఫ్యాను గాలికి తోడు బయటగాలి తోడయింది గోడకున్న క్యాలెండరులన్నీ ఉయ్యాలలూగుతున్నాయి సత్యభామను ఆప్యాయంగా ముద్దు పెట్టుకుంటున్న కిృష్ణుడి క్యాలెండరు మాత్రం గాలిలోకి లేచింది. అది ఎగురుతూ వెళ్ళి ప్రభ, దిలీపులు కూర్చున్న సోఫాలో వారిద్దరిమధ్య పడింది. దిలీపు, ప్రభ వొకరినొకరు చూసుకున్నారు. అప్రయత్నంగా వారిద్దరూ నవ్వుకున్నారు.

"ప్రభా! పెద్దమ్మ, బాబూ బయటకెళ్ళి ఎంతసేపయింది?"

"అరగంటయింది"

"దిలీపు అప్రయత్నంగా ఆమె చెయ్యి పట్టుకున్నాడు. అతని కళ్ళు మత్తుగా మూతలు పడుతున్నాయి.

"ఏమండోయి అపర కృష్ణుడుగారూ, ఇది పట్టపగలు. ఇది గోకులం కాదు. అచ్చంగా మంగాయమ్మగారి ఇల్లు" అన్నది నవ్వుతూ.

దిలీప్ ఆమె మాటలేవీ వినిపించుకోలేదు. ప్రభ చెయ్యి పట్టుకొని ఆమెనుకూడా లేపాడు. ఇంక గత్యంతరం లేక ప్రభ అతని వెంటపడింది. వాళ్ళిద్దరూ బెడ్ రూముకు చేరారు. వాళ్ళిద్దరూ లోపలికి వెళ్ళగానే దిలీపు గది తలుపు బిగించాడు.

"అయ్యో! దిలీపుగారూ! ఏమిటీ ఇలా కొత్తగా ప్రవర్తిస్తున్నారు. మీ పెళ్ళయి రెండు సంవత్సరాలు. మీకు ఓ పిల్లవాడున్నాడు, కొత్తపెళ్ళికొడుకులా అనుకోకండి" అన్నది.

"ప్రభా"

"చెప్పండి హీరోగారూ! ఏమిటి మీ బాధ?"

"మనం ఎప్పుడూ చిలకాగోరింకల్లా ఇలా వుంటే ఎంత బాగుంటుంది" దిలీపు ఆమెను కౌగలించుకున్నాడు.

"బాగుంది. మనం చిలకాగోరింకల్లా వుంటే పుట్టిన కోయిల పిల్లల్ని పెంచటానికి కాకుల కప్పగిస్తామా?" అంటూ ఆమె విసుగ్గా భర్త కౌగిలి విడిపించుకుంది.

“ఉండండి, నాకు చాలా పనుంది. సాయంత్రం వంట ప్రయత్నం చూడాలి. ఇప్పటికే పొద్దుగూకుతూ వుంది. వస్తా. టాటా” ఆమె గడియ తీయబోయింది.

కాని దిలీపు ఆమెను ఆ ప్రయత్నంనుంచి దూరంగా లాక్కెళ్ళాడు.-పిచ్చివాడిలా ఆమెను ముద్దులలో ముంచేస్తున్నాడు. ఊపిరి సలపని ప్రభ ముక్కు మధ్య భర్తను ఆగమన్నట్లు బ్రతిమాలుతుంది, కానీ దిలీప్ అవేమీ పట్టించుకోవడం లేదు ఇక అతన్ని ఆపడానికి ప్రభ ఎలాంటి ప్రయత్నం చెయ్యలేదు. దిలీపు ఆశగా బెడ్ వైపు చూశాడు. ప్రభ అదేమీ గమనించకుండా కళ్ళు మూసుకుంది.

వేసిన తలుపుమీద ఎవరో కొడుతున్నారు, దిలీపుకు వొళ్ళు మండిపోయింది. ప్రభ కంగారుగా కళ్ళు తెరిచి చూసింది, భర్త కౌగిలి విడిపించుకుని తలుపు దగ్గరగా వెళ్ళింది.

“ఎవరది?”

“నేనేనమ్మా, టీ పట్టుకొచ్చాను” అన్నది వంట మనిషి.

ఆమె కప్పులు రెండు వున్న ట్రే గదిలో బల్లమీద పెట్టి వెళ్ళిపోయింది. టీకప్పు దిలీప్‌కు అందించి తాను టీ చప్పరిస్తూ కూర్చుంది ప్రభ. అనుకోకుండా ఆమెచూపులు దిలీపు మీద పడ్డాయి. అతని కళ్ళు ఎర్రగా వున్నాయి. దాంతో ఆగక అతడు భార్యవేపు కోపంగా చూస్తున్నాడు. ప్రభకు నవ్వొచ్చింది.

"ఏమిటలా చూస్తారు?"

అతడు మాట్లాడలేదు. వేడివేడి టీ రెండు గుక్కల్లో తాగేశాడు. ఖాళీ కప్పు సాసరు బల్లమీద పెడుతూ.

"చూస్తే తప్పా. కస్సుబుస్సులాడుతుంటావా"

"ఎందుకండీ అంత కోపం? టీ రెడీ అయింది కాబట్టి వంట మనిషి టీ తెచ్చింది."

"ఏడవలేక పోయిందీ తలుపు వేసివుందికదా అని కొంచెం మర్యాదగా వుండొద్దూ"

"ఏమండీ, మీరు చెప్పిందీ పాయింటే మనమొక పని చేస్తే"

"ఏమిటది?" అడిగాడు దిలీపు.

"తలుపుకో బోర్డు పెడదాం ఇన్. ఔట్ లాంటి బోర్డుకు బదులు తలుపు అనే అక్షరాలు బోర్డుపైన వ్రాయించి, దాని క్రిందగా "పిలుపుము పిలవకండి" అని వ్రాయిద్దాం. మన యిష్ట ప్రకారం ఆ బోర్డు సరిచేస్తే బయటనుంచి వచ్చినవారు బోర్డు చూసి అలా చేస్తారు"

ఆమె మాటలకు అతనికి కోపం వచ్చింది లాగుంది. మాతి బిగించుకొని కూర్చున్నాడు, ఇంకా తాను భర్తతో పరాచకాలాడితే అతనికి కోపం వస్తుందని గ్రహించింది. అందుకే భర్త కోపం ఎలా పోగొట్టాలా అని ఆలోచిస్తూ కూర్చుంది.

టాఫిక్ ఎక్కువగా వున్న రోడ్డు ప్రక్కగావుంది

మంగాయమ్మగారిల్లు. సామాన్యంగా ఆ ప్రాంతంలో ట్రాఫిక్ ఉదయం తొమ్మిదినుండి పదకొండువరకు సాయంత్రం నాలుగు నుంచి ఆరు వరకు ఎక్కువగా వుంటుంది. ఆ వేళల్లో కారు హారనులు, రిక్షామోతలు, సైకిల్ బెల్ చప్పుళ్ళు ఎక్కువగా వినిపిస్తుంటాయి.

కాని ఆ వేళప్పుడు కారు హారన్లు విపరీతంగా మోగు తున్నాయి. రాను రాను మోతలు ఎక్కువయ్యాయి. ఆలోచనల్లోవున్న ప్రభకు ఈశబ్దాలకు తలనొప్పివచ్చినంత పనయింది. దాంతో ఆమె సోఫాలో నుంచి లేచి కిటికీ దగ్గరకు వచ్చి విండోకర్టన్ కొంచం ప్రక్కకు తొలిగించి క్రిందికిచూసింది. ట్రాఫిక్ చాలావరకు బంద్ అయింది. ట్రాఫిక్ పోలీసులు హడావుడిగా అటుఇటు తిరుగుతున్నారు. అలాచూస్తున్న ప్రభకు ఏంకనిపించిందో ఆమెకు.

"ఏమండి, బాబాండి....., బాబూ భానుప్రకాష్" అంటూ అరిచింది.

దిలీప్‌కు ఇదేమీ అర్థం కాలేదు. అతడు కిటికీ దగ్గరకు పరుగెత్తి భయంగా క్రిందికి చూశాడు.

తప్పటడుగులు వేస్తూ భానుప్రకాష్ పోలీసులకు అందకుండా, అక్కడ ఆగిన కార్ల మధ్యనుంచి అటుఇటు పరుగెత్తుతున్నాడు, అదిచూసిన భార్యాభర్తలకు కర్తవ్యం తోచలేదు.

"బాబూ జాగ్రత్త. కాళ్లు సైకిళ్ళు ఢీ కొడ్తాయి" వారు మేడమీద నుంచి కేకలు వేస్తున్నారు. వారి కేకలు క్రింది వారికి వినిపించినట్లులేదు. ట్రాఫిక్ పోలీసులకు దొరకకుండా తప్పించుకు తిరుగుతున్న బాబును పట్టుకోటానికి కొందరు ప్రజలు కూడా ముందుకొచ్చారు. అలా కాకపోతే ట్రాఫిక్ కొంచెం కూడా ముందుకు కదిలే అవకాశం లేకపోయింది. పోలీసులతో పాటు, జనం కూడా తన వెంటబడిన విషయం తెలిసిన బాబు, మంగాయమ్మగారి ఇంటిగేటుదాకా పరుగెత్తుకొచ్చాడు. వారంతా తనను వెంబడిస్తున్నారా లేదా అని బాబు మరోమారు వెనుదిరిగి చూచాడు. వారందరూ తన్ను వెంబడిస్తున్నారు.

బాబు చిలిపిగా నవ్వి ఇంటిలోకి పరుగెత్తబోయాడు. కానీ మంగాయమ్మగారి ఆవరణకున్న ఇనుపగేటు మూసి వుంది. బాబు వో క్షణకాలం ముందు వెనుకా చూచాడు. గేటు యినుప ఊచలతో అందమైన డిజైను తయారు చేసి వుంచారు. బాబు గేటు దగ్గరగా వెళ్ళాడు. అతడు దూరటానికి సరిపడ ఖంతవుంది. దానిగుండా అతడు లోపల దూరాడు. దాంతో టిఆగక బాబు మళ్ళీ వెనుదిరిగి పోలీసులను, జనాన్ని చూసి నవ్వుతూ, వారిని రమ్మనమని పిలుస్తున్నాడు.

జనంతో పాటు కొంతమంది పోలీసులకు కోపము వచ్చింది వారు ఇనుపగేటు తెరవటానికి ప్రయత్నించారు.

కాని అది లోపల గడియపెట్టివుంది. గడియ ఎక్కడున్నదో వారికి అర్థంకాక తెల్లముఖాలు వేశారు. కొందరు

గేటు ఎక్కి లోపల దిగటానికి ప్రయత్నం చేస్తున్నారు. ఇంక అక్కడ ఆగకుండా బాబు ఇంటిలోకి వెళ్ళిపోయాడు.

అంతవరకూ నిలిచిపోయిన ట్రాఫిక్ నదీజలాల్లా మళ్ళీ నడక ఆరంభించాయి. బాబు మెల్లెక్కి వస్తుంటే, అతని కోసం ఎదురు చూస్తున్న దిలీప్కు, ప్రభకు మాట రాలేదు, అతడు దగ్గరకు రాగానే ప్రభ అతనిని ఎత్తుకుంది.

"బాబూ ఎలా వచ్చావురా? మామ్మేది?" అంటూ ప్రశ్నల వర్షం కురిపించింది.

కాని మాటరాని బాబు "ఊ....ఆ" అంటూ సమాధానాలు చెప్పాడు. మళ్ళీ గేటుదగ్గర కేకలు వినిపించడంతో ఆ భార్యా భర్తలు కిటికీ దగ్గరకు వెళ్ళి చూచారు. గేటు తెరిచి వుంది. మంగాయమ్మగారిని, జనం పోలీసులు గట్టిగా ప్రశ్నిస్తున్నారు. ఆమె వారికి నమస్కరిస్తూ క్షమాపణ చెప్పు కుంటోంది. తతంగమంతా ముగిసేసరికి గంట పట్టింది. ఇంటి లోకి అడుగుపెట్టిన మంగాయమ్మగారికి ఎదురు వెళ్లింది ప్రభ.

"మామ్మా బాబునెక్కడ వదిలేశావు?" ఎంత ప్రమాదం జరిగేది. నడిచే సైకిళ్ళు, పరుగెత్తే కార్లు బస్సులు, లారీలు ఎంత ప్రమాదం" ప్రభ మాటలు కోపంగా వున్నాయి.

మంగాయమ్మగారు వో క్షణకాలం, ప్రభను, దిలీప్ను, బాబును తీక్షణంగా చూసింది.

"ఆగవే, అమ్మా, నీ కొడుకు అసాధ్యుడు. పళ్ళు, పూలు, కొన్నవారికి డబ్బులిద్దామని వాడినికిందికి దించాను, డబ్బులిచ్చి చూద్దునుగదా, బాబు కనిపించితేనా, నేనూ, పని మనిషి బజారు దేవాలయం, అంతా పిచ్చివాళ్ళంలా వెదికాం. ఎక్కడన్నా కనిపిస్తేనా, విషయం మీకు చెప్పి పోలీసు రిపోర్టు యిద్దామనీ ఇక్కడికి వస్తే, పోలీసులు జనం అంతా గోల. బాబు రోడ్డుకడ్డంగా నడుస్తూ, ట్రాఫిక్ అంతా ఆపేశాడని ఫిర్యాదు వాళ్ళందరికీ టోపీపెట్టి గేటుగుండా దూరి వచ్చాడట. వీడికోసం నేను క్షమాపణ చెప్పుకున్నాను" అంటూ వెళ్ళి సోఫాలో కూర్చుని, తల రెండు చేతులతో పట్టుకుంది.

"మామ్మా ఏదయినా పిల్లవెధవను బజార్లో జాగ్రత్తగా చూసుకొని వుండవలసింది" అన్నది ప్రభ.

"అవును తల్లీ నిజమే. సంవత్సరం కూడా నిండని, నీ కొడుక్కి యింటిదారి ఎలా తెలిసిందంట. నాకదే అర్థంకావటంలేదు." బాబుని ఆశ్చర్యంగా చూసింది.

"అమ్మా, తమర్నెవరినన్నా పిలవమని ఎవరో వచ్చారమ్మా" చెప్పింది నౌకరు.

"ఎవరది?" అడిగింది మంగాయమ్మగారు.

"ఎవరో దొరల్లా వున్నారమ్మా" అన్నది.

"దొరలా, అలాగయితే దిలీప్! వెళ్ళు బాబూ. నాకేం తెలుస్తుందా యింగ్లీషు" అన్నది మంగాయమ్మగారు.

యిక గత్యంతరం లేక దిలీపు క్రిందికి దిగాడు. అక్కడ కూర్చున్న వారిని చూసి వో అడుగు వెనక్కు వేశాడు. కాని అతని రాకను వారు గమనించారు.

"గుడ్ మార్నింగ్" అన్నారు వాళ్ళు ముక్తసరిగా. ఇంక దిలీపుకు గత్యంతరం లేక వారిని తను విధంగా పలకరించి వారి ప్రక్కనే కూర్చున్నాడు. తరవాత

"వెల్ వ్హాట్ కెన్ అయిడూ ఫర్ యూ?" అన్నాడు.

వారు అమెరికా నుంచి వచ్చామని చెప్పారు. వారు వ్యాపారస్థులమని చెప్పారు. అలా మాటలు సాగిన తరవాత వారికి మర్యాదగా కాఫీ బిస్కట్లు యిచ్చాడు దిలీపు.

తరవాత సంభాషణ మరికొంత సాగింది. దాంతో వారు ఆగలేదు. సంవత్సరం కూడా నిండని బాబు బాగా ట్రాఫిక్ వున్న బజార్లలో తిరుగుతున్న విషయాన్ని గురించి మాట్లాడుకున్నారు. ఆ బాబు తన కొడుకేనని దిలీపు వారికి గర్వంగా చెప్పుకున్నాడు.

"బాబునొకసారి చూడాలని వచ్చాం" అన్నారు వాళ్ళు యింగ్లీషులో.

"ఓ యస్, ష్యూర్" అంటూ బాబును క్రిందికి తీసుకురమ్మనమని కేక వేశాడు దిలీపు.

కొద్ది నిముషాలలో బాబు నెత్తుకొని ప్రభ కిందకి దిగింది. దిలీపు ఆమెను వచ్చిన వారికి పరిచయం చేశాడు. నమస్కార ప్రతి నమస్కారాలు జరిగాయి. ఆ వచ్చిన

వారిలో వొకతను బాబుని రమ్మని సైగ చేశాడు. కాని బాబు రాలేదు. వారిని చూస్తూ తల్లికి అతుక్కుపోయాడు. కాని వచ్చినవారు ఊరుకోలేదు. అందులో వొకతను తన జేబులో నుంచి చిన్న టార్చి లైటు లాంటి దాన్ని తీసి బాబుకు చూపిస్తూ,

"కమాన్ మై బోయ్, టేకిట్" అంటూ బాబుకు దగ్గరగా పెట్టాడు. బాబు దాన్ని ఆశగా అందుకోడానికి చెయ్యి ముందుకు చాచాడు. అంతలో టార్చిలైటు లాంటిది వెలిగింది. బాబు భయంగా చెయ్యి వెనక్కి లాక్కున్నాడు. అది చూసిన దిలీప్ కళ్ళు ఎర్రబడ్డాయి. కాని దిలీపు ఆ టార్చి లాంటి దాన్ని వారి దగ్గరనుంచి తీసుకున్నాడు. అది వెంటనే వెలిగింది. అతడు బాబును ఆడించాలన్న నెపంతో అతని వద్దకు వెళ్ళి,

"బాబూ, ఇంద లైటు, తీసుకో. అమెరికా మామయ్యలు యిచ్చారు" అంటూ బుజ్జగించి దాన్ని బాబుచేతికిచ్చాడు. టార్చి అలాగే వెలుగుతూవుంది.

"మా బాబు చాలా మంచివాడు, వీడికి యింకా మాటలు సరిగా రావు. అయ్యో నామతిమండ నేను తెలుగులో చెప్పాను. మరేమయినా అర్థమయిందా బాబూ" అంటూ అప్పుడే మేడమీదనుంచి దిగివచ్చిన మంగాయమ్మగారు వారినడిగింది.

"హింత బాగా రా....రాదు....మేడం....బట్ అర్థం అండర్ స్టాండ్....అవుతోంది" అన్నాడో అమెరికన్.

దిలీపు బాబును ఆడిస్తూ వారిమాటలు వింటున్నాడు. అమెరికన్లిద్దరూ మంగాయమ్మగారితో వచ్చీరాని తెలుగు మాట్లాడుతూ సంతోషిస్తున్నారు. వారివేపు పరీక్షగా చూచాడు దిలీపు. అతడు బాబు చేతిలో వున్న టార్చిమీద గట్టిగా కొట్టాడు. ఆ దెబ్బకు అది నేలకు గట్టిగా కొట్టుకుంది.

"అరె ఎంతపని చేశావు బాబూ... అయ్యో ఆ లైటు పగిలిపోయివుంటుంది" అంటూ కంగారుగా అటూ యిటూ అడుగులు వేస్తూ పొరపాటున లైటు మీద తన బూటు కాలు వేశాడు. ప్లాస్టికుతో చేసిన లైటు టపటపమంది.

"సారీ తొందరలో పొరపాటున దానిమీద అడుగు వేశా" అతడు లయిటు తీసి వారి చేతికిచ్చాడు. అది అప్పుడు ఎలగటంలేదు, అమెరికనులిద్దరూ ముఖ ముఖాలు చూసుకున్నారు. వారిలోవారు ఏదో నెమ్మదిగా మాట్లాడుకున్నారు. తరవాత వారు దిలీపును అతని కుటుంబమును గురించిన వివరాలు అడిగారు. వాటన్నింటికీ దిలీపు అందీ పొందనట్లుగా సమాధానం చెప్పాడు. ఇంత జరిగిన తరవాత దిలీపు వాళ్ళను ప్రశ్నించటం మొదలుపెట్టాడు.

"మరి మీరొచ్చిన పని చెప్పారుకాదు" అడిగాడు యింగ్లీషులో.

వారిరువురూ ఒకరినొకరు చూసుకున్నారు. ఇంక సమాధానం చెప్పక తప్పలేదు.

"మేం వ్యాపారనిమిత్తం బజార్లో తిరుగుతున్నాం. మీ బాబు చాలా హెచ్చుగా ట్రాఫిక్ వున్న రోడ్డువెంట పరుగెడుతూవుంటే, మేముచూసి ఆశ్చర్యపోయాము. సంవత్సరం దాటని బాబు అలా పరుగెత్తాడంటే అతనిలో ఏదో అద్భుత శక్తి వున్నదన్నమాట" అంటూ ఇంగ్లీషులో సమాధానం చెప్పాడు.

ఇంకా వారిని ప్రశ్నించాలని ఆలోచిస్తున్నాడు. కాని అంతలో అమెరికన్లిద్దరూ, వారివద్ద సెలవుతీసికొని వెళ్ళిపోయారు.

# 11

యాటమిక్ రీసెర్చి లేబరేటరీలో ఆపరేటర్ కూర్చున్న చోట ఎర్రదీపం వెలిగింది. అతడు వెంటనే స్విచ్చి వేశాడు. వెంటనే పచ్చదీపం దాని తరవాత పసుపుదీపం వెలిగాయి. దానితరవాత సైరన్ భయంకరంగా మోగింది. ఆపరేటర్ ముఖంలో ఆశ్చర్యం భయం స్పష్టంగా కనిపిస్తూ వుంది, అతడు వెంటనే బోర్డులోవున్న ఎర్రస్విచ్చి నొక్కాడు. క్షణాల్లో అతని వెనక బూట్లచప్పుడయింది. అక్కడ నలుగు రైదుగురు సైంటిస్టులు హాజరయినారు.

"న్యూస్ ఫ్రమ్ యిండియా సార్" అంటూ ప్రక్కనే నిలబడివున్న డాక్టర్ శాస్త్రిగారికి ట్రాన్స్‌మిటర్ రిసీవింగ్ సెట్ అందించాడు. ఆయన దాన్ని త్వరగా అందుకొని చెవి దగ్గర పెట్టుకుంటూ,

"హలో డాక్టర్ శాస్త్రి స్పీకింగ్" అన్నాడు.

వెంటనే అవతలనుంచి మాటలు ఆరంభమయ్యాయి. డాక్టర్ శాస్త్రి ప్రతిదానికి "యస్....యస్.... వెరీగుడ్.... అంటూ పొడిగా సమాధానం చెపుతున్నాడు.

"వాట్....సో అర్జంటు?" అంటూ ప్రశ్నించాడా యన! అవతలనుంచి మాటల్లో వివరాలేమోగానీ,

"యస్ స్టాటింగ్. మనుషుల్ని జాగ్రత్తగా కనిపెట్టండి. వస్తున్నా" అంటూ కంగారుగా అక్కడనుంచి బయలుదేరి వెళ్ళిపోయాడు. ఆయనతో వచ్చినవారు కూడా వెళ్ళిపో యారు. కొద్దిసేపటిలోనే లేబరేటరీలో నుంచి కారు బయలు దేరి విమానాశ్రయానికి వెళ్ళింది. డాక్టర్ శాస్త్రితో పాటు ఇంకా యిరువురు సైన్‌టిస్టులు ఆ కార్లలో నుంచి దిగారు. ఆ ముగ్గురి చేతుల్లో ఎటాచ్‌లు వున్నాయి. కారుదిగి వాళ్లు కంగారుగా విమానాశ్రయం రన్‌వేమీద పరుగెత్తి ఎగరటా నికి సిద్ధంగా వున్న విమానం దగ్గరకు వెళ్ళారు. అప్పటివరకూ విమానం వారికోసమే ఆగినట్లుగా వుంది. తీసివుంచిన తలుపు మయ్యటానికి సిద్ధంగా వున్న ఏర్‌హోస్టెస్ నవ్వుతూ వాళ్ళను ఆహ్వానించాడు. వారు లోపలకు వెళ్ళగానే తలుపు మూశాడు. విమానం గాల్లోకి లేచింది.

అనుకున్నట్టుగా డాక్టర్ శాస్త్రిగారి బృందాన్ని దిలీప్‌కుమార్‌తో మాట్లాడిన అమెరికనులు కలుసుకున్నారు. అందరూ కూడి మంగాయమ్మగారి ఇంటికి చేరారు.

అంతమంది పెద్దవాళ్ళను చూసిన మంగాయమ్మ కంగారు పడింది. కానీ అదేమీ బయటకు పొక్కకుండా వారందరినీ మర్యాదగా ఆహ్వానించి కూర్చో బెట్టింది. తరువాత వాళ్ళందరికీ కాఫీకూడా ఇచ్చింది. తరువాత ఆమె నెమ్మదిగా-

"బాబూ! మీరొచ్చినపని?" అడిగింది.

"మేము డాక్టర్ దిలీపు కుమార్ గారిని కలవడానికి వచ్చాం. ఆయన్ని ఓమాటు పిలుస్తారా?" అచ్చ తెలుగులో అడిగాడు డాక్టర్ శాస్త్రిగారు.

"అయ్యో మీరు వస్తారని ఆయనకు తెలుసాఅండీ" మంగాయమ్మగారు ఆయన్ని అడిగింది.

"తెలియదండీ, అమెరికాలో మేమిద్దరం స్నేహితులము. చూసి వెళదామని వచ్చాం అంతే" అన్నాడు శాస్త్రిగారు.

"అలా చెప్పండి. మా వాడు అంటే బాబూ వాడు మా చెల్లెలి కొడుకులెండి. మా మనవరాలిని వాడికే ఇచ్చాం, నో బాబుకూడా" అన్నది మంగాయమ్మ.

"అది కాదండీ. ఆయనోన్ని మాటు పిలుస్తారా?" విసుగ్గా అడిగాడు డాక్టరు శాస్త్రి.

"మా దిలీపు వుంటే ఇందాకే పిలిచేదాన్ని. ఈరోజు రాత్రి వాడు మా మనుమరాలిని బాబుని తీసుకొని స్నేహితుడింట్లో పెండ్లని బయలు దేరి వెళ్ళాడు. వారం పదిరోజుల్లో వస్తానన్నాడు" అన్నది నవ్వుతూ.

అక్కడున్న వారంతా వాళ్ళకేసి కళ్లు చూస్తు న్నారు.

"సతీ పెళ్ళి ఏ ఫ్లూళ్ళోనండి?" శాస్త్రిగారు ఆమె నడిగారు. ఆమె ఏం చెపుతుందోనని అందరూ జాగ్రత్తగా వింటున్నారు.

"అదేదో బాబూ! పేరు చెప్పాడుగాని, నాకు గుర్తు లేదు" అన్నది తేలిగ్గా.

"శుభలేఖ ఏమైనా తన గదిలో వుంచాడేమో చూస్తారా?"

శాస్త్రిగారి ప్రశ్నకు మంగాయమ్మగారికి కోపం వచ్చిందిలాగుంది,

"ఏమిటిబాబూ! వాడిగది సోదా చేస్తారా? కొంపతీసి మీరు పోలీసు డిపార్టుమెంటువారు కాదుగదా!" ఆమె సందేహంగా వాళ్ళందరిని చూడసాగింది.

"అబ్బె అదేం లేదండి. నేను మళ్ళీ అమెరికా వెళ్ళి పోవాలి. మిత్రుడు కదా చూసి వెళదామని తొందర అంతే. అంతేగా మిస్టర్ నికల్సన్" అంటూ పక్కనున్న అమెరికన్‌ను చూస్తూ నిట్టూర్చి కన్నమిలాడు శాస్త్రి.

ఆయనెన్ని చెప్పినా మంగాయమ్మగారికి మాత్రం వారిమీద అనుమానం పోలేదు. వారిని అనుమానంగా చూస్తూనే,

"అదే ఫ్రూతో నాకు తెలియదు బాబూ" అంటూ సంభాషణ విరిచేసింది.

ఆమె సమాధానం చెప్తుండగానే డాక్టర్ రావుతన పక్కనే సోఫాలో కూర్చున్న మరో సైంటిస్టును వేలితో పొడిచాడు. వెంటనే అతను తన జేబులో వున్న సూదిలాంటి దానిని ఆ సోఫాలోకి లోతుగా గుచ్చేశాడు, పైన చేత్తో తడిమి చూశాడు. కానీ అక్కడో సూది లాంటిది గుచ్చి వుందని అనుమానం కూడా కలగనంతలోతుకు వెళ్ళిపోయింది.

"క్షమించండి. మామ్మగారు మీకు అనవసరంగా శ్రమ ఇచ్చాం, వస్తాం" అంటూ బయలుదేర బోయాడు డాక్టర్ శాస్త్రి.

"అయ్యో, అలా వెళ్ళిపోతే ఎలా బాబూ! మావాడితో ఏం చెప్పను? నీ స్నేహితుడు వచ్చాడు అంటే బాగుంటుందా? నీ పేరు అడ్రసు ఇదుగో ఈ లెటర్ ప్యాడ్ మీద వ్రాయి" ఆమె అతనికి లెటర్ ప్యాడ్ అందించింది.

డాక్టర్ శాస్త్రిగారు లెటర్ ప్యాడ్ చేతులలోకి తీసుకొని ఏదో ఆలోచిస్తూ వుండి పోయాడు. అది గమనించి మంగాయమ్మగారు,

"అదేంటి బాబు, అడ్రసు వ్రాయమంటే ఆలోచిస్తున్నావు. మరిచి పోయావా!" వ్యంగ్యంగా వున్నాయి ఆమె మాటలు.

"అబ్బే. అదేం లేదండి, ఇక్కడి అడ్రసు వ్రాయనా

ఇతర దేశాల అడ్రసు వ్రాయనా అని... ...” శాస్త్రిగారు అడిగాడు.

“రెండూ వ్రాయి బాబు, దండుగేముంది” అన్నదామె శాస్త్రిగారు మారు మాట్లాడకుండా అడ్రసు వ్రాసి ఆమెకిచ్చి వెంటనే ఆ ఇంట్లోనుంచి బయటపడ్డాడు.

దిలీప్ శేవల్లెలో రైలు దిగాడు. కావలసిన బిస్కట్లు చాక్‌లెట్లు, బూస్టు, ప్రిబూంలాంటివి కొని ఓ బండి అద్దెకు తీసుకొని క్రిష్ణానది వరకూ వచ్చాడు. అక్కడో లాంచి అద్దెకు తీసుకొని అలా అలా ప్రయాణంచేసి చివరకు హంసల దీవి చేరాడు.

“అబ్బా ఏమిటండీ బాబు ఈ ప్రయాణం మీ స్నేహితుడు ఇంత మారుమూల గ్రామంలో వున్నాడా. అయినా ఈ ప్రాంతమంతా మొన్నటి తుఫానుకు దెబ్బతిన్నది కదా. చక్కగా ఏ విజయవాడలోనో చేసుకుంటే అన్ని సదుపాయాలుండేవిగా” అన్నది విసుగ్గా.

“అదికాదు ప్రభా! మా వాడు ప్రకృతి ప్రియుడు. అందుకే ఇంతదూరం వచ్చాడు. మరి మనం ఇంకా రెండు మూడు కిలోమీటర్లుపోతేగాని ఆ వూరు చేరం” అన్నాడు.

అతని మాటలు విని ఆమె ఆముదం తాగినవాళ్ళలా, ముఖం పెట్టేసింది. దిలీపు అదేమీ గమనించలేదు. వెళ్ళి ఓ ఎద్దుబండిని మాట్లాడుకొచ్చాడు. అందులో తమసూటు

కేసులు ఇతర సామానుపడేసి ప్రభనుబాబుకు బండెక్కించి తానూ బండెక్కాడు,

బండి ఇసుక పర్రిలో దారి డొంకా లేకుండా పోతూ వుంది. సముద్రం పక్కనేపోతున్న వారికి ఆ గాలి వాతా వరణం ఎంతో హాయిగా వుంది. దారిలో తుప్పలు పెరిగి అడవిలా కొన్ని చోట్ల వుంది. ఓ గంట ప్రయాణం జరిగింది బండివాడు బండి ఆపాడు.

"బాబూ ఇక్కడ దిగండి. ఈ వూరిపేరు చేపలగని అంటారు. మీరు ఇక్కడ వుండటానికి వో మోస్తరు ఇల్లు దొరుకుతాయి. గ్రీష్మంలో అన్నీ చేరి యాత్రై ఇళ్ళు కనాన్ని ఎక్కువ లేవనుకోండి. ఇక్కడ నుంచి చ్చిపలయాపారం బాగా సాగుద్దిలెగండి. మీరు ఇక్కడ చిన్న డింగీపడవ తీసుకొని చాపల షికారు చెయ్యొచ్చు" అన్నాడు.

బండి వాడి మాటలు ప్రభకేమీ అర్థం కాలేదు! దిలీపు ఆమెను వినిపించుకోతుండా.

"అలాగయితే మాకో యిల్లు చూపించి అక్కడ దించెయ్యి" అన్నాడు.

బండివాడు వో పెంకుటింటిముందు ఆపాడు. దిలీపు బండివాడు వెళ్ళి ఇంటి అసామితో మాట్లాడారు. వెంటనే సామాను దించి ఖాళీగా వున్న యింట్లో దించారు. బండి వాడు తనకిరాయి తీసుకొని వెళ్ళిపోయాడు. ఇంతలో ఇంటి ఆసామీ వచ్చాడు.

"బాబూ మీ కేం ఇబ్బందుండదనుకోండి. లోపల కుర్చీలు, బల్లలు మంచాలు వున్నాయి. దోమ తెరలు కూడా వున్నాయి బాబూ! గ్యాసు పొయ్యికూడా వుంది. మా చేపలగనిలో బేరానికని పెద్ద పెద్ద సేట్లు వస్తారయ్యా. అందుకని ఇది కట్టించినా. రోజుకు పాతికే బాబు చార్జి. మీకు నీళ్ళకి, ఇంటిపనికి వంటపనికీ, మా మడిసి వచ్చొద్ది. మీ యిష్టమొచ్చినన్నాళ్ళు వుండండి, ఆ చాపలేటకు వెళ్ళితే మా కాడ గాలాలు కూడా వున్నాయి. ఆయన్ని తర్వాత సూద్దాం బాబయ్యా, ముందు అమ్మగారు బాబు లోపలికెళ్ళి కూకోండి. పొద్దు వాలిపోతుండాది" అంటూ వెళ్ళాడు.

అప్పటికే యిద్దరు పల్లె పడుచులు దిలీప్ వాళ్ళసామానంతా లోపలికి చేర్చారు. మంచాలు వాటిమీద పరుపులు దులిపారు. దోమ తెరలు కట్టారు. తరువాత స్నానాల గదిలో నీళ్లు అవి నింపేశారు. పాలు, పెరుగు వచ్చేశాయి స్టార్ హోటళ్ళకన్నా ఆ సదుపాయాలు చకచకా దొరుకుతున్నాయి. కాఫీ కూడా తయారయిపోయింది. బాబూ! ప్రతిభ, స్నానం ముగించుకుని బట్టలు మార్చుకున్నారు. తరువాత దిలీపు కూడా తయారై పోయాడు. వంటలు ఏమి కావాలో అడిగి తెలుసుకున్నారు పల్లె పడుచులు. ఆ కొంత వ్యవధిలోనే బాబు ప్రతిభ కూడా పల్లెపడుచులతో సన్నిహితులయ్యారు. ఇంటివరండాలో కుర్చీలు టేబులు వేసి

వున్నాయి. వారంతా అక్కడకొంతసేపు కూర్చున్నారు. వాళ్ళకు యాభై మీటర్లదూరంలో సముద్రం పడుతూ లేస్తూ వుంది.

"ప్రభా! అలా వెళ్ళవద్దామా?"

అతని మాటలకు సమాధానం చెప్పకుండానే ప్రభ లేచి నిలబడింది. వారు సముద్రం వొడ్డుకు చేరారు. అలలు తడిపిపోయిన ఇసుకమీద ఆసంసారం అంతా నడుస్తున్నారు బాబు వొక చెయ్యి ప్రభ పట్టుకుని మరో చెయ్యి దిలీపు పట్టుకున్నారు. బాబు వారి మధ్య దర్జాగా నడుస్తున్నాడు. మధ్యమధ్య సముద్రంనీళ్ళలోకి పోవడానికి ప్రయత్నం చేస్తుంటే వారిద్దరూ ఆపుతూ అలా కొంత దూరం నడిచారు.

"ప్రభా! ఇక్కడెంత హాయిగా వుందో చూశావా! మన ఎదురుగా నీలిరంగు సముద్రం. దాని మీద అక్కడక్కడ చిన్నచుక్కల్లా చేపలవేటకెళ్ళిన జాలరుల చిన్నచిన్న తెప్పలు, చల్లగాలి, అబ్బా ఎంతహాయి ప్రభా!" సమాధానం చెప్పక పోయేసరికి, అతను ఆమెనుచూశాడు అప్పటికే ప్రభ అతన్ని కోపంగా చూస్తున్నది.

"కోపం వచ్చిందా?" అన్నాడు దిలీప్.

"అబ్బే నాకేం కోపం. అయినా ఎందుకు కోపం"

"కాదులే. పెళ్ళని ఇక్కడికి తెచ్చానని కోపంగానే వుంది, నాకు తెలుసు"

"అబ్బే అదేం లేదండి. భారతనారికి అనాదినుంచి భర్తే ప్రత్యక్ష దైవం. భర్త ఏంచేసినా భార్యనోరు తెరవ కూడదు. అతనెక్కడ వుంటే భార్య అక్కడే వుండాలి. అప్పుడుగాని ఆ భార్యకు పతివ్రత అనే సర్టిఫికెట్టువస్తుంది." అన్నది ప్రభ.

"అనుగో నాకు తెలుసు నీవిలా అంటావని. ప్రభా! నాకు ఇలాంటిచోటు కొంతకాలం వుండాలని చాలా కాలం నుంచి కోరికవుంది. అందుకే నీకు కూడా చెప్పకుండా ఇలా తెచ్చాను. ముందుగా చెపితే నీవంగీకరించవని." అతను ఆమెను ఓరకంటితో చూశాడు.

"ఊ...అర్థమయింది" ప్రభ గట్టిగా, శ్వాసపీల్చు కుంది.

"సరే నీకిష్టం లేకపోతే, రేపే వెళ్ళిపోదాం. నిన్ను కష్ట పెట్టడం నాకిష్టం లేదు. ఈ పూట కొంచెం సంతో షంగావుండు." అన్నాడు బుంగమూతి పెడుతూ.

ఆమె అతనికి దగ్గరగా జరిగింది. బాబు చెయ్యి వది లేసి దిలీప్ భుజానచెయ్యి వేసింది. అతను జాలిగా ఆమె వేపుచూశాడు. ఆమెఫక్కున నవ్వింది.

"ఎందుకమ్మా నవ్వుతావు. నేను చేసింది తప్పేనని ఒప్పుకుంటున్నానుగా"

ఆమె అతన్ని పెనవేసుకుంది. దాంతో ఆగక ఆమె అతనితల తన రెండుచేతులతో దగ్గరకు లాక్కుంది. ఇద్దరి శ్వాసలు ముఖాలకు తగుల్తూవున్నాయి,

"ఏవండీ...నన్ను ఇంకా మీరర్థం చేసుకోలేదు. మీ కేది ఇష్టమో నాకూ అదే ఈ మాత్రం నాకు చెపితే నేనూ ఎంతో సంతోషించి వుండేదాన్ని. అంతేకాదు. మనకు కావలసిన పచ్చళ్ళు వగైరాలు కూడా తీసుకొచ్చే వాళ్ళం. మీ ఇష్టమొచ్చినన్నాళ్ళు ఇక్కడుందాంసరేనా" అన్నది.

దిలీప్ ఆమెను దగ్గరకు లాక్కుని ముద్దు పెట్టుకున్నాడు. బాబు తన పాము గ్రాతా పోయినట్లుగా తుమ్మాడు. ఆ భార్యాభర్తలు నవ్వుకున్నారు.

"ఫ్రెండ్స్...దిలీప్ మనరాక కనిపెట్టి కావాలనే ఇక్కడనుంచి పారిపోయాడని నా అనుమానం. అతనిలా ఎందుకు చేస్తున్నాడో తెలియదు. అతని ప్రవర్తన నాకు అనుమానంగావుంది. ఏది ఏమైనా అతన్ని మనం పట్టుకోవాలి మా దేశానికి మీ దేశానికి అపకారం కలిగేలా ప్రవర్తిస్తే అతని అంతం చూడాలి" డాక్టర్ శాస్త్రి మాటలు భయంకరంగావున్నాయి.

"చూస్తారేం మన యాటామిక్ ట్రేసర్ను తియ్యండి. దిలీప్‌లోనూ, అతనికొడుకులోనూ యాటామిక్ ఎనర్జీ చేరింది దాంతో అతడేమన్నా చెయ్యవచ్చు. కమాన్ క్విక్"

యాటామిక్ ట్రేసర్ తీసి డాక్టర్ శాస్త్రిగారి చేతికిచ్చారు వాళ్ళు. ఆ యంత్రంలో వున్న స్విచ్చినొక్కాడు

శాస్త్రి. ఎర్రటిచుక్క అందులో కనిపించింది. అది నెమ్మ దిగా కదుల్తూవుంది.

"కమాన్ కారు పోనివ్వండి" అన్నాడు డాక్టర్ శాస్త్రి.

వారు ఎర్రనిచుక్క చూపుతున్న దారినే ప్రయాణం సాగించారు. ఆగినచోట ఆగుతూ, తిండి దొరికినచోట తింటూ వారు అలా మందుకు ప్రయాణమై పోతున్నారు. అప్పటికే వారి ప్రయాణం రెండురోజులు సాగింది. మూడవనాడు వారు రేపల్లె జేరారు. అక్కడనుంచి వాళ్ళు క్రిష్ణవొడ్డు చేరారు. ఇంక కారక్కడ వదిలేసి స్టీమ్‌బోటు అద్దెకు తీసుకొని వారు హంసలదీవి చేరారు. అప్పటికే రాత్రిచాలా ఆలశ్య మయిపోయింది. దాంతో వారు అక్కడే మకాం వేశారు.

ఉదయాన్నే లేచి ఎర్రచుక్క చూపించిన మార్గాన్నే బండి కట్టుకు బయలుదేరారు. చివరికి చేపల గని చేరారు. ఎర్రచుక్క బంగళావరకూ వారికి దారి చూపించింది. మామూలు ప్రకారం ఇంటియజమాని వారికి కావలసిన సదుపాయాలు అన్నీ అందేలా చూశాడు. ఎర్రచుక్క అక్కడే ఆగిపోవడంతో వారేమిచెయ్యడానికీ పాలుపోలేదు.

డాక్టర్ శాస్త్రి ఆరోజంతా ఆలోచిస్తూ కూర్చు న్నాడు, అతనికో ఆలోచన వచ్చింది. ఇంటి యజమానిని పిలిచాడు,

"చూడండి. ఇతను కాకుండిక్కడెవరున్నారు ?" అతని ప్రశ్నకు ఆసామి దిలీప్, ప్రభ బాబుల వివరాలు అన్నీ పూసగుచ్చినట్లు చెప్పాడు.

"మరి వాళ్ళెక్కడికెళ్ళారో తెలుసా ?" అడిగాడు

"రాత్రి ఇక్కడే పండుకున్నారు బాబు. వారొచ్చిన ఈ మూడు నాలుగురోజుల్లోనే పల్లెకారు జనాన్నందరినీ ఆకట్టుకున్నారు, అమ్మగారు కూడా అంతే మాపల్లోళ్ళతో పాటలు, ఆటలు కూడా సేసేది సార్. మరేవయిందో ఆ పాపం పుణ్యం పరమాత్ముడికి తెలియాలి, ఈ రోజు తెల్లవారకట్టఆ ళ్ళెక్కడికో ఎల్లిపోయినారు దొరా." అన్నాడా ఇంటి యజమాని.

"నీ డబ్బిచ్చేశారా. బహుశ, ఎగేసిపోయి వుంటారు అందుకే అంత చీకట్లో కనిపించకుండా పోయారు" అన్నాడు డాక్టర్ శాస్త్రి.

"ఛ... ఛ... అలాననోళ్ళు అనుభవిస్తారు బాబూ. ఆయనచ్చంగా దేవుడు.

కాదు బాబు. నాకియ్యవలసిన దానికన్నా రెండొందలు ఎక్కువగా బల్లమీద పెట్టి ఎల్లారు. అలాంటాయన దేవుడుగాక మరెవరవుతాడంట" ఇంటి ఆసామి చెప్పిన మాటలకు డాక్టరుశాస్త్రితోపాటు విన్నవారంతా ఆశ్చర్యపోయారు.

"అలాగయితే. వాళ్ళు ఎటు వెళ్ళి వుంటారంటా ?" డాక్టర్ శాస్త్రి మళ్ళీ ప్రశ్నించాడు.

ఇంటి ఆసామి వారందరిని పరీక్షగా చూశాడు. అతడు శాస్త్రిగారి దగ్గరగా వచ్చి నెమ్మదిగా

"బాబూ మీరు పోలీసోళ్ళా ?" అన్నాడు

"కాదు. అంతకన్నా ఎక్కువే. ఆ పారిపోయిన వాళ్ళ ఆచూకీ చెప్పావో నీకు ప్రభుత్వం పెద్ద బహుమానం ఇప్పిస్తా బాగా ఆలోచించు" తనకు దొరికిన అవకాశాన్ని వినియోగించుకోడానికి ప్రయత్నించాడు శాస్త్రి.

ఇంటి ఆసామి కొంచెం సేపు ఆలోచించాడు. అతని ముఖాన చిరునవ్వు కనిపించింది. డాక్టర్ శాస్త్రిగారికి పరమానందమయిపోయింది. ఆయన తన ప్యాంటు జేబులో చెయ్యి పెట్టి వందరూపాల నోటుతీసి,

"ఇంద...ఇది ఎడ్వాంసుగావుంచుకో, ఇలాంటివి ఎన్నో బహుమతులు వస్తయి నీకు" అన్నాడు నవ్వుతూ.

"బాబూ మీరేమనుకోకండి మీరే దొంగలయి ఆ దేవుడులాంటి ఆయన్ని దోచుకోటానికి తరుముకున్నారేమో ఎలా తెలుస్తుంది చెప్పండి. మనిసిని చూసి దొంగోడాకో తెల్చుకోవడం ఎలా సామీ?" అన్నాడు ఇంటి ఆసామి.

ఇంక అతనితో లాభంలేదనుకుని డాక్టర్ శాస్త్రి మరో మార్గం కోసం ఆలోచిస్తూ కూచున్నాడు. చుట్టూ

మిక్ స్ప్రేసర్‌లో ఎర్రచుక్క కదలక పోవడంతో అతడు తన తోటివారినందరినీ పిలిచాడు.

"ఎనిథింగ్ రాంగ్ విత్ ది స్ప్రేయర్!" అంటూ గట్టిగా అడిగాడు

అటువంటిదేమీ తమకు కనిపించలేదని ఎర్రచుక్క కదలకపోవడానికి కారణం కూడా అర్థం కావటంలేదంటూ వారు తమ అసమర్థతను ఒప్పుకున్నారు.

"నాన్‌సెన్స్. మీరంతా వట్టి దండుగ. మీరెవ్వరూ బాధ్యత తీసుకోవడంలేదు. అంతేకాదు, ఎప్పుడు పని ఎగవేసి తప్పించుకుపోదామా అన్న ఆలోచన తప్ప మరొకటి లేదు. అతని ఉనికి మనం కనిపెట్టలేదంటే అందరూ నవ్వుతారు, సరే ఈ విషయం పైవారికి తెలియజేస్తా. అప్పటివరకూ నేనే స్వయంగా చూసుకుంటా" అతను స్ప్రేసర్ చేతులో తీసుకొని ఇల్లంతా పిచ్చిగా తిరుగుతున్నాడు. అక్కడున్న ప్రతి వస్తువునూ పరీక్షగా చూస్తున్నాడు.

అతడు చివరి ప్రయత్నంగా మంచాల మీద వున్న పరుపులను తలక్రిందు చేశాడు. అందులో ఒక పరుపు ప్రక్కగా బ్లేడుతో గీత పెట్టినట్లుగా కోత కనిపించింది. చేతులో వున్న స్ప్రేసరు ప్రక్కనపెట్టి డాక్టరు శాస్త్రి చించిన గుడ్డలోకి చెయ్యి పెట్టాడు. మెత్తటిదూది తగిలింది కాని అది తడిగా వుంది. అతడు మరింత ఆశ్చర్యంతో దూదిని లాగాడు. అతనితో వున్న వారంతా అతడు చేసే ప్రతిపనిని

పరీక్షగా చూస్తున్నారు. అలా కొంత దూరం తీసిన తరువాత అతనికి ముద్దలా చుట్టిన టర్కీ-టవలు వకటి కనిపించింది. అది చాలా తడిగా వుంది. శాస్త్రిగారు దాన్ని జాగ్రత్తగా తెరిచారు. అందులో దిలీపు తాలూకు షర్టు, ప్యాంటు వున్నాయి అవి తడిగానే వున్నాయి. వాటిని జాగ్రత్తగా విప్పాడు. శాస్త్రిగారు జేబులు తడివి చూశారు. అందులో నుంచి రిస్టువాచి తీశాడు.

“ఓ ఇదన్నమాట విషయం. ఈ గడియారంలో యటామిక్ ఎనర్జి విపరీతంగా వుంది. ప్రయోగశాల పేలిపోయినప్పుడు దగ్గరనున్న లోహాలను యటామిక్ ఎనర్జి ఆకర్షిస్తుంది. అందుకే మన ట్రేసర్ ముందుకు దారి చూపకుండా ఆగిపోయింది. దానికి తడిగుడ్డ చుట్టడంలో ఉద్దేశ్యం కూడా యటామికు ఎనర్జి వెంటనే పోకుండా కొంతకాలముండటానికి” అన్నాడు డాక్టరు శాస్త్రి.

“అలాగయితే మనల్ని తప్పించుకు తిరగాలని దిలీప్ ప్రయత్నిస్తున్నాడని బాగా అర్థమయిపోతుంది సార్. ఇలా వదిలేస్తే ఇతడు ప్రపంచానికే హాని తలపెట్టొచ్చు” అన్న నికల్సన్ కళ్ళు ఎర్రబడినాయి.

“అది సరే పదండి. వాళ్ళు ఎటు వెళ్ళారో ఇప్పుడు మనకు ఈ ట్రేసరులోని ఎర్రచుక్క చూపిస్తుంటుంది” అంటూ వాళ్ళని తొందర చేశాడు డాక్టర్ శాస్త్రి. కాని ఎర్రచుక్క కదలకుండా ఆగిపోయింది.

"ఇంక గత్యంతరంలేక వారంతా తమ కారుదగ్గరకు చేరారు. మంగాయమ్మగారింటికి దిలీపు చేరగానే టాన్స్మిటర్లో తెలియచెయ్యమని కొందరిని అక్కడ వుంచాడు డాక్టరు శాస్త్రి. కాని వారివద్దనుంచి ఎటువంటి సమాచారం అందకపోయేసరికి అతనికి మరింత కోపం వచ్చింది. ఇక గత్యంతరంలేక వాళ్ళు అనేక వూళ్ళు తిరుగుతున్నారు.

డాక్టరు శాస్త్రి బృదం ఆనాడు హైదరాబాదు రిట్జ్ హోటలులో మకాం చేశారు. అర్ధరాత్రివరకూ తనతోటి వారితో జరగవలసిన కార్యక్రమాలను గూర్చి చర్చించి పడుకున్నాడు.

అర్ధరాత్రి దాటింది. తన చేతిగడియారం కిర్రుమంటూ శబ్దం చెయ్యడంతో డాక్టరు శాస్త్రి మేలుకున్నాడు. అతడు కంగారుగా తన వాళ్ళనందరినీ లేపాడు.

"పదండి, దిలీప్ దొరికాడు. మనం మంగాయమ్మగారింట్లో వుంచిన ట్రాన్స్మిటరు పనిచేస్తుంది. వెంటనే బయలుదేరాలి, లేకపోతే అతగాడెటన్నా మళ్ళీ పారిపోవచ్చు"

డాక్టర్ శాస్త్రి వాళ్ళనందరినీ కంగారు చేసి తాను కంగారు పడినాడు. కారు వెంటనే బయలుదేరింది. అతని చేతిగడియారం కిర్రుమంటూ చప్పుడు చేస్తూనే వుంది. ఆ క్షణంలో కారు గాలిలో తేలిపోతే బాగుండుననుకున్నాడు, శాస్త్రిగారు. తెల్లవారుఝామున నాలుగు గంటలకు కారు మంగాయమ్మగారిల్లు చేరింది, అంతవరకూ కిర్రుమంటున్న

గడియారం ఆగిపోయింది డాక్టరు శాస్త్రిగారు కారులో నుంచి ఎగిరి స్క్రీందికి గంతేశాడు.

"కమాన్ ఎటామిక్ ఎనర్జి వదలండి. ఈ దెబ్బకు దిలీపు కదలకుండా వుండిపోతాడు. "క్విక్" సితెండరు లాంటి యంత్రాలన్నీ ఆ యింటివేపుతిప్పి, ఏదో స్విచ్చి నొక్కాడు.

*　　*　　*

కాలింగ్ బెల్ చెవులు చిల్లులు పడేలా మోగుతూ వుంది. మంగాయమ్మగారు బద్ధకంగా లేచి తలుపులు తెరిచి కళ్ళు నలుపుకుంటూ,

"ఎరుబాబూ, ఏం కావాలి!" అంటూ ఆవలించి నది. ఎదురుగావున్న వారినుంచి సమాధానం రాకపోయే సరికి ఆమె కళ్లు తెరిచి చూసింది ఆమెకు డాక్టరు శాస్త్రి గారు ఆయనతోపాటు వున్న మనుషులు కనిపించారు. శాస్త్రి ఆమెను చూసి నవ్వుతున్నాడు.

"ఏం కావాలి మీకు!" ఆమె వాళ్ళను ప్రశ్నించి నది.

"మాకా డాక్టరు దిలీపుకుమారు కావాలి. చెప్పండి ·యనెక్కడున్నాడో!" దబాయించాడు శాస్త్రిగారు.

అంతలో ప్రభ కూడా మేడమెట్లు దిగివచ్చింది. "ఆయనిక్కడలేరు, ఏదో ఊరు వెళ్ళారు." అన్నది ప్రభ.

"అబద్ధం అతనిక్కడే ఈ యింట్లోనే ఎక్కడో వుండి వుంటాడు. మీరు మర్యాదగా అతన్ని మాకప్పగించండి లేదా మేమే అతన్ని వెతికి పట్టుకుంటాం" అన్నాడు డాక్టరు శాస్త్రి. ఆయన చెప్పినంత పని చేసేటట్లున్నాడు. అందుకే మంగాయమ్మగారు ప్రభ గుమ్మాని కడ్డంగా నిలబడినారు.

"మీరు లోపలికి అడుగు పెట్టటానికి వీలు లేదు. అలా చేశారా, మేము మీ పై అధికారులకు రిపోర్టు చేస్తాము" అన్నారు వాళ్ళు, కానీ డాక్టర్ శాస్త్రి అతని మనుషులు అవ్వేమీ పట్టించుకోలేదు,

"ఫ్రెండ్స్! మనం ఇలా మీనమేషాలు లెక్కపెడుతో కూర్చుంటే అసలు వ్యక్తి పారిపోవచ్చు. పదండి ముందుకు" అన్నాడు.

వారంతా, ప్రభను మంగాయమ్మగారిని తోసుకొని లోపలకు వెళ్ళిపోయారు. ఆడవాళ్లు వాళ్ళను ఆపటానికి ప్రయత్నం చేశారుగాని ఫలితం లేకపోయింది, ఇంక గత్యంతరం లేక వారిద్దరూ డాక్టర్ శాస్త్రిగారివెంట బయలు దేరారు. గదులన్నీ వెతికారు, కాని దిలీప్ జాడ వారికి తెలియలేదు.

"యాటమిక్ ట్రేసర్ యివ్వండి" అరిచాడు డాక్టర్ శాస్త్రి.

మరుక్షణంతో ట్రేసర్ అతని చేతికి వచ్చింది.

అతడు స్విచ్చి నొక్కాడు, ఎర్రచుక్క కదులుతూ వుంది. అది చూపించిన వేపు నడిచాడు వారంతా. డాక్టర్ శాస్త్రి బాత్ రూము వేపు నడిచాడు. తలుపుమీద చెయ్యివేసి నెట్టాడు. కానీ బాత్ రూము లోపలగడియపెట్టి వుంది.

"తలుపు తెరవండి. లోపలెవరు?" తలుపు మీద గట్టిగా బాదుతూ గట్టిగా కేకలేశాడు కాని లోపలి నుంచి సమాధానం రాకపోయేసరికి తనమనుషుల్ని చూశాడతను. తమకు దొరికిన వస్తువులను తీసుకొని వాళ్ళు బాత్ రూము తలుపులు పగలగొట్టారు. లోపల దిలీప్ కళ్ళు మూసుకొని కూర్చుని వున్నాడు. డాక్టర్ శాస్త్రితో వున్న మనుషులు అతన్ని పట్టుకోబోయారు.

"ఆగండి, అతన్ని తాకారో ప్రమాదం. చేతులకు గ్లౌస్ వేసుకోండి. ఆ తరువాత అతన్ని నెమ్మదిగా ఇటు పిలుచుకురండి" ఆర్డరు వేశాడు శాస్త్రిగారు.

ఆయన చెప్పినట్లే వాళ్లుచేశారు. సోఫాలో కూర్చోబెట్టిన దిలీప్ ఇంకా కళ్ళు మూసుకునేవున్నాడు. ప్రభతోపాటు, మంగాయమ్మగారు కూడా దిలీప్‌ను చూసి కంగారు పడ్డారు.

"యాటమిక్ ఎనర్జీ ప్రభావం ఎక్కువయింది. అందుకే ఆతడలా కళ్ళుమూసుకున్నాడు, మనం ఇప్పుడు అతని చేత జరిగిన విషయాలన్నీ చెప్పించుదాం. మీరంతా దూరంగా వుండండి" ఆర్డరు వేశాడు శాస్త్రి.

మంగయమ్మగారు ప్రభ, బాబు ఇంకేముంటుంది ఏమి జరుగుతుందో అని చూస్తూ కూర్చున్నారు.

"డాక్టర్ దిలీప్‌కుమార్" పిలిచాడు డాక్టర్ శాస్త్రి.

"యస్" అన్నాడు దిలీప్.

"డాక్టర్ యాదవ్, డాక్టర్ రామారావుమిమ్మల్ని రమ్మంటున్నారు. వెళ్ళండి త్వరగా" అన్నాడు శాస్త్రి.

అప్పటికే డాక్టర్ దిలీప్‌కు దగ్గరగా టేప్ రికార్డర్ పెట్టి సంభాషణంతా రికార్డు చేసే ఏర్పాట్లు పూర్తి అయ్యాయి.

దిలీప్ వెంటనే సమాధానం చెప్పలేదు. డాక్టర్ శాస్త్రి ఆతన్ని అదేవిధంగా పలకరిస్తున్నాడు. నెమ్మదిగా దిలీప్ పెదవులు కదిలాయి. శాస్త్రిగారి మనసు తేలిక పడింది.

"డాక్టర్ యాదవ్! మీరు చేసే ప్రయోగం చాలా అపాయకరం. ఏ క్షణాన్నయినా అది పేలిపోవచ్చు. దాంతో మనకేకాదు. మనచుట్టు పక్కలవాళ్ళకు కూడా యాటమిక్ రియాక్షన్ వస్తుంది. నా మాట విని ఆపండి.

ఏమిటి ఆపరూ? డాక్టర్ రామారావుగారూ! మీరన్నా చెప్పండి. అపాయం ముంచుకొస్తుంది. అరే అలా నవ్వుతా రేం? నేను పిరికివాడినంటున్నారా? పిరికి కాదండి బాబూ! నేను అందరి క్షేమానికి అడుగుతున్నా. అరే ప్రయోగం బాయిలింగ్ పాయింటుకూడా దాటిపోతుంది. డాక్టర్ శాస్త్రి ఎక్కడున్నారు మీరు....త్వరగా రండి .... ఔను డాక్టర్ శాస్త్రిగారు లేరుగా ఆయనబదులుగా డ్యూటీకి నేను వచ్చానుగా. డాక్టర్ యాదవ్! స్విచ్ ఆపండి ... సరే అలాగయితే నేను వెళ్ళిపోతున్నా...ఏమంటారు? వెళ్ళిపో వడం నేరమంటారా? మనమే కాదు మనతో పాటు లక్షలు విలువచేసే ఈ ప్రయోగశాల పాడై పోతుంది. రండి వెళ దాము. పరుగెత్తండి. అలాంటివాళ్ళు ప్రపంచానికి చాలా అవసరం... అరే మీరు రారూ నేను వెళ్ళిపోతా..."

దిలీప్ కొంచెం ఆగాడు. కానీ డాక్టర్ శాస్త్రి అతన్ని అలావుండనివ్వదలచలేదు లాగుంది.

"ఆ తరువాత ఏం జరిగింది. డాక్టర్ దిలీపు" అన్నాడు డాక్టర్ శాస్త్రి

"జరగటాని కేముంది? నేను పరిగెత్తుకుని లేబరేటరీ

బయటకొచ్చా. అంతే మరుక్షణంలో ప్రయోగశాల పేలి పోయింది. దాని తాలూకు జాడ కూడా కనిపించలేదు. మంటలు ఎక్కడచూసినా మంటలు" దిలీప్ మళ్ళీఆగాడు.

"మరి మీరేం చేశారు. చెప్పండి త్వరగా" డాక్టర్ శాస్త్రి అతన్ని తొందరపెట్టారు.

"లేబరేటరీ పేలిపోవడంతో నేను గాలిలోకి బంతి లాగ లేచిపోయాను. ఆ తరువాత దూరంగా పడిపోయాను. నాకు ఎంత సేపటికి మెలకువ వచ్చిందో నాకే తెలియదు. లేచి చూసేసరికి అక్కడజనం గుంపులు గుంపులుగా వున్నా రు. ఇంకా పొగలు వస్తూనే వున్నాయి. నెమ్మదినెమ్మదిగా నడుస్తూ వాళ్ళకు దూరంగా వెళ్ళిపోయాను. నా ఎదురుగా పెద్ద సముద్రం. నా వెనుకనుంచి "పట్టుకోండి పట్టుకోండి" అన్న అరుపులు వినిపించాయి. నాకు గత్యంతరంలేక సము ద్రంలో దూకాను. కానీ నేను బెండుకన్నా తేలిగ్గా వున్నా ను. నీళ్ళమీద తేలుతున్నాను. ఇంక నేను వెనకాముందూ ఆలోచించకుండా ఆ నీళ్ళమీద పరుగెత్తాను. నాకు నీళ్ళ మీద పరుగెత్తడం నేలమీదకన్నా తేలిగ్గావుంది, నా

వేగానికి నాకే ఆశ్చర్యం వేసింది. ఎగిరే పక్షులు, సముద్రంలో ప్రయాణం చేసే స్టీమ్ బోట్లు నా వెనకపడి పోతున్నాయి. నేను నా దేశం చేరాను. ఎలా చేరానో నాకే తెలియదు ఇప్పుడు నేను భూమిమీద నడుస్తున్నాను.

నా ఎదురుగా పెద్దనది వుంది. అక్కడ అనేకమంది స్నానాలు చేస్తున్నారు. పక్కనేవున్న దేవాలయంలో నుంచి, గుడి గంటలు వినిపిస్తున్నాయి. వేద మంత్రాల ఘోష కూడ వినిపిస్తూనేవుంది. నాకు ఎదురుగా కాషాయ వస్త్రాలు వేసుకున్న వో బైరాగి నిలబడి వున్నాడు. ఆయన వో చేతిలో కమండలం మరో చేతిలో దండం వుంది. ఆయన్ని ఆ నదిగురించి, దేవాలయం గురించి అడిగాను. కానీ ఆయన నాకు సమాధానం చెప్పకుండా తన చేతిలోని దండంతో నన్నో తోపు తోశాడు. నేను వెళ్ళి నదిలో పడ్డాను, అక్కడ నాతోకూడా స్నానంచేసే అనేకమంది నన్నుచూసి నవ్వారు. ఇంక చేసేదిలేక నేనూ వారి వెంట స్నానం ముగించుకుని తడిబట్టలతోనే దేవాలయంలోకి వెళ్ళాను. అక్కడేవో స్వామి వున్నాడు. అందరూ చేతులెత్తి దండాలు పెడుతుంటే నేనూ అలాగే చేశాను. కళ్ళు మూసుకొని మళ్ళీ తెరిచి చూసేసమయానికి నా చుట్టూ

జనం, నా ఊరు, పేరూ అన్నీ గుర్తుకొచ్చాయి. ఇంక నేను ఆలస్య చెయ్యకుండా మా యింటికొచ్చేశాను. తరువాత నెమ్మదిగా మా పెద్దమ్మవాళ్ళ ఇంటికి చేరాను. తర్వాత పెళ్ళి, పిల్లలు. కాని నాకు భయంగానేవుంది లేబరేటరీలో నుంచి నన్ను వెంబడించి పట్టుకుంటారని, అందుకే నేను ఎక్కడికీ ఉద్యోగానికి పోలేను. కారణం, నేను బయటపడిపో తానని. మా యింట్లో వాళ్ళు నన్ను తప్పుగా అర్థంచేసు కున్నారు.

ఈ పరిస్థితిలో నా వెంట విదేశ గూఢచారులు పడ్డారు. కథమళ్ళీ మామూలయింది. అంతేగాకనన్ను వెదికి పట్టుకొని అమెరికా తీసికెళ్ళి, ప్రయోగశాల పేలిపోవడా నికి, అందులో ప్రఖ్యాత సైంటిస్టులు డాక్టర్ యాదవ్, డాక్టర్ రామారావుగార్ల అంతం కావడానికి కారణం నేనే నని నన్ను శిక్షిస్తారు. అందుకే నేను ఎవరికి దొరక్కుండా బ్రతకాలి. అనుకోకుండా నేను వివాహం చేసుకున్నాను, తండ్రినయ్యాను. వారికి రక్షణ ఇవ్వాలి.

కానీ నా ప్లానే అంతా బూడిదలోపోసిన పన్నీరయింది. ప్రయోగశాల పేలిపోయినప్పుడు నా శరీరంలోకి యురేనియం. శక్తి చాలా ప్రవేశించింది. నాలోకి అణు

శక్తి కొంత భాగం నాకు మారుతు భానుప్రకాష్ కూడా వాటా తీసుకొన్నాడు.

చిన్నపిల్లవాడు కావడంతో అతని ప్రవర్తన చాలా మందికి అనుమానాన్ని కలగజేసింది. దాంతో నా వునికి తెలిసిపోయింది, మరుక్షణమే నన్ను పట్టుకోడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. అన్న విషయం నా మెదడు ముందుగానే నాకు తెలియజేస్తూవుంది.

నాకోసం వేట ఆరంభమయింది, అందుకే నేను భార్యా పిల్లలతో పారిపోయాను. నన్ను వెంటాడుతున్న వారిని మభ్యపెట్టి తప్పుడు దారి పట్టించడానికి నా దగ్గరున్న వస్తువులను ప్రయోగించాను.

కానీ... కానీ నేను ఎందుకో నీరసించిపోయాను. నే నిప్పుడేమీ చెయ్యలేను. అతిగా తాగినవారికన్నా మైకం వస్తుంది... అబ్బా ... నిద్ర... నిద్ర..." డాక్టర్ దిలీప్ అలాగే కుర్చీలో వాలిపోయి నిద్రపోతున్నాడు,

ప్రభ, మంగాయమ్మగారు కంగారుపడ్డారు. వాళ్ళను చూసిన శాస్త్రిగారు వెంటనే అది గమనించారు.

"అమ్మా మీరేమీ భయపడకండి. యుటామిక్

ఎనర్జీ మరికొంత ఎక్కువమోతాదులో ఈయన కివ్వడం జరిగింది, దాంతో ఆయనకు మైకం వచ్చింది. అంతేకాదు. జరిగిన విషయమంతా కూడా తెలిసిపోయింది. నామిత్రుడు డాక్టర్ దిలీప్‌కుమార్ నిర్దోషి. అది నేను నిరూపిస్తాను." అంటూ ఆడవాళ్ళ భయం పోగొట్టాడు.

అరగంట గడిచింది. దిలీప్ నిద్రలోనుంచి మేలుకున్నవాడిలా లేచాడు. ఎదురుగా నిలబడి అతన్ని పరీక్షగా చూస్తున్న డాక్టర్ శాస్త్రిగారి చూపులు దిలీప్‌చూపులు కలిశాయి.

"హల్లో మిస్టర్ దిలీప్" అన్నాడాయన.

"హల్లో మిస్టర్ శాస్త్రి"

వారిద్దరూ గాఢాలింగనం చేసుకున్నారు. తరువాత దిలీప్ అడిగినమీదట శాస్త్రి తన చరిత్రంతా అతనికి చెప్పాడు.

"డాక్టర్ దిలీప్‌కుమార్ నువ్వాటువెళ్ళి పోయావా ఏదేశం నీ నుంచి రహస్యాలు గ్రహించి ప్రపంచానికి ప్రజలకు ముప్పు తెస్తుందోనని మేమంతా భయపడ్డాం.

అందుకే ఇంత కష్టపడి నిన్ను వెంబడించి కష్టపెట్టాం. క్షమించు" అన్నాడు శాస్త్రి.

"డాక్టర్! నేను భారతీయుడినైనందుకు గర్విస్తున్నా. మన ఋషులు, వేదాలూ, ఏం చెప్పాయి ? "సర్వేజనా సుఖినోభవంతు" అన్నాయి మన దేశప్రజలే కాదు. సర్వ జనావళికి ఈ అణుశక్తి ఉపయోగపడాలి. మారణహోమా నికి కాదు. లోకకల్యాణానికి. లేనిపోని అపనింద నా మీద పడుతుందని భయపడ్డాను. ప్రయోగశాల పేలిపోవడానికి డాక్టర్ దిలీప్‌కుమార్ కారకుడయ్యాడంటారని భయ పడ్డాను. కానీ మానవాతీతమయిన శక్తి నన్ను కాపాడింది" అతను ఆకాశం వేపుచూస్తూ రెండుచేతులెత్తి నమస్కరిం చాడు.

"డాక్టర్ దిలీప్‌కుమార్! మీరు మళ్ళీ అమెరికా వచ్చి విశ్వ మానవ కళ్యాణానికి పనికివచ్చే ప్రయోగాలు చెయ్యాలని, నా దేశం తరఫున మిమ్మల్ని అర్థిస్తున్నాను" అన్నాడు నికల్‌సన్.

"ఔను దిలీప్‌గారూ, మీరు మీ సంసారంతో బంధులు చేరి రండి. మీ శరీరంలో వున్న అణుశక్తిని, అదే

శక్తిని, మీ వారసుడయిన చిరంజీవి భానుప్రకాష్‌కు(వాటా తీసుకున్న బాబుకు) అది ఏమంత మంచిది కాదు. తేలిగ్గా దాన్ని మనం తీసివెయ్యవచ్చు. అందుకే మీరూ, మీ కుటుంబం అంతా బయలుదేరండి" అన్నాడు డాక్టర్ శాస్త్రి.

ఈ వార్త గాలిలా దేశం నలుమూలల వ్యాపించింది. వార్తాపత్రికలు రేడియోలు డాక్టర్ దిలీప్‌కుమార్‌ను గురించి ఘనంగా పొగిడారు. దేశ ప్రజలు దేశ నాయకులందరూ దేశం నలుమూలలనుంచి అతనికి అతని కుటుంబానికి అమెరికా వెళ్ళే సందర్భంగా శుభాకాంక్షలు తెలియజేశారు.

త్వరలోనే భారతదేశం తిరిగివస్తానని మాట ఇచ్చి డాక్టర్ దిలీప్‌కుమార్ కుటుంబ సభ్యులతోసహా అమెరికా ప్రయాణమైపోయాడు.

సమాప్తం.